# అరుణతార

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి: 37 సంచిక: 3 జనవరి-ఫిబ్రవరి 2014

పేజీలు: 76 వెల: రు. 20



## కామ్రేడ్ రవూఫ్‌కు అరుణారుణ జోహార్లు

నీళ్ల కనిపించకపోయే సరికే..
నది ఎండిందన్నారు
కొంచెం
ఇసుక తోడితే తెలిసింది
అది చెలిమె...

## 2014 జనవరి 11-12 తేదిలలో హనుమకొండలో జరిగిన విరసం 24వ రాష్ట్ర మహాసభల దృశ్యాలు

బాసగూడ నాటకంలోని దృశ్యాలు






305




సంపుటి : 37 * సంచిక : 5 - జూన్-జులై, 2014

## సంపాదక లేఖ...

తెలుగు ప్రజలు రెండు రాష్ట్రాల్లో కొత్త ప్రభుత్వాల కిందికి వచ్చారు. ఆంధ్రప్రదేశ్ పాలన కా.జానా బాబురావు, కా.నాగమణి, కా.కవితల ఎన్‌కౌంటర్‌తో ప్రారంభమైతే, తెలంగాణ పాలన ఉమ్మడి రాజధానికి గవర్నర్ ప్రత్యేక అధికారాలతో, పోలవరం బిల్లుకు నామమాత్ర నిరసనతో ప్రారంభమైంది. బియాస్ నదిలో ఇంజనీరింగు విద్యార్థులు జలసమాధి కావడం, మసాయిపేట గేటు లేని రైల్వే క్రాసింగ్ వద్ద జరిగిన బస్సు ప్రమాదంలో 18 మంది పిల్లలు చనిపోవడం, (ముగ్గురి పరిస్థితి ఇంకా విషమంగానే ఉంది) తూర్పుగోదావరి జిల్లాలోని నగరంలో పెట్రోలియం గ్యాస్ పైపులైన్ బద్దలయి 21 మంది కాలి చనిపోవడంల నేపథ్యంలో పాలనలు ప్రారంభమైయ్యాయి. రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ రైతాంగ ఆత్మహత్యలు కొనసాగుతూనే ఉన్నాయి. ఇవి ఇలా ఉండగా, రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు పెట్టుబడులను ఆకర్షించే పనిలో నిమగ్నమైపోయారు. నిత్య అవసరాల ధరలు కిందికి దించడం, అభివృద్ధి నినాదాలతో ఎన్నికల ప్రచారంలో ఊదరగొట్టిన నరేంద్రమోడి దేశ ప్రధానిగా 2 నెలలయినా తిరగకుండానే తన విశ్వ రూపాన్ని ప్రదర్శిస్తున్నారు. రైల్వే ఛార్జీలు, పెట్రోలు, డీజిల్ ధరలు పెంచేసారు. ఈ తప్పు నాది కాదు యు.పి.ఎ. పాలనదంటూ, గత పాలనలోని విధానాలు ఎక్కడయితే ఆగాయో సరిగ్గా అక్కడే తన పరుగును ప్రారంభించి బుల్లెట్ ట్రైన్‌లాగా జనంపైకి దూసుకువస్తున్నారు. రానున్న 'మంచి' రోజులు కార్పోరేట్ కంపేనీలకే అనేది అందలమెక్కిన మొదటి రోజునుంచే ప్రధాని మోడీ చెప్పకనే చెపుతున్నారు. గ్యాసు తరలించుకుపోవడంలో తమ లాభాలే తప్ప ప్రజల భద్రతతో నిమిత్తం లేని గ్యాసు కంపెనీల స్వభావం, బియాస్ నది లాడ్జీడ్యాం గేట్లు ఇసుక మాఫీయా కోసం తెరుచుకున్నాయన్న వాస్తవం, 67 ఏళ్ల స్వతంత్ర(?) భారత దేశంలో ఇప్పటికీ దాదాపు 12 వేల రైల్వే క్రాసింగ్‌లకు గేట్లు లేని దుస్థితి ఇవన్నీ పాలకులకు ప్రజల ప్రాణాల పట్ల ఉన్న పచ్చి నిర్లక్ష్యాన్ని, కనీస బాధ్యతలేని తనాన్ని సూచిస్తాయే తప్ప మరొకటి కాదు. ఇక పోలవరం బిల్లుతో 276 గ్రామాలు మునిగిపోయి, 3 లక్షల మంది ఆదివాసుల జీవితాలు అతలాకుతలం కానున్నాయి. ఇప్పుడు ఈ దేశంలో యుద్ధ ప్రాతిపదికన మైదాన ప్రాంత సమాజం యావత్తు ఆదివాసుల పక్షాన, అడవుల నుంచి వ్యక్తమవుతున్న ప్రజా ఆకాంక్షల పక్షాన నిలబడుతుందా? లేదా? అనే గీటురాయిపైననే మనందరి భవిష్యత్తూ ఆధారపడి ఉంది. లేకుంటే ఇవాల్టి మన మౌనం ఒక పెద్ద నేరంగా, ఘోరంగా భవిష్యత్తు సాక్ష్యమివ్వబోతోంది. తెలంగాణలో ప్రభుత్వ ఏర్పాటుకు అవసరమయిన సీట్లు గెలిచి, అధికారం చేపట్టిన టి.ఆర్.ఎస్. పార్టీ ప్రజాస్వామిక మేధావులందరిని వివిధ పద్ధతుల్లో పెద్ద ఎత్తున తన ప్రభుత్వంలో భాగం చేసుకుని అసమ్మతి లేకుండా చూసుకునే ప్రయత్నంలో ఉంది. కొందరు రచయితలు టి.ఆర్.ఎస్.కు ఓటేయాలని ఎన్నికల ముందు ప్రకటన ఇవ్వడం, తెరాస అధ్యక్షుడు కెసిఆర్ పత్రికా సంపాదకులతో సమావేశాలు నిర్వహించడం వంటివి చూస్తుంటే తెలంగాణలోని ప్రగతిశీల శక్తులను రాజ్యం తనలో ఎంత చాకచక్యంగా ఇముడ్చుకుంటుందో అర్థమౌతుంది. పోరాడే ప్రజల పక్షాన నిలబడి, నిరంతర ప్రతిపక్షంగా ఉండే బుద్ధిజీవులు దీని పట్ల అప్రమత్తంగా, చైతన్యపూర్వకంగా వ్యవహరించాల్సిన అవసరం ఉంది. ఎన్నికలకు ముందు మావోయిస్టు ఎజెండానే తన ఎజెండాగా చెప్పుకున్న టి.ఆర్.ఎస్. పార్టీ ఆ పార్టీపై నిషేధం గురించి గానీ, రాజకీయ ఖైదీల విడుదల గురించి గానీ ఏమీ మాట్లాడకుండా గత ప్రభుత్వాల నిర్బంధ విధానాలను కొనసాగించదలచుకున్నదని చెప్పకనే చెపుతున్నది.

ఇలాంటి సందర్భంలో జులై 28 పోరాడే ప్రజలకు, పీడిత ప్రజలందరికీ వెలుగు రేఖలా కాంతిని, ఉత్సాహాన్ని పంచుతూనే ఉంది. జులై 28 కా. చారుమజుందార్ అమరుడైన దినం. ఆ త్యాగ సంప్రదాయాలను కొనసాగిస్తూ అనేక మంది దేశవ్యాప్తంగా అమరులయ్యారు. అది ఈనాడు దేశవ్యాప్తంగా ఐక్యవిప్లవోద్యమ కృషిగా ముందుకు సాగుతోంది. జనతన సర్కారుగా వికసిస్తోంది. కా. సుశీల్ రాయ్ వంటి వారు ప్రజల కోసం పనిచేయడంలో ఉన్నతమైన త్యాగ సంప్రదాయాలను నెలకొల్పి మనకు మార్గదర్శకంగా నిలుస్తున్నారు. ఈ దేశ పీడిత ప్రజల విప్లవకలను సాకారం చేయడంలో తన కర్తవ్యాన్ని సాహిత్య, సంస్కృతిక రంగంలో కొనసాగించడంలో భాగంగానే విరసం తన ఆవిర్భావ దినాన్ని ఈసారి కా. గంటి ప్రసాదం తొలి వర్ధంతితో కలుపుకొని అమరులను సంస్మరించుకోవడంలో భాగంగా అమరుల బంధుమిత్రుల సంఘంతో కలిసి జరుపుకుంది.

**తాజాకలం :** ప్రముఖ భాషవేత్త, ప్రజాస్వామికవాది చేకూరి రామారావు జూలై 24న అనారోగ్యంతో హైదరాబాద్‌లోని తన ఇంటిలో కన్ను మూశారు. ఆయనకు విరసం జోహార్లు తెలియజేస్తూ నివాళులు అర్పిస్తోంది. ఆయన కుటుంబ సభ్యులకు, సహచరులకు ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తోంది. ఆయనపై రచనలు రాబోయే సంచికలో ప్రచురిస్తాం. - సం.



సంపాదకుడు
**చలసాని ప్రసాద్**
వర్కింగ్ ఎడిటర్
**డి.వి. రామక్రిష్ణారావు**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500 040.
* కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా
రచనలు పై చిరునామాకూ,
ఇ-మెయిల్ ద్వారా
arunatara1977@gmail.com కూ
పంపవచ్చు
సంపాదకవర్గం :
**ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్**
*చందాలు పంపాల్సిన చిరునామా*
మేనేజర్
**ఎస్. రవికుమార్**
5-1307, దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.
సెల్ : 9866021257
విరసం కార్యదర్శి చిరునామా
**పి. వరలక్ష్మి**
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.
డి.టి.పి. అండ్ లే అవుట్
**ఆర్. భాగ్యలక్ష్మి**
1, 4 కవర్ డిజైన్
**పి. వరలక్ష్మి, క్రాంతి**
2, 3 కవర్ డిజైన్
**ఆర్. భాగ్యలక్ష్మి**
2 కవర్ ఫొటోలు
**విజయవాడ: కోయ వెంకటేశ్వర్లు,**
**హైదరాబాద్: శివ**
http://www.facebook.com/arunatara.virasam
Virasam website : *www.virasam.in*
*ఈ సంచిక వెల : రు. 20/-*

## సంచిక - 305



*(గమనిక : కె.వి. కూర్మనాథ్ - సూర్యుడు సీరియల్ రాబోయే సంచికలో ప్రచురిస్తాం - సం.)*

విరసం సాహిత్యాన్ని కరపత్రాలను, స్టేట్‌మెంట్లను, అరుణతార పత్రికను **www.virasam.in** వెబ్‌సైట్‌లో చూడవచ్చు. అలాగే వివిధ సాహిత్య పత్రికల బ్లాగులు, సైట్‌ల లింకులను కూడా చూడవచ్చు.

అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.
విడి సంచిక వెల - రు. 15; సంవత్సర చందా - రు. 180;
రెండు సంవత్సరాల చందా - రు. 350; మూడు సంవత్సరాల చందా - రు. 500;
ఐదు సంవత్సరాల చందా - రు. 800; దశాబ్ది చందా - రు. 1600/-

# మనమూ, గాజా

- పి.వరలక్ష్మి

"నాగరికులకు, అనాగరికులకు మధ్య జరిగే ఏ యుద్ధమైనా సరే, నాగరికుల పక్షాన నిలవండి. ఇజ్రాయిల్‌కు మద్దతివ్వండి. జిహాదును ఓడిరచండి." - ఇది ఇజ్రాయిలీ ప్రచారం మాత్రమే కాదు, ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యవాద ప్రచారం కూడా. తీవ్రవాదం మీద యుద్ధం పేరుతో, జాతి, మతం కోరలు చాచుకుని దురాక్రమణ నీడలు పరుచుకుంటున్నాయి. చాలా విచిత్రంగా నాజీ జాత్యాహంకారానికి ఘోరమైన పీడనను ఎదుర్కొన్న యూదు జాతీయుల వారసులు నేడు ఏ సంబంధమూ లేని పాలస్తీనియన్లపై దురాక్రమణ యుద్ధానికి తెగబడి అదే ఫాసిస్టు ప్రచారాన్ని అందుకున్నారు. ప్రపంచం పటంలో ప్రతి అణువునూ సామ్రాజ్యవాద మార్కెట్ క్షిపణులు లక్ష్యం చేసుకున్నాక పాత్రలే మారుతాయి గాని యుద్ధం అదే. వెస్ట్ బ్యాంకులో గుర్తు తెలియని వ్యక్తులచే ముగ్గురు యూదు యువకుల అపహరణ, హత్యకు ప్రతీకారంగా ఇజ్రాయిల్ "తీవ్రవాదుల"పై యుద్ధం ప్రకటించింది. జులై 8 నుండి ఆపరేషన్ ప్రొటెక్టివ్ ఎడ్జ్ పేరుతో గాజాపై యుద్ధం మొదలైనప్పటికే ఆ నగరంపై విచక్షణారహితంగా దాడులు కొనసాగుతున్నాయి. అప్పటికే కనపడకుండా పోయిన యూదు యువకుల కోసం గాలిస్తూ వందలాది ఇళ్లను నేలమట్టం చేసింది. ఆ యువకులను చంపివేసింది హమాస్ సంస్థకు చెందినవాళ్ళంటూ ఆ సంస్థకు చెందిన స్థావరాలను టార్గెట్ చేస్తున్నట్లు చెప్తూ గాజాపై విరుచుకుపడిన ఇజ్రాయిల్‌కు అమెరికా దన్నుగా ఉందన్న విషయం బహిరంగమే. హమాస్ దుశ్చర్యకు సమాధానమనో, దాడులకు ప్రతిదాడులనో, ఆత్మరక్షణా దాడులనో ఇజ్రాయిల్ చెప్పుకొస్తున్నపుడు మనం గోద్రా, కంధమల్ వంటి సంఘటనలు గుర్తు చేసుకుంటే ఆ యుద్ధంలో మనమూ ఎట్లా భాగమో అర్థమవుతుంది. అందుకే గాజాను పరామర్శించడం అంటే మన గాయాల్ని మనం తడుముకోవడం.

తీవ్రవాద సంస్థగా ముద్ర వేయించుకున్న హమాస్ నిజానికి ఇజ్రాయిల్ చేత ఆక్రమణకు గురైన పాలస్తీనా విముక్తి కోసం ఏర్పడిన సాయుధ పోరాట సంస్థ. హమాస్ స్థావర ప్రాంతాల లక్ష్యంగా సాగుతున్నదని అంటున్న యుద్ధానికి పౌరుల ఆవాసాలూ, పాఠశాలలు, ఆసుపత్రులు... పాలస్తీనియన్లకు సంబంధించిన ప్రతి ఉనికీ బాంబులతో దద్దరిల్లుతున్నది. ప్రపంచంలోనే శక్తివంతమైన సైన్యం పాలస్తీనా పసిమొగ్గలను బూడిద చేస్తున్నది. లేలేత శరీరాలు రెక్కలు తెగి రక్తమోడుతున్నాయి. జులై నెలాఖరుకు ఇజ్రాయిల్ దాడుల్లో 15 వందల మందికి పైగా చనిపోయారు. లక్షన్నర మందికి పైగా సర్వం కోల్పోయి ఉత్తచేతులతో మిగిలారు. విగతజీవులు, క్షతగాత్రులు ఎక్కువగా పిల్లలే. ప్రపంచంలోనే అతిపెద్ద సైనిక శక్తి ధాటికి పాలస్తీనా లేలేత దేహాలు ఛిద్రమవుతున్నాయి. ప్రపంచంలో అతి పెద్ద ప్రజాస్వామ్యం తన పిల్లలనే లక్ష్యం చేసుకొని సాగిస్తున్న ఆకుపచ్చ వేటలో గాయపడుతూ, ఎదిరిస్తూ, గొంతెత్తుతూ, గానం చేస్తున్న భారత విప్లవ ప్రజానీకం సామ్రాజ్యవాదాన్ని సవాలు చేస్తున్నట్లే పాలస్తీనా యుద్ధంలో జీవిస్తూ విముక్తి గీతం ఆలపిస్తున్నది. ఇండియాలో విప్లవోద్యమాన్ని నిర్మూలించడానికి తయారైన ప్రత్యేక బలగాలు ఇజ్రాయిల్‌లో శిక్షణ తీసుకుంటున్న వారు కావడం కాకతాళీయం కాదు. అరబ్బు దేశాల ప్రకృతి వనరుల దోపిడికి గాజా ఎట్లా వ్యూహాత్మక ప్రాంతమో, గ్రీన్‌హంట్‌కు లక్ష్యమైన దండకారణ్యం అరుదైన అమూల్యమైన సంపదలకు నెలవు. అందుకే గాజా పక్షాన నిలబటమంటే ఉమ్మడి శత్రువు సామ్రాజ్యవాదాన్ని నిలదీయడమే.

నెత్తురోడుతున్న గాజా తాజా చిత్రపటం ఇప్పుడు వార్తల్లో విశేషం అయ్యింది కాని డెబ్బై ఏళ్ళుగా పాలస్తీనా రక్తపు మడుగులో పెనుగులాడుతూనే ఉంది. సామ్రాజ్యవాద వ్యూహాలకు ఆ చిన్న భూభాగం నెర్రెలు చీలుతూ, నెత్తురు చిమ్ముతూ ఉంది.

శతాబ్దాల జాతి వివక్షతను, హింసాత్మక దాడులను, జాతిహనన యుద్ధాల్ని ఎదుర్కున్న యూదులకు ప్రత్యేక దేశం కావాలన్నది ఎప్పటి నుండో ఉన్న కల. దీనిని అగ్రరాజ్యాలు తమకు అనుకూలంగా వ్యూహాత్మకంగా మలచుకున్నాయి. మతం దాని ఆయుధం కావడం విచిత్రమేమీ కాదు. పాలకవర్గాల మానసిక యుద్ధానికి మతం ఎప్పుడూ ఆయుధమే. వివిధ ప్రాంతాల నుండి తరిమివేయబడిన యూదులు పాలస్తీనాకు వలస రావడం నాజీ దాడుల కాలంలో ముమ్మరమైంది. సహజంగా స్థానికులకు అది ఇబ్బందికరంగా తయారైనా బ్రిటీష్ వలసవాదులు కుయుక్తితో దానిని సమస్యాత్మకం చేసారు. పాలస్తీనీయుల భూమి క్రమంగా అన్యాక్రాంతం కాసాగింది. పాలస్తీనాలో యూదుల కోసం ప్రత్యేక దేశం ఏర్పాటు చేయాలనే ప్రతిపాదనను స్థానిక అరబ్ నాయకులు తీవ్రంగా వ్యతిరేకించారు. అయితే అప్పటికే సామ్రాజ్యవాద మార్కెట్ శక్తులు పాలస్తీనాను వ్యూహాత్మక ప్రాంతంగా గుర్తించి దానిపై తమ పట్టు నిలబెట్టుకోడానికి ఇజ్రాయిల్‌ను సృష్టించడం, 1947 నాటికి ఐక్యరాజ్యసమితి తీర్మానం ఇజ్రాయల్, పాలస్తీనా దేశాల సరిహద్దులను గుర్తించడంతో కీలకమైన చమురు దేశాల మధ్యలో వారికి సైనిక స్థావరమే దొరికినట్టయింది. పాలస్తీనా సగం భూభాగం కోల్పోయి జెరుసెలెం, వెస్ట్‌బ్యాంక్, గాజా ప్రాంతాలను మిగిలించుకుంది. అప్పటికే బలమైన సైనిక శక్తిగా ఉన్న యూదులతో అరబ్ విముక్తి సైన్యం తలపడి ఓడిపోయింది. ఇరుగుపొరుగు ఈజిప్టు, ఇరాక్, సిరియా, లెబనాన్, జోర్డాన్ దేశాల సైన్యాలు కూడా సామ్రాజ్యవాదుల మద్దతు ఉన్న ఇజ్రాయిల్ ముందు నిలవలేకపోయాయి. ఇజ్రాయిల్ అంతటితో ఆగకుండా మొత్తం పాలస్తీనా భూభాన్నంతా ఆక్రమించి యూదు రాజ్యం స్థాపించే లక్ష్యంతో క్రమక్రమంగా సరిహద్దులు దాటి చొచ్చుకుని వచ్చింది. అంతర్జాతీయ ఒప్పందాలను అమెరికా అండతో యథేచ్ఛగా ఉల్లంఘించింది. ఫలితంగా పాలస్తీనా భూభాగంలో అడ్డంగా కంచెలు

సంపాదకీయం-2

# ఆదివాసుల నెత్తుటితో నవ్యాంధ్ర

- పాణి

ఈ నెల 19వ తేదీ గుంటూరు జిల్లా నల్లమల పరిసర ప్రాంతాల్లో జరిగిన బూటకపు ఎన్‌కౌంటర్లో ముగ్గురు మావోయిస్టులు మరణించారు. అస్తిత్వ చైతన్యం విస్తరించిన కాలం కాబట్టి వాళ్లలో ఇద్దరు ప్రిమిటివ్ ట్రైబ్‌కు చెందిన చెంచులని, ఒకరు బీసీ కులస్తురాలని అనుకోవడం కూడా సబబుగా ఉంటుంది. ప్రాంతీయ చైతన్యం ఉధృత పోరాటంగా మారి తెలంగాణ రాష్ట్రం ఏర్పడింది కాబట్టి అందులో ఇద్దరు తెలంగాణ ప్రాంతీయులనీ గుర్తిద్దాం. ఆ ముగ్గురిలో ఇద్దరు మహిళలు కూడా.

మావోయిస్టులకు ఈ రాజ్యాంగం మీద నమ్మకం, గౌరవం ఏమీ లేనందున వాళ్లను చంపేయడం సబబే అనుకున్నా... మనుషులను అస్తిత్వాలతో గుర్తించే వాళ్లకు ఆ ఎన్‌కౌంటర్‌లో చనిపోయింది, తమ సాంఘిక మానవులని అనిపించినట్టు లేదు.

రాష్ట్ర విభజన వల్ల ఏర్పడ్డ కొత్త ఆంధ్రప్రదేశ్‌కు అప్పులు తప్ప మరేమీ మిగల్లేదని, తన సారథ్యంలో నవ్యాంధ్ర నిర్మాణానికి కూలీ నెంబర్ 1గా పని చేస్తానంటున్న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడికి ఈ అస్తిత్వాల విచికిత్స ఉంటుందని ఎందుకనుకోవాలి? విభజన వల్ల ఇక మిగిలింది అలానాటి ఆంధ్రరాష్ట్రమే కాబట్టి శ్రీబాగ్ ఒప్పందం ప్రకారం రాయలసీమలో రాజధాని ఏర్పాటు చేయాలని ఆ ప్రాంతీయులు ఆందోళన చేస్తోంటే అదేమీ పట్టించుకోకుండా కోస్తా సంపన్న వర్గాల ఆకాంక్ష మేరకు గుంటూరు, విజయవాడల మధ్య రాజధాని ఏర్పాటుకు సన్నాహంగా అక్కడే ప్రమాణ స్వీకారం చేశారు. అది నవ్యాంధ్ర నిర్మాణానికి నాందీ అని అన్నారు గాని, నెల తిరగకుండానే అదే గుంటూరు జిల్లాలో ఆయన పోలీసులు చేసిన బూటకపు ఎన్‌కౌంటర్‌తో అసలైన నాందీ ప్రస్తావన జరిగినట్లయింది.

ఓట్లు మంత్రుల చిరునామాలు మాత్రమే మారుస్తాయని అన్నట్లు రాష్ట్ర విభజన వల్ల ప్రజల భౌగోళిక చిరునామాలు మారుతాయి గాని అక్కడా, ఇక్కడా పాలకుల విధానాలు ఏమాత్రం మారవు. తాను తొమ్మిదేళ్లు ముఖ్యమంత్రిగా పని చేశానని ఆయన పదే పదే చెప్పుకోవడం స్వయం ప్రశంస కానేకాదు. తన విధానాలేమిటో మర్చిపోకుండా గుర్తు చేయడానికే.

బలవత్తరమైన పెట్టుబడిదారీ శక్తుల పక్షాన తాను ఉంటానని, వాళ్ల ప్రయోజనాలే తన రాజకీయమని కోస్తాలో రాజధాని సన్నాహాల ద్వారా ప్రకటించుకున్నారు. ఆయన తొమ్మిదేళ్ల పాలనకు, కాంగ్రెస్ పదేళ్ల పాలనకు కొనసాగింపుగా తాజాగా కార్పొరేట్ అనుకూల రాజకీయార్థిక విధానాలే అమలవుతాయి. అందులో ఎన్‌కౌంటర్లు కూడా ఉంటాయని ఈ ఘటన సూచిస్తోంది. రాష్ట్రం కొత్తదే, నవ్యాంధ్ర అనే విశేషణం కూడా కొత్తదే. ఎన్‌కౌంటర్లు మాత్రం పాతవే.

అందుకే సుమారు పదేళ్ల నుంచి నల్లమలలో చెంచుల మధ్య సాధారణ జీవితం గడుపుతూ, ఆదివాసులకు వ్యవసాయం నేర్పిస్తూ ఉన్న జానా బాబూరావును, నాగమణిని, కవితను నవ్యాంధ్ర పోలీసులు కాల్చేశారు. వైఎస్ రాజశేఖరరెడ్డి ప్రభుత్వంలోకి వచ్చాక జరిగిన శాంతి చర్చలు అర్థాంతరంగా ముగిసిపోయి, తీవ్రస్థాయి నిర్బంధం పెరగడంతో మావోయిస్టులు నల్లమలను ఖాళీ చేసి ఇతర విప్లవ స్థావరాల్లోకి వెళ్లిపోయారు. ఆ సమయంలో ఈ ముగ్గురు ఇక్కడే నల్లమల ఆదివాసుల మధ్యే ఉండిపోయారు. అయితే వాళ్లు ఎలాంటి విప్లవ రాజకీయ కార్యక్రమం నిర్వహించలేదని తెలుస్తోంది. అంతక ముందు చెంచులకు వ్యవసాయం నేర్పించిన మావోయిస్టు పార్టీ కార్యక్రమాన్ని వ్యక్తిగత స్థాయిలో చేపట్టి వాళ్లతో కలిసి జీవిస్తున్నారు. చెంచులకు వ్యవసాయం నేర్పించడం నేరం ఎట్లా అవుతుంది? ఆ

---

మొలుచుకుని వచ్చి ఆ దేశాన్ని ముక్కలు చెక్కలు చేశాయి. పాలస్తీనాకు మొదట అండగా నిలిచిన అరబ్ లీగ్ ఆ తర్వాత విచ్ఛిన్నమయింది. కొంత కాలం మద్దతు ఇచ్చిన దేశాల పాలకులు అమెరికా పాదాక్రాంతమయ్యారు. ఒంటరిగానైనా, ఓడిపోతున్నా పాలస్తీనా మాత్రం అట్లాగే తలవంచక నిలుచున్నది.

భారతదేశం తన అలీన విధానంలో భాగంగా అప్పట్లో ఇజ్రాయిల్ దురాక్రమణను వ్యతిరేకించింది. క్రమంగా ప్రభుత్వ విదేశాంగ విధానంలో మార్పు వచ్చినా ఎక్కడో పాలస్తీనా పట్ల సానుభూతి వ్యక్తమయ్యేది. ఇప్పుడు మోడీ ప్రభుత్వం మాత్రం స్పష్టంగా పార్లమెంటులో చర్చను కూడా అనుమతించకుండా తన వైఖరి చాటింది. ఒకప్పుడు జాత్యాహంకారంతో యూదుల్ని ఊచకోతకోసిన హిట్లర్, ఇప్పుడు యూదుజాతీయవాదం పేరుతో అటువంటి ఫాసిజాన్నే అమలుచేస్తున్న ఇజ్రాయిల్ రెండూ మోడీ హిందుత్వకు ఆదర్శమే. సామ్రాజ్యవాద దళారీ ప్రయోజనాలు సరేసరి.

యుద్ధ శిథిలాల మధ్య జీవిత శకలాలు ఏరుకుంటూ పాలస్తీనియన్లు ఎప్పటికైనా స్వేచ్ఛా గాలులు పీలుస్తామనే ఆశతో బతుకుతుంటారు. ఆక్రమిత ప్రాంతాలు పోగా "గాజా" అనే ఒక ముక్క నేలంతా నిర్బంధ శిబిరం. అరబ్ ప్రపంచాన్ని ఆనుకుని ఈజిప్టుతో చిన్న సరిహద్దు దానికుంది. అక్కడ నిత్యం నిఘా నీడన బతుకు సాగవలసిందే. కశ్మీర్‌లాగా, ఇండియా ఈశాన్య ప్రాంతంలో చిక్కుపడిన వివిధ జాతుల లాగా, వాటి కన్నా ఎన్నో రెట్లు అధికంగా నిర్బంధ పీడనలో. గాజా ప్రపంచంలోనే అతి పెద్ద నిర్బంధ శిబిరం కదా. అక్కడ ఆకాశ తలంలో పక్షుల్లా ఎగిరే డ్రోణుల కింద నిరంతర యుద్ధక్షేత్రాల్లో పిల్లలు బరువైన కవచాలు ధరించి ఆడుకుంటూ కనిపిస్తుంటారు. ప్రపంచవ్యాప్తంగా ప్రభుత్వాలకు పాలస్తీనా చావు బతుకులు ముఖ్యం కాకపోవచ్చు. సామ్రాజ్యవాదానికి బలవుతున్న ప్రపంచ పీడిత ప్రజలందరి శ్వాస గాజా పిల్లల ఊపిరితో సుడితిరుగుతోంది. అందుకే గాజా వెంటే మనం.



# కా. జవ్వాజి వెంకట సుబ్బయ్యకు జోహార్లు

- డప్పు రమేష్

నల్లా చెరువు ఎఱ్ఱామల్లె
విప్లవ పార్టీ ముద్దు బిడ్డ
కష్టా జీవుల కంటీ వెలుగు
పేదా ప్రజల ప్రేమికుడు
అమరూడయ్యిండే వెంకట సుబ్బయ్య
ఆదర్శమయ్యిండే రంగయ్య మాస్టరు ॥అమర॥

ఒంగోలు జిల్లాలోని ఆముదాల పల్లేలోన
కొండయ్య కొండమ్మల నిరుపేదల ముద్దూబిడ్డ
ఆకలి బాధ తీర్చుకోను అమ్మనాన్నల నిడ్సిపెట్టి
పొట్టా సేత బట్టూకోని - గుంటూరుకు వచ్చీనాడు
కార్మికుల్లో గల్సినాడు - కూలీపనులు జేసీనాడు
కమ్యూనిస్టయ్యే - వెంకట సుబ్బయ్య
కార్మికుల గుండయ్యే రంగయ్య మాస్టరు ॥కమ్యూ॥

నక్సల్బరీ పిలుపుతోనే - మల్పూదిరిగే సుబ్బయ్య
గురవయ్య, సూర్యం, వెంకట్రావు, ఏసన్నాలతో
ఆయుధ మెత్తిండే - వెంకట సుబ్బయ్య
సాయుధుడయ్యిండే - రంగయ్య మాస్టారు ॥ఆయుధ॥

కూలీ నాలి గుడ్సేలల్లో గంజీ గట్కా దాగీనోడు
కారం మెత్కులు బెట్టిన గానీ కమ్మగ తినీ తిర్గీనోడు
ఏడుస్తున్న పసి పిల్లల నెత్తుకొని ఆడించేటోడు
నడ్వలేని ముసలి వాళ్ళ చెయ్యపట్టి నడిపించేటోడు
చెల్లేలాను తమ్మూలాను ముద్దు ముద్దుగ బిలిచేటోడు
జాలీ గుండోడే వెంకట సుబ్బయ్యగారు
వర్గా ప్రేమోడే - మన రంగయ్య మాస్టరు ॥జాలీ॥

భార్యా పిల్లాలాను వదిలి బందూకును చేతబట్టి
భూపోరూ నడ్పనీకీ అడవీ ఉద్యమాలకెళ్ళి
అరెస్టయ్యిండే వెంకట సుబ్బయ్య
బందీ అయ్యిండే రంగయ్య మాస్టరు ॥అరె॥

జైలు నుండి విడుదలయ్యి పల్నాడు కెళ్ళీనాడు
జూలకల్లు, నకరీకల్లు, గుత్తీకొండ భూములల్లో

---

పని ఐటీడీఏ కూడా ప్రకటించుకుంది. బహుశా వాళ్ళు ప్రకటించుకొని విస్మరించిన పనిని మావోయిస్టు ఉద్యమ చైతన్యం వల్ల ఈ ముగ్గురు వ్యక్తులుగా ఎంతో కొంత ఆచరణలో పెట్టి ఉండవచ్చు. నిజానికి నల్లమలలో మావోయిస్టు కదలికలు లేవని ఎన్నోసార్లు పోలీసు అధికారులు ప్రకటించారు. అయినా ఈ ముగ్గురి ఉనికిని పోలీసులు భరించలేకపోయారు.

జానా బాబురావు నెల్లూరు జిల్లా తోకల పల్లెకు చెందిన చెంచు. 1995 నుంచి విప్లవోద్యమంలో చేరాడు. నాగమణి మహబూబ్‌నగర్ జిల్లా అమ్రాబాద్ మండలం మాదవానిపల్లెకు చెందిన చెంచు. వీరిద్దరూ భార్యాభర్తలు. కవితది మెదక్ జిల్లా కొండపాక మండలం వడెంచెరువు గ్రామం. ఈమె ముదిరాసి కులస్తురాలు. విప్లవోద్యమంలోకి రాక ముందు ఆ గ్రామ సర్పంచ్‌గా కూడా పని చేసినట్లు తెలుస్తోంది. ఈమె గొంతులో కూడా బుల్లెట్లు దించారు. వేరు వేరు సామాజిక నేపథ్యాల నుంచి వచ్చిన ఈ ముగ్గురు తమ చైతన్యవంతమైన ఆచరణతో వర్గ అస్తిత్వాన్ని రూపొందించుకున్నారు.

అయితే నవ తెలంగాణ నిర్మాణానికి కంకణబద్ధుణ్నని చెప్పుకుంటున్న కేసీఆర్‌కు తన రాష్ట్ర పౌరులు ఇద్దర్ని పక్క రాష్ట్రంలో కాల్చేస్తే చీమ కుట్టినట్లు కూడా లేదు. తెలంగాణ ఏర్పాటు ఆ ప్రాంత ప్రజలు ఆత్మగౌరవ సమస్యే అయినా, దాని వల్ల అక్కడి ప్రజలకు కొన్ని ప్రయోజనాలు తీరే అవకాశం ఉన్నా వర్గ భాషలో చెప్పాలంటే, తెలంగాణ ప్రాంతీయ బూర్జువా వర్గం అధికారం పొందడం తప్ప మరేమీ అందులో లేదు. అయితే నోటి మాటగా అయినా తన పాలనలో తెలంగాణ అట్టడుగు ప్రజలకు అన్ని రకాల సంక్షేమం అందిస్తానని చెబుతున్న కేసీఆర్ అందరిలోకెల్లా అట్టడుగున ఉండే చెంచు యువతిని చంపేసినా, ఒక బీసీ మహిళను హత్య చేసినా ఎందుకు పట్టించుకోలేదు? ఆయన నవ తెలంగాణ నిర్మిస్తాడనే భరోసాతో ఈ ప్రశ్న వేయకుండా ఎందుకు ఉండాలి? ఇంతకూ ఎన్‌కౌంటర్ల గురించి ఆయన ఏమనుకుంటున్నారు? చట్టబద్ధ పాలన గురించి ఆయన అభిప్రాయాలేమిటి?

ఇందాక చెప్పిన వర్గభాషలో అయితే ఏ ప్రాంత బూర్జువా వర్గానికైనా చట్టం పట్ల, రాజ్యాంగం పట్ల గౌరవం ఏమీ ఉండవు. ఉన్నట్లు నటిస్తుంటారు. కేసీఆర్‌కు అయితే ఏకంగా మావోయిస్టు ఎజెండానే తెలంగాణలో అమలు చేస్తానని అనడం అలవాటు. భారత రాజ్యాంగం మావోయిస్టు ఎజెండాను అంగీకరించదని ఆయనకు తెలిసినట్లు లేదు. అందుకే తన రాష్ట్రంలోని పౌరులకు రాజ్యాంగం ఇచ్చిన జీవించే హక్కు గురించైనా ఆయన ఏమనుకుంటున్నారు? నవ్యాంధ్ర రాజకీయ హత్యల గురించి నోరు మెదపడం లేదంటే నవ తెలంగాణ విధానం కూడా అదే అనుకోవాలి. ఆయన చెప్పినా చెప్పకపోయినా వర్గపరంగా అదే నిజమైనా... ఆయన తెలంగాణ ప్రేమలో అత్యంత వెనుకబడిన పాలమూరు నాగమణికి, మెతుకు లేని మెదక్ కవితకు చోటు ఉందా? అనేది ఆయన రాజకీయ నైతికతకు సంబంధించిన ప్రశ్న.

ఆయనంటే రాజకీయ నాయకుడు ఏమైనా చెప్పగలడు. ఏమైనా చేయగలడు. తెలంగాణ ప్రజల పక్షాన నిరంతరం అప్రమత్తంగా ఉండే తెలంగాణ వాదుల్లో ఒక్కరికి కూడా తమ ఇద్దరు పౌరుల్ని సీమాంధ్ర వలసవాద ప్రభుత్వం కాల్చేసిందనే సోయి లేకపోవడాన్ని ఏమనాలి? బహుశా ఈ మౌనం రేప్పొద్దున నవ తెలంగాణ ప్రభుత్వం చేయబోయే రకరకాల హత్యలపట్ల వైఖరి అనుకోవాలా? ఈ మాటా చాలా బాధాకరమే. అయినా ఈ సమాజంలో అన్ని శ్రేణులకంటే అత్యంత వెనుకబడిన చెంచుల గురించి మాట్లాడేటప్పుడు ఇంత కఠినంగా ఉండక తప్పదు మరి.



జెండాలెత్తిండే - వెంకట సుబ్బయ్య
దండూ నడిపిండే - రంగయ్య మాస్టరు ॥జెండా॥

దేవుడి మాన్యం భూములాను - ఫారెస్టు భూములాను
దున్నేవారికి దక్కాలాని - రైతూ కూలీ సంఘం బెట్టి
అరకలు గట్టిండే వెంకట సుబ్బయ్య
గాభూములు దున్నించే రంగయ్య మాస్టరు ॥అరక॥

జూలకల్లు పల్లేవాళ్లు - కాలువదాక బోవాలంటె
కాలిబాట దారీ విడువక ఊరీ దొరలు బాధిస్తుంటె
సంఘాన్ని గదిలించే వెంకట సుబ్బయ్య
రోడ్డు - తవ్వీపోయించే రంగయ్య మాస్టరు ॥సంఘా॥

కంభం బేస్త వారిపేట, గిద్దాలూరు కనిగిరి
ఫారెస్టోల్ల మీద ప్రజల కూడాగట్టి పోరూ నడిపె
వాళ్ళ గురవయ్య సారయ్యే వెంకట సుబ్బయ్య
గూడేల గురవయ్యే మన రంగయ్య మాస్టరు ॥వాళ్ళ॥

నీడాలేని పేదా వారితో గుడిశెలు వేయించి నాడు
గుంటూరులో శ్రమ జీవుల బస్తీలల్లో అల్లుకపాయె
మన కష్టాజీవులా - మన వెంకట సుబ్బయ్య
వాళ్ల కంటీ వెలుగయ్యే - మన రంగయ్య మాస్టరు ॥మన॥

సిటీ బస్సుల కార్మికుల్లో, పేరేచర్ల క్వారీలల్లో
రైసూమిల్లు కార్మికుల్లో, జూటూమిల్లు కార్మికుల్లో
ఎత్తిన జెండమ్మో వెంకట సుబ్బయ్య
మన విప్లవ జెండమ్మో రంగయ్య మాస్టరు ॥ఎత్తిన॥

కూరగాయల మార్కెట్లో - కూలీలను కూడాగట్టి
ప్లాస్టిక్ కంపెనీ కార్మికులా - వర్గాపోరు నడిపినాడు
వాడా వాడల్లో వెంకట సుబ్బయ్య
పోరు జెండెగరేసిండే రంగయ్య మాస్టరు ॥వాడా॥

సత్తెనపల్లి స్టేషను ముందు - ఇళ్ళ స్థలాల పోరులోన
నర్సరావు పేట ల్యాబు లాకౌటుకు నిరసనగా
పోరూ నడిపిండే వెంకట సుబ్బయ్య
ఆ సంఘం నడిపిండే మన రంగయ్య మాస్టరు ॥పోరు॥

వేంపెంట దళితులను - చంపీనోళ్ళను శిక్షించాలనె
పులిచింతా ప్రాజెక్టు - వ్యతిరేక పోరు నడిపె
రైతుకూలీ సంఘానికి - రాష్ట్ర నాయకుడిగ ఉండి
పేదా ప్రజల పోరాటాల్లో - ముందుండీ నడిచినాడు
ప్రజల ప్రేమ పొందీనాడు - ప్రజల గుండెలో నిల్చీనాడు
పోరూ బిడ్డమ్మో - వెంకట సుబ్బయ్య
గొప్ప త్యాగశీలమ్మో రంగయ్య మాస్టరు ॥పోరు॥

పీపుల్స్ వార్ పార్టీలోన అంతరంగిక పోరాటంలోన
త్యాగం చేసే వాళ్ళ పక్షం నిలబడ్డ పోరుబిడ్డా
నీతి గల్లోడే వెంకట సుబ్బయ్య
గుండె ధైర్యం గల్లోడే మన రంగయ్య మాస్టరు ॥నీతి॥

గుత్తికొండ బిలంకాడ మావోయిస్టు మహాసభా
అమర వీరుల నెత్తుటి జెండా ఆవిష్కరణ జేసీనాడు
జన బలమూను జూపిండే వెంకట సుబ్బయ్య
జంగు సైరనూదిండే మన రంగయ్య మాస్టరు ॥జన॥

గల గల మాట్లాడెటోడు - కిల కిల కిల నవ్వెటోడు
చక చక చక నడిచెటోడు - చురుకుగా పని జేసెటోడు
వెన్నెలయ్యిండే - వెంకట సుబ్బయ్య
వేగు చుక్కైనిల్చిండే - మన రంగయ్య మాస్టరు ॥వెన్నె॥

మార్క్సిజమూ - లెనినిజమూ - మావోయిజం నమ్మినాడు
ప్రజలే నా ప్రాణమని - అమరులె ఆదర్శమనీ
కులాల్లేని, మతాల్లేని దోపిడిలేని రాజ్యం కొరకు
పట్టిన జెండ నిదువాకుండ గట్టిగా నిల్చిన మహావ్యక్తి
అమరూడయ్యిండే - వెంకట సుబ్బయ్య
ఆదర్శమయ్యిండే - రంగయ్య మాస్టరు ॥అమ॥

## కో కో అని కోయిలా పాట గట్టి పాడెరా

*- తంగెళ్ల సుదర్శనం*

కో కో అని కోయిలా పాట గట్టి పాడెరా
కోటన్న జాడేదని కొమ్మ కొమ్మనడిగెరా ॥కో కో॥

పైరగాలికూగేటి పచ్చని పైరులారా
ఎరుపెక్కి పూసేటి పున్నమి పువ్వులారా
పోరు వాసనలు జల్లిన తావిజాడ ఏదని ॥కో కో॥

ఆకశాన ఎగిరేటి పక్షి తల్లులారా మీరు
జల జల పారేటి పిల్లయేరులారా మీరు
అన్న అడుగుల జాడలనెక్కడైన చూసినారా ॥కో కో॥

దుంకులాడే జింకలారా గంతులేసే దుప్పులారా
ఆటలాడె లేడి కూనలారా మీరు ఎరుగుదురా
అన్న అడుగుల సవ్వడినెక్కడైన విన్నారా ॥కో కో॥

కమ్యూనిస్టు సిద్ధాంతం తనువంతా నింపుకొని
ఆచరణే ఆయుధంగా అనునిత్యం నడిచినోడు
పేద ప్రజల విముక్తికై పోరుదారులేసినోడు ॥కో కో॥

జగిత్యాల జైత్రయాత్ర జంగల్ మహల్ దాటి

లాల్ జెండనెగరేసి జంగ్ జేసినోడురా
యుద్ధాన్నె ముద్దాడిన పోరునౌక ఏదని ॥కో కో॥

# కంట నీరు పెట్టకే... విప్లవ కెరటమా

**- మీరా**

కంటనీరు పెట్టకే
విప్లవ నిప్పుకెరటమా
నీకు ఎవ్వరు సాటి ఓ నేస్తమా....

చీకటిపై రేపటి వెలుగయ్యే
ఆశయాల ఆకాశమా
నింగిపై వెలిగే నక్షత్రమా ॥కంట॥

ఓటమిపై గెలుపుకై
ఉరకలేసే సముద్రమా
ఉద్యమాలకు ప్రతిరూపమా ॥కంట॥

రక్తబంధంకన్న వర్గబంధంమిన్న
అన్నమాటకు ఆదర్శమా
త్యాగాల సంకేతమా ॥కంట॥

అస్తమించిన వెంట ఉదయించే
అరుణ కిరణమా
అలుపెరగని పోరాటమా.... ॥కంట॥

# సిద్ధు అలియాస్ రంజిత్ కుమార్ @ సీతరాంపురం

**- శాఖమూరి రవి**

అందమైన పలకపై
అక్షరాలకు జీవంపోస్తూ
అరుగుతున్న సుద్దముక్కలతో
ఆటలాడాల్సిన వాడు

మెరిసేమబ్బు కురిసే చినుకు
వెలిగే జాబిలి మెదిలే చుక్కల చల్లదనంలో
ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్
పాట పాడుతూ గెంతులేయాల్సిన వాడు

మండుటెండల్లో
మట్టిపై నిలబడి
ఎగురుతున్న ఎర్రజెండాతో ఎదురొస్తూ

అమ్మ ప్రేమకు చిహ్నంగా
ఆయుస్సు పోసి
అరణ్యపోరాటాలనుండి
అయ్యవ్వ దగ్గరకు సాగనంపితే

పాలకుతి తీరకముందే
తీపి మధుర జ్ఞాపకాలు నెమరేసుకుంటు
సహచరుడి వెంటే సాగిపోయిన తల్లిని తలపోస్తు...

పోరునక్షత్రాల జంటఆశయాల అంతిమయాత్రలో
లాల్ సలాం లాల్ సలాం
లాల్ సలాం సలాంపాటతో

సిద్ధు అలియాస్ రంజిత్ కుమార్ @ సీతరాంపురం
మూసిన గుండె తలుపుల్ని బద్దలుచేస్తూ
రాజేస్తున్నాడు చితిమంటను

# మనువాదాలయాలు

**- పోటు నారాయణ**

అవి ఒకప్పుడు విశ్వవిద్యాలయాలు
విప్లవ ఆలోచనలతో
గేట్ల ముందు జెండాలు
రెప రెపలాడేవి
ఏ విద్యార్థి ఎటు పోవాలో
దారి చూపే
దిక్సూచిలుగా ఉండేవి
కాని నేడు అవి
లైబ్రరీలో చదవుకుంటాం
అంటేనే బహిష్కరిస్తున్నవి
ప్రగతిశీల, సామాజిక
బోధనలకు బదులుగా
మనువాద పండితులు
మూఢనమ్మకాల బోధనలు
చేస్తున్నారు
మతం మత్తుగా మారింది
కులం కుట్రగా మారింది
అగ్రభాగంలో అగ్రవర్ణాలు
ఉండాలని మనువుగాని
బోయీల బలవంతపు కోరిక
పరిశోధక శోధనకై
గ్రంథాలయం తెర్వాలన్నందుకు,

పదునెక్కిన మెదడులో
ప్రసరించే స్వేచ్ఛా గాలుల
ఆలోచనలు దళిత, ఆదివాసీ
మోహన్, సతీష్ , సుభాన్‌లవి
అందుకే కాబోలు వాళ్ళ బహిష్కరణ

# సమాధుల్ని శుభ్రం చేయాలిప్పుడు...

- కెక్యూబ్ వర్మ

ఇప్పుడెందుకో ఒక్కో సమాధిని శుభ్రం చేయాలనుంది
రాలిన పండుటాకుల్ని వాడిన పూల రేకుల్ని పేరుకు పోయిన ధూళిని
మట్టిని నేలనుండి పాకిన చెద పుట్టలను చుట్టూ పట్టిన నాచును
చిగురు వాడిన మొక్కలను గడ్డి దుబ్బులను
దీపపు దిమ్మెకింద అంటిన నూనె జిడ్డును
సున్నితంగా తొలగిస్తూ సమాధిని శుభ్రం చేయాలనుంది

నిద్రిస్తున్న యోధుడి గాయంలోంచి చిగురిస్తున్న మోదుగు పూల
మృదు స్పర్శ లోలోకి పాకుతూ గుండెలయను పెంచుతూ
నరాలలో రక్తకణ కాసారాన్ని ఉడుకెత్తిస్తూంది

గాయకుడెవరో ఇక్కడ గొంతు తెగిపడినట్టుంది
ఒక పాట చెవిలో వినిపిస్తూ నాభినుండి
దిక్కులు పిక్కటిల్లే నినాదమవుతూంది

అక్షరాలను అస్త్రాలుగా పదునెక్కించిన వారెవరో
పుటల మధ్య నిప్పులు చెరుగుతూ దాగినట్టుంది
నెత్తురంటిన అక్షరాల పూత వేలి చివర మెరుస్తూంది

ఆరుగాలం ఆకాశం వైపు చూస్తూ మట్టితో యుద్ధం చేస్తూ
ప్రేమిస్తూ తన నెత్తురినే ఎరువుగా మొలకెత్తిన
మట్టి మనిషెవరో విశ్రమిస్తున్నట్టుంది
చేతులకింత మట్టి తడి అంటుతూంది

ఎదనిండా తడి ఆరని జ్ఞాపకాలేవో రంగుల చిత్రంగా
నేసిన ప్రేమికుడెవరో భగ్న హృదయంతో అరమోడ్పు
కనులతో అవిరామంగా ధ్యానిస్తున్నట్టుంది
చేతులకిన్ని అద్దం పెంకులు గుచ్చుకున్నట్టుంది

లోలోన అలికిడి చేయకుండా పై మూత తెరవకుండా
మదినిండా గంధపు పరిమళమేదో
శ్వాస నిశ్వాసల మధ్య కమ్ముకుంటూ
సమాధి చుట్టూ చిగురించిన లేలేత పచ్చదనంతో
పూరేకుల తడితనమేదో స్పర్శిస్తూ
లోలోపల దాగిన కాంతిపుంజమేదో చేతి వేళ్ళగుండా
దేహమంతా ప్రవహిస్తూ నాలో దాగిన నైరాశ్యాన్ని
నిరామయాన్ని నిర్వేదాన్ని పారదోలుతూంది

సమాధుల్ని శుభ్రం చేయాలిప్పుడు...

# ప్రొటెస్ట్

- నిశిధి

కాలి బూడిదవ్వనీ
హూ కేర్స్
శవాలను పార్టులు పార్టులుగా
అమ్ముకొనే అధికారం నీకున్నప్పుడు
కనిపించని గాయాలు
రక్తపుటేరులా స్రవించనీ
హూ కేర్స్
పాపిష్టి డబ్బు మలాం
పిగిలిన దెబ్బలు కప్పడానికి
విశ్వప్రయత్నం చేస్తున్నపుడు
ఈ క్షణం బతికున్నాన్న నమ్మకం
నీకు లేని సురక్షితపు ఇల్యూజన్లా
కళ్ళకి గంతలు కడుతుంటే
హూ కేర్స్
గుడ్డిగా నువ్వు ప్రేమించే ప్రభుత్వం
పవర్ పాలిటిక్స్‌లో నిస్సహాయపు
చావు కేకలను వీనులవిందుగా
మార్చి ఆహ్లాదంగా వినిపిస్తుంటే
ఔన్సు ప్రేమలు అర క్షణం కామకాంక్షలు
దొరకటం కోసం అకాశంనే శపించే నీకు
ఎండిన రెక్కల్లో గూడు కట్టుకున్న
భూగోళం అంత బుగులు కనిపించినా
why the hell u care
But డ్యూడ్
ఈ రోజు నీదే ఒప్పుకున్నా
కాని నువ్వు నమ్ముకున్న ఉప్పెనలు
నిన్ను ముంచెత్తినప్పుడు
నీకోసం కన్నీరయ్యేది మాత్రం నేనే
ఏ అన్యాయం ఎదిరించలేని
నీ మానసిక బానిసత్వాన్ని
తెంపడానికి ఏ రోజు కయినా
ముందుకొచ్చేది ముందుగా
నా సంకెళ్ళ చేతులే

(కా. జి.ఎన్.సాయిబాబా అరెస్టుకు నిరసనగా....)

# గ్లోబల్ మమ్మీ

- బిరుసు సురేష్ బాబు

ఇంతకుముందు నాకో అమ్ముండేది
ఇప్పుడు లేదు
నేనే,
అమ్మను అమ్ముకొని
ఈ మధ్యనే డమ్మీ మమ్మీని కొన్నాను

మా అమ్మ
ఒడిలో కూర్చోబెట్టుకొని
గోరుముద్దలు తినిపిస్తే
ఈ మమ్మీ
పరిగెట్టిస్తూ
ఫాస్ట్ ఫుడ్డులను తినిపిస్తోంది

నేను పాడుకొనే
చిట్టి చిలకమ్మపై
ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్‌ని పడేసి చంపేసినది
నేను ఆడుకునే
తోలుబొమ్మల తోలు ఒలిచి
నాకో సెల్‌ఫోన్ చేయించింది

నేను నేర్చుకొన్న అ ఆ లపై
ఎబిసిడిలతో దండయాత్ర చేయించి
ఘోరంగా ఓడించింది

చల్ల నీళ్లు తాగుతుంటే
కోపంగా బానను బద్దలు కొట్టిన మమ్మీ
నాక్కూడా నాలుగు చీవాట్లు పెట్టి
ఫ్రిజ్‌లోని వాటర్ బాటిల్
నా చేతిలో పెట్టింది

రూపాయి అనే పాత వ్యక్తినే
కొత్తగా పరిచయం చేసి
స్నేహం చేయమని
ఖరాఖండిగా చెప్పేసింది

చిల్లా కట్టెను దూరంగా విసిరేసిన మమ్మీ
గ్లోబల్ బ్యాటు నా చేతిలో పెట్టి
కులవృత్తులు తయారు చేసుకొన్న బంతిని
బౌండరీ దాటించమని ఆజ్ఞాపించింది

ప్రపంచాన్ని కలిపిన మమ్మీ
మనుషుల్ని మాత్రం విడదీసింది
అమ్మను గుర్తుచేసుకున్నప్పుడల్లా
కళ్ళనుండి కారడానికి ఏమీ మిగల్లేదు

పాముగా మారిన గ్లోబల్ మమ్మీ
కన్నీటినంతటినీ పీల్చేసి
నా మెడను చుట్టేసుకుంది
వదిలించుకుంటున్నకొద్దీ
మరింతగా బిగుసుకుంటోంది
నా కోరిక నెరవేరదని తెల్సినా
గొంతులో నుండి వచ్చిన చివరి మాట ఒక్కటే
నాకు మా అమ్మ కావాలి

# మనిషి4 చిహ్నం

- వడ్డెబోయిన శ్రీనివాస్

ఇప్పుడర్థమవుతోంది

మతం
ఢిల్లీ పీఠం మీద
కమలాసన మేశాక
మనిషి వాసన చిహ్నం
కాస్త
మతం వాసనేస్తోంది

చెమట చుక్కల వేలిముద్ర
నాలుగు తలల్లోంచి వీచే
పారదర్శకంతో -
మనిషికి రాబోవు ఆపద మీద
నిఘాగా
ఆతృతగా నిలుచున్నట్టుంటుంది
సెక్యులర్ గార్డులా చార్మినార్

హిందువో ముస్లిమో
స్త్రీయో పురుషుడో
వేల ప్రాణాల దోచుకున్న
గత్తర గజదొంగను
ముట్టడించిన
జన గెలుపు జెండా చార్మినారు

ముస్లిం పాలకుడి ముందుచూపు
మత చిహ్నమెట్లా?
మనిషి చిహ్నం కానీ!

ఎప్పుడంటే
మతం కళ్ళకు
మనిషి కనబడదు వినబడదు
హైదరాబాదు
అయోధ్యలా కనిపిస్తుంది
సర్వం
మతంమయం

గుండె ఒకటే కానీ
ఒక గుమ్మం హిందువు
ఒక గుమ్మం ముస్లిము
ఒక గుమ్మం క్రిష్టియన్
ఒక గుమ్మం సిఖ్ఖు
నాలుగు తలల ఉమ్మడి మనసు!
బజారుమీదే
బతుకు వెతుక్కుంటున్న చెమట చుక్క

నాలుగు పాదాల ధర్మంగా నిల్చున్న
చార్మినారంటే తెలంగాణ!
తెలంగాణంటే -
మతంకాదు మనిషి!

వందల సంవత్సరాల జీవితం
ఎన్ని తుపాన్లు చూసింది
ఎన్ని సుడిగాలుల్ని పరిహాసం చేసింది
కాశీ నుంచి వచ్చినా సరే
వడోదర నుంచి వచ్చినా సరే
చార్మినారు
తెలంగాణ ఐకాన్

# ఈ ఉద్విగ్న సమయంలో

**- సొదుం శ్రీకాంత్**

దశాబ్దాల బూటకపు ఓట్ల మాయలో
దగాపడ్డ సీమవాసులం, మనుషులం కాలేని ఒట్టి ఓటర్లం
అమ్మ పాలు తాగి రొమ్ము తన్నే మా పాలకుల ఉన్మాదాలకు
జీవితం నెర్రెలిగ్గి "కరువు పేరిట" సీమ ఎడారిగా మారిపోతుంటే,
నరాలన్నీ ఏకమై కుట్ర పన్ని ఉరి, ఉరి ఉరి అంటూ
అంతర్ముఖాన్ని మృత్యు శకటంపై ఊరేగిస్తుంటే,
మరో దారిలేని బతుకులు ముక్కలు చెక్కలై
కబేళాలై కటేక్కి తరలిపోతే
ఊరి పొలిమేరలో చివరి రక్తపు బొట్టును కూడదీసుకుని
దాహం, దాహం, దాహం,
నీళ్ళు, నీళ్ళు, నీళ్ళు అంటూ అర్థించే దీన దోసిలిపై
రాజధాని, రింగురోడ్డు, పరిశ్రమలు, ప్యాకేజీలు, పోలవరం అంటూ
కబలీ, కబలీ అని కోస్తాంధ్ర గునపాలు ఎగిసెగిసి పడుతున్నాయ్.

శిఖరాలపైనే కుట్ర జరుగుతున్నపుడు
తాగునీరు, సాగునీరు, విద్య, వైద్యం, ఉద్యోగం ఇవేవీ కూడా
సీమ పొలిమేరల్ని సైతం తాకవనేది ఒక చారిత్రక వాస్తవం.
మళ్ళీ మళ్ళీ అదే దగా, మళ్ళీ మళ్ళీ అదే వంచన
చావుల్ని కూడా లెక్క చేయని కోస్తాంధ్ర ఉన్మాద వికటాట్టహాసంపై
పల్లెత్తు మాట కూడా విసరని సీమ నాయక గణం
స్వార్థ ప్రయోజనాల సాధనా సంకల్పంతో
మరోమారు గోతికాడ నక్కలా నక్కి ఉంది కాబోలు!

సంక్షుభిత చరిత్ర పునరావృతం కావడమంటే ఇదేనేమో మరి!

ఐనా సరే తప్పదు మరి కరువైనా, గుండె చెరువైనా, బతుకెంత భారమైనా
ఏ దారీ లేక చివరకు ఉరే శరణ్యమైనా
ఊరికే ఆగదు గదా ఊపిరి!
ప్రాణం పోయేదాకా పెనుగులాడాల్సిందే, తగువులాడాల్సిందే, తెంచుకోవాల్సిందే
కానీ
ఇప్పుడిక సీమ సామాజిక అవసరాన్ని దాహం, దాహం అని మాత్రం అనం
ఇప్పుడిక ట్రిబ్యునల్ల కాడ మా పేరిట తెచ్చిన నీళ్ళల్లో కోస్తా పల్లాన్ని చూడలేం
ఇప్పుడిక నీటి వాటాలోని "హక్కు"ను దేహీ, దేహీ అంటూ దేవురించం
ఇప్పుడిక సీమలో వేలాడే ఉరితాళ్ళని కేవలం మరణాలుగానే ఎంచలేం
ఇప్పుడిక ఈ కరువు అకృత్యాల్ని ప్రకృతి నేరంగా నిందించలేం

వాన రాక నీళ్ళు లేక చెరువులెండి గుండె మండి
నా సీమ తల్లి నెర్రెలిగ్గి నోరు తెరిచి
కోస్తాంధ్ర!- ఈ ద్రోహంలో నీ భాగమెంత అని ప్రశ్నించే రోజు,
కృష్ణా జలాల్లో నా 'వాటాని కాటేసిన దగాకోరు ఎవరని నిలదీసే రోజు,
పోలవరం నాలిక చీరేసి నీటి పున:పంపిణీపై గళమెత్తే రోజు,
నమ్ముకున్న పాపానికి రొమ్ముగుద్దే సీమ ఉన్మాద పాలకుల
భరతం పట్టే రోజు, బజారుకీడ్చే రోజు,
ఇంకెంతో దూరంలో లేదు
ఈ ఉద్విగ్న సమయంలో సీమ ఉద్యమానికి సిద్ధమౌతోంది

# నూతన మానవుడు

**- పచ్చల కిరణ్‌కుమార్**

తాతయ్య నీకు పాటలొచ్చా!
నాలుగు సంవత్సరాల ధానుప్రశ్న
ఓ... చాలవచ్చు
మరి నీకు వచ్చా...!
ఏది ఒక పాట పాడు
తన బెల్ట్‌పౌచ్ వరకైనారాని బాల్యానితో
ప్రేమగా కరచాలనం

బాగ పొద్దుపోయింది
ఇక పడుకోండి కామ్రేడ్
విరామం లేని పని
తెల్లారి చేయాల్సిన పనుల కోసం
రెండోఝాము
కోడి కూయకముందే మేల్కొనే బాధ్యత

నీళ్ళనే కాదు

కథ

# దౌత్య

- విమల

"మృత్యుఛాయ కమ్ముకున్న ఆ చివరాఖరి క్షణాల్లో, అమ్మదూ, నా చిట్టితల్లీ, నేను నీకు గుర్తుకురాలేదామ్మా! అలిగినా, ఆటల్లో దెబ్బ తగిలినా, ఎవరైనా ఏమైనా అన్నా, నా దగ్గరకే పరుగెత్తు కొచ్చేదానివే? ఎంత పెద్ద గాయం తగిలిందో, ఏమైందో నీకు, ఈ అమ్మకు చెప్పాలనిపించలేదా తల్లీ!. ఎందుకిట్లా చేసావు. నిన్నిట్లా దు:ఖ పెట్టిందెవరో తెలియదు. ఇంత కఠిన నిర్ణయం ఎందుకు తీసుకున్నావో? అప్పుడు ఎంత బాధ పడ్డావో? ఎంత ఏడ్చావో? చనిపోయిన నీ ముఖంపైన, చెదిరిన కన్నీటి ధారల ఆనవాళ్లు. నీ కన్నీళ్ళు నా లోలోపలికి ప్రవహించి, ఇక జీవితాంతం, నేనొక కన్నీటి సముద్రంలా మిగిలి పోతాను. నా చిన్నారి తల్లివి. నా బంగారు కొండవి కదూ! మళ్ళీ నా దగ్గరి కొచ్చేయమ్మా! గాలికి ఊగాడే పచ్చటి చెట్ల కొమ్మలంటే ఇష్టమనే దానివి. నువ్విట్లా విరిగిన కొమ్మలా, గదిలో ఫ్యాను రెక్కలకి వేలాడుతుంటే, నేను మొదలు నరికిన చెట్టులా కూలిపోయాను తల్లీ. అమ్మకి కూడా చెప్పుకోలేని కష్టం ఏమొచ్చింది నాన్నా? ఎందుకిట్లా చేసావ్? ఎందుకిట్లా... ఎందుకిట్లా ... నా కళ్ళముందు ఇక ఎన్నడూ నవ్వని, నడవని, అమ్మ మెడ చుట్టూ చేతులు వేసి గారాలు పోని, మరి కాస్సేపటిలో మాయమై పోయే నా బంగారు తల్లీ, వద్దురా, వద్దురా. . నువ్వు నన్ను వదిలి పెట్టి పోకురా కన్నా..."

కుడి చేతిని పొడవాటి గాజు పెట్టెపై చాచి, దానిపై తలవాల్చి కూర్చున్న మాధవి కళ్ళు, ఏ దృశ్యమూ కళ్ళలోకి ఇంకని, నీళ్ళింకి పోయి పొడిబారిన చెలిమల్లాగున్నాయి. ఆమె లోలోపల ఆలోచనలు, పైకెగసిపడి, విరిగిన అలల్లా దు:ఖ సముద్రపు తీరాలకేసి తలలు బాదుకుంటున్నాయి. గత రెండు రోజులుగా తన చుట్టూ, జరుగుతున్న విషయాలేవీ, ఆమె మనసుకెక్కటం లేదు. ఒకే ఒక్క విషయం, తన కూతురు దౌత్య, తన చిట్టితల్లి ఇక లేదు. ఆ సత్యం, ఆ ఒకే ఒక నిత్య సత్యం ఆమె మనసులో వెలుగుతోంది.

దౌత్యను తీసుకెళ్ళి పోతున్నారు. ఎవరో మాధవిని వీధి గుమ్మం వరకు మెల్లిగా నడిపించు కొచ్చారు. అక్కడ నిలబడి చూస్తుంటే, ఆమె కళ్ళ ముందు నుండే, ఆమె కూతురి నిర్జీవ దేహం, మెల్లిమెల్లిగా కదలి వెళ్ళిపోయింది. అట్లా వెళ్ళి పోతున్న బిడ్డ కోసం, శూన్యంలోకి చాచిన ఆమె చేతులు పరమ నిస్సహాయంగా, వాలిపోయాయి. ఏం మిగిల్చిందా పిల్ల? "దౌత్యా వాళ్ళమ్మ, మాధవి" అన్న పేరు మాత్రమే మాధవికి మిగిల్చి ఆమె వెళ్ళిపోయింది.

దౌత్య ఆత్మ హత్యపై రకరకాల ఊహాగానాలు, పత్రికల్లో వార్తలు, పోస్టుమార్టాలు, పోలీసు కేసులు, బంధు మిత్రుల పరామర్శలు, వ్యాఖ్యానాలు, తల్లిదండ్రుల పెంపకంపై విమర్శలు, ఈ కాలపు ఆడపిల్లలవి విచ్చలవిడి ప్రవర్తనలని తీర్పులు. దౌత్య వ్యక్తిత్వ హననం .. కూతురు చనిపోయిన దు:ఖాన్ని మోయడమే ఎంతో దుర్భరంగా ఉన్న దౌత్య తండ్రి శ్రీధర్‌కి ఈ పరిస్థితి, మనసు నొప్పించే మాటలు, కోపాన్నీ, అసహనాన్ని, అసహ్యాన్నీ కలిగించాయి.

దౌత్య చనిపోయాక, ఆమె అన్న ధీరజ్, వదిన రూపాసింగ్ ఆస్ట్రేలియా నుండి వచ్చి నెలరోజులుండి వెళ్లారు. వాళ్లు వెళ్ళి పోయాక, ఆ ఇంట్లో ఒక శ్మశాన నిశ్శబ్దం రాజ్యమేలుతుండేది.

దౌత్య చనిపోయిన నాలుగు నెలల తరువాత రోజు,

"మళ్ళీ ఉద్యోగానికెళ్ళు. నలుగురి మధ్యా తిరిగితే, కాస్త మామూలుగా అవుతావు" అన్నాడు శ్రీధర్.

"మామూలుగా అంటే ఏమిటి శ్రీధర్, దౌత్య ఉన్నప్పటి మాధవిలానా?" అందామె పేలవంగా.

అతనికేం మాట్లాడాలో తోచలేదు.

"మనకి ఇంకొక కొడుకు కూడా ఉన్నాడు" అన్నాడతను కొంచం స్వరం పెంచి.

"అవును. కానీ, నా కూతురు దౌత్య మాత్రం లేదు." అందామె కళ్ళనిండా నీళ్ళునింపుకొని.

"ఈ మానసిక స్థితి నుండి నువ్వు బయటకురాక పోతే, నువ్విట్లా దిగులుగా, దు:ఖంగా ఉంటే నేనేమై పోతానో ఆలోచించావా? నా దు:ఖం ఎవరితో, పంచుకోవాలి?" అతడి గొంతులో దు:ఖపు జీర.

ఎన్నో నెలల తరువాత, అప్పుడతనికేసి, మొదటిసారి నిదానంగా చూసిందామె. మాసిన, సగం నెరిసిన గడ్డం, కాంతిలేని కళ్ళు, పీక్కుపోయి, శాశ్వతంగా బాధ తిష్ట వేసిన, దిగులుతో ముడుచుకు పోయిన మొఖంతో, అతను తలవంచుకు కూర్చున్నాడు ......

---

ప్రకృతి గాలిని కూడ విషమయం చేసి
కృత్రిమ గాలిని
ప్రజలకు పాకెట్లు లెక్కన అమ్ముతారని
బొడ్రాయి దగ్గర
డప్పు దరువులై
ప్రజలను మేల్కొలిపిన పోరుగీతం

నిలబడిన కాళ్ళకింద
నేలను కూడా లేకుండా చేస్తుంటే
మట్టి మనుషుల కోసం
తన జీవితం చివరి అంచుల వరకు
నిరంతరం పోరాడిన యోధుడు

ఉద్దానం నుండి
ఏవోబి
దండకారణ్యం
నల్లమల వరకు
తను నడిచిన ప్రతి తోవలో
నెల్లూరులో చిలికిన నెత్తురు
బొబ్బిలి నగర వీధుల్లో
ఎర్రజెండాలై పిడికెత్తాయి

చూస్తుంటే, ఆమెకి బాధ కలిగింది. మాధవి తాను కూర్చున్న చోటునుండి లేచి, సోఫాలో అతని పక్కన కూర్చుని, అతని చేతిని తన చేతిలోకి తీసుకొని, మరో చేత్తో అతన్ని పొదివి పట్టుకుంటే, అతను అలసిపోయినట్లు, ఆమె భుజంపై తలవాల్చి, మెల్లిగా జారి, మాధవి వొడిలో తలపెట్టుకున్నాడు. అతను నిశ్శబ్దంగా ఏడుస్తున్నాడు. మాధవి తన కన్నీళ్ళు దాచుకుని, అతని తల నిమురుతూ ఉండిపోయింది. అతనికి కూతురంటే ఎంతిష్టమో ఆమెకి తెలుసు.

ఆ తరువాత ఆమె తన జీవితంతో పెనవేసుకున్న వాళ్ళకోసం, తాను పెట్టిన లాంగ్‌లీవ్‌ని క్యాన్సిల్ చేసుకుని, మళ్ళీ, ఉద్యోగానికెళ్లటం మొదలు పెట్టింది. దౌత్య, మనింట్లో పుట్టిన మహాలక్ష్మి అనంటాడు శ్రీధర్. దౌత్యతో ఆడుకోవడం, అది చెప్పే కబుర్లు వినడం అంటే శ్రీధర్‌కి ఎంతో ఇష్టం. బయటి ప్రపంచాన్ని దానికి పరిచయం చేస్తున్నప్పుడు అది అడిగే ప్రశ్నలూ, సందేహాలు, దాని కుతూహలం అన్నా అతడికి ఇష్టం. అది అడిగిన వేటినీ అతను కాదనేవాడు కాదు. కూతురు, తను ఒక జట్టని అతననుకునేవాడు. దౌత్యకన్నా ఐదేళ్ళు పెద్దవాడైన ధీరజ్ అన్నలా దౌత్యపై పెత్తనం చేయబోతే, శ్రీధర్ అసలు ఊరుకునే వాడుకాదు. దౌత్యా అంతే! నాన్న ఇంటికి రాగానే, కడుపులో ఉన్న విషయాలన్నీ, నాన్నకి చెప్పకపోతే నిద్ర పట్టదా పిల్లకి. నాన్న ఓ మాటన్నా, విసుక్కున్నా, తెగ బాధపడేది. ఏడ్చేసేది.

"అవును మరి! లాగిలాగి జడలు వేసే అమ్మంటే, ఎప్పుడూ ఆటలేనా, హోంవర్క్ చేయి, గట్టిగా అరవకు, కుదురుగా కూర్చోలేవా, పిచ్చి వేషాలేయకు, అన్నం మానేసి చాక్లెట్లు, ఐస్‌క్రీంలు అంటే ఊరుకోను, అంటూ పాఠాలు చెప్పే అమ్మలంటే, పిల్లలకి ఎందుకిష్టముంటుంది?" అనేది మాధవి నిష్ఠూరంగా. పధ్నాలుగు, పదిహేనేళ్ళ వయసులో మెల్లిగా తల్లితో సాన్నిహిత్యం పెరిగింది దౌత్యకి. చిన్నప్పటి అల్లరి, మంకుతనం పూర్తిగా తగ్గిపోయాయి.

"ఇదేమిటి! దౌత్య పెద్దదయి పోయినట్లు, ఏదో గంభీరంగా ఉంటోందీ మధ్య" అన్నాడోసారి శ్రీధర్. దౌత్యలో ఈ మార్పు హఠాత్తుగా వచ్చినట్లని పించేదతనికి.

"అవును. నీ కూతురు ఎప్పటికీ చిన్న పిల్లలానే ఉంటుందనుకుంటున్నావా? అది పెద్దదవుతుంది. దాని ప్రపంచం దానికి ఏర్పడుతుంది కదా! ఆడపిల్లల శరీరమే కాదు, వాళ్ళ ఆలోచనలూ, ఎందుకో ఒక్కసారిగా ఎదిగిపోయినట్లనిపిస్తాయి." అంది మాధవి.

అన్నయ్య ధీరజ్ ఇప్పుడు దౌత్యకి రోల్ మోడల్. పదోతరగతి పాస్ కాగానే అన్నయ్యలా, వైజాగ్ వదిలేసి, ఏ హైదరాబాదో, మద్రాసో వెళ్ళి చదువు కోవాలనుకునేది. అయితే శ్రీధర్ అలా పంపేందుకు ఎంత మాత్రం ఇష్టపడలేదు. మొత్తం మీద వైజాగ్ లోనే చదువుకునేందుకు, దౌత్యను ఒప్పించగలిగాడు శ్రీధర్.

"నా బంగారు తల్లిని చూడకుండా నేనుండలేను" అనేవాడు శ్రీధర్.

"రేపది పెళ్లిచేసుకుని, అత్తారింటికెడితే, దానితో పాటు, నువ్వు కూడా వెళ్ళేలా ఉన్నావ్!" అని నవ్వేది మాధవి.

"ఎందుకు? మనింట్లోనే ఉండే అల్లుడ్ని తెద్దాం" అని శ్రీధర్ జవాబిచ్చేవాడు.

* * *

"అమ్మా, ప్రేమంటే ఏమిటి? నువ్వూ నాన్నా కూడా ప్రేమించే పెళ్ళి చేసుకున్నారు కదా!"

ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతున్న పదహారేళ్ళ కూతురు, ఆ ప్రశ్న అడిగే సరికి, ఏం జవాబు చెప్పాలో మాధవికి తోచలేదు.

"ఐ కాంట్ డిఫైన్ ఇట్" అంది ఇంగ్లిష్‌లో.

"నువ్వు కూడా, నాన్నని ప్రేమించే పెళ్ళి చేసుకున్నావు కదా! ప్రేమించినప్పుడు ఏం అనిపిస్తుంది?" మళ్ళీ అడిగింది దౌత్య.

ఏం అనిపిస్తుంది? మనసు సప్తవర్ణాల సీతాకోక చిలుకలా, ఆకాశంలోకి ఎగిరిపోతుంది. సుతిమెత్తగా తొలి వేకువ జాముున, రేకులు విచ్చుకున్న గులాబీ పువ్వులా, హృదయం చిరునవ్వయి, విచ్చుకుంటుంది. గరిక పచ్చటి మైదానాల్లో నడుస్తున్న పాదాలపై, మంచు బిందువులు ముద్దు పెట్టుకున్నప్పటి పులకింతలా, ఏదోతెలియని అలౌకిక భావన లోలోన మేల్కొని, ఈ ప్రపంచంలో అతడు తప్పా, మరేమీ కనిపించని వినిపించని వైచిత్రిలో, ఎందుకు నవ్వుతావో, ఎందుకు దిగులు పడి దుఃఖిస్తావో, నిస్సహాయంగా ఆగ్రహిస్తావో, ఎందుకట్లా అతని కోసం ఎదురుచూస్తావో, నీకే తెలీక, తపనపడి, మోహించి, ప్రేమించి, అతడి ముందు మోకరిల్లి, ... నీలోకి నన్ను పూర్తిగా తీసేసుకుని, ఇక నేనంటూ ఏమీ లేనిదానిగా చేసి, నిన్ను నాకు సంపూర్ణంగా ఇచ్చేసుకుని, నువ్వు తప్పా నాకు మరింకేమీ అఖ్ఖరలేని తనంలోకి నేను ఈదులాడి ... ఏం అనిపిస్తుంది ప్రేమిస్తే?

మాధవి ఏం మాట్లాడలేదు. అక్కడే కాస్త దూరంలో కూర్చుని పుస్తకం చదువుకుంటున్న శ్రీధర్ తో, "శ్రీ, మనిద్దం ప్రేమించుకున్నాం కదా? ప్రేమిస్తే ఏమనిపిస్తుందని నీ కూతురడుగుతోంది." అని మాధవి అరిచింది.

"ఓ! అమ్మా, నో, నో. ." అంది దౌత్య గారంగా. నాన్నకి చెప్పేసినందుకు ఉడుక్కుంటూ ఉంటే,

"మీ అమ్మ పొడవాటి వేళ్లతో మిరపకాయ బజ్జీలు వేస్తే అవెంత రుచిగా ఉంటాయో కదా అనిపించేదప్పుడు" అంటూ బిగ్గరగా నవ్వాడు శ్రీధర్.

"నాన్నా, నిన్ను చంపేస్తాను" అంటూ శ్రీధర్ దగ్గరికి పరుగెత్తి అతని తల పట్టుకుని గట్టిగా ఊపింది దౌత్య.

"ఇలాంటి విషయాల గురించి ఆలోచించాలంటే నువ్వు ఇంకొంచెం పెద్దదానివి కావాలమ్మడూ" అన్నాడింకా నవ్వుతూనే శ్రీధర్.

ఊహలకి, కలలకి రెక్కలున్నాయంటారు. బహుశా వాటికి హద్దులు కూడా ఉండవనుకుంటా! తొలియవ్వనపు చిన్నచిన్న అలజడులు అప్పుడప్పుడూ కలిగినా, ఆకాలాన్ని సునాయాసంగానే దాటేసింది దౌత్య.

ఇంజనీరింగ్ చదివేనాటికల్లా, పెళ్ళంటూ చేసుకుంటే అమ్మలా, అన్నయ్యలా ప్రేమించే చేసుకోవాలనుకునేదామె. తన క్లాస్‌మెట్, కావ్య రేపు తనకు పెళ్ళి చూపులన్నప్పుడు ఆశ్చర్యపడింది.

"అట్లా నీకు ముక్కూమొఖం తెలియని వాడి ముందుకెళ్ళి, ఎలా కూర్చుంటావ్? మీ చుట్టూ, మీ పెద్దవాళ్ళంతా కూర్చుని, మీ ఇద్దరికీ కుదురుద్దా, లేదా అంటూ, కట్న కానుకల బేరాలు చేస్తుంటే, నీకు సిగ్గనిపించదూ!" అంది.

"ఎందుకు? అతడ్నీ, నన్నూ, విడిగా కాస్సేపు మాట్లాడుకోనిస్తారు కదా!" అంది కావ్య.

"ఓహో! ఆ ఐదు, పది నిముషాల్లో అతని గురించినీకు, నీ గురించి అతనికీ అన్ని సంగతులూ తెలిసిపోతాయన్నమాట." అంది వ్యంగ్యంగా.

కావ్యకి కొంచెం కోపం వచ్చింది.

"ప్రేమించి పెళ్ళి చేసుకోవాలంటే, అందరికీ కుదరదమ్మా!" అంది విసుగ్గా.

"నేను మాత్రం ప్రేమించే పెళ్ళి చేసుకుంటా. ప్రేమించ లేక పోతే, అసలు పెళ్ళే చేసుకోను." అంది గట్టిగా.

సాయంత్రం ఇంటి ముందు పూల చెట్ల కొమ్మలు కత్తిరిస్తున్న

శ్రీధర్ దగ్గరికొచ్చి,

"పరిచయం లేకుండా, ఒకరి కొకరు తెలియకుండా, ప్రేమించు కోకుండా, పెద్దవాళ్ళు కుదిర్చిన పెళ్ళిళ్ళు ఎలా చేసుకుంటారు నాన్నా" అంది దౌత్య.

"బహుశా, పెళ్ళి చేసుకున్నాక కూడా, ప్రేమించవచ్చని వాళ్ళకి తెలుసనుకుంటాను" అన్నాడతను తేలికగా.

"ఒక సారి పెళ్ళయిపోతే, ఎన్నటికీ విడిపోకూడదు కాబట్టి, ప్రేమించుకోవడం తప్పనిసరై ప్రేమించు కుంటారన్నమాట." అంది.

మెట్లపై కూర్చొని మల్లెపూల మాల కడుతున్న మాధవికి, ఇక మెల్లగా దౌత్యకి సంబంధాలు చూడాలేమో అన్పించింది.

రాత్రి శ్రీధర్‌తో ఆమాటే అంటే, "అది ఎలా వాదిస్తుందో చూస్తున్నావ్‌గా! మనలాగే, అదికూడా ప్రేమించి పెళ్ళి చేసుకుం టుందేమో?" అన్నాడు.

"మంచిదే కదా!" అంది మాధవి చిన్నగా నవ్వి.

* * *

ఉద్యోగం కోసం హైదరాబాద్ పంపకుండా ఉండాల్సింది అనుకుంటుంది మాధవి ఏ వెయ్యిన్నొక్కసార్లో. ఎం. ఎస్. చేస్తానన్నప్పుడు అమెరికాకి కాక, కొడుకు దగ్గరికి, ఏ ఆస్ట్రేలియాకో పంపినా బాఉండేది. చదువు పూర్తి కాగానే, ఎలానోలా ఒప్పించి, ఓ మంచి సంబంధం చూసి, పెళ్ళి చేసేస్తేనన్నా బావుండేది. అదలా చచ్చిపోయేది కాదుగదా?

దేశదిమ్మరిలా మనసు పరిపరివిధాల సంచరిస్తుంది. అలమటించి, అలమటించి అది ఎక్కడెక్కడో దిక్కుతోచక తచ్చాడుతుండి.

"నా చిట్టితల్లి మనసు కూడా అలా, ఎక్కడ తప్పిపోయిందో, ఎక్కడ అలసి పోయిందో, ఇక కదలలేను, ఇక చాలు, చాలీ బతుకని, జీవితంపై రోసిపోయి, పోయి, పోయి, ఉరితాటికి వేలాడి, విరిగి రెక్కలు తెగిన పక్షిలా ఊయలలూగి, ఊగి... ప్రేమ గుడ్డిదని అంటారు. నా కూతురు ప్రేమకి కళ్ళుండి ఉంటే ఎంతబాగుండేది. అతడి స్వభావాన్ని అది ముందుగానే తెలుసుకో గలిగితే, బతకగలిగిన నిబ్బరాన్ని అది కూడగట్టుకునేదేమో!"

"బాల్కనీలో, చీకటిలో నిశ్శబ్దంగా కూర్చునిఉన్న, ఆలోచనల్లో, మునిగి తేలుతున్న మాధవిని వెతుక్కుంటూ, శ్రీధర్ వచ్చాడు. అలికిడి వినగానే, గభాలున కళ్ళు తుడుచుకుంటూ లేచి నిలబడింది మాధవి. ఈమధ్య ఆమెని చూస్తే భయం వేస్తోంది శ్రీధర్‌కి. రోజు, రోజుకు మౌనంలోకి కూరుకుపోతూ, ఒక యంత్రంలా ఆ ఇంట్లో, ఆమె తిరుగుతున్నట్లనిపించేది అతనికి. బాధలకి పరిష్కార మార్గాన్ని చాలా మందిలాగానే, ఆమె కూడా ఆధ్యాత్మికతలో, వెతుక్కోడాన్ని అతడు మౌనంగా చూసేవాడు. ఆమెతోపాటు, అప్పుడప్పుడు, ఏ రామకృష్ణా మఠానికో వెళ్ళేవాడు. లేదా ఇంటి దగ్గరే ఉన్న సముద్రం ఒడ్డున ఎగిసిపడే అలల్ని చూస్తూ ఇద్దరూ మౌనంగా కూర్చునే వారు.

దౌత్య చనిపోయిన ఈ మూడేళ్ళలో మాధవి మేడపైనున్న కూతురు గదిలోకి, ఎన్నడూ కాలు పెట్టలేదు. పనమ్మాయే ఆ గది శుభ్రం చేస్తుంది. మాధవి లేనప్పుడు ఎప్పుడన్నా, శ్రీధర్ వెళ్ళి ఆ గదిలో కూర్చుని కూతురు తలపుల్లో మునిగితేలేవాడు. దౌత్య చనిపోయిన తరువాత, ఆ గదిలోనూ, హైదరాబాద్‌లో ఆమె అద్దెకు తీసుకున్న అపార్ట్‌మెంట్‌లోనూ పోలీసులు వెతికారు. తన మరణానికి ఎవరినన్నా బాధ్యుల్ని చేస్తూ, ఏమైనా ఆనవాళ్ళను ఆమె వదిలి వెళ్ళిందేమోనని. ఈ లోకాన్ని వదిలి వెళ్ళిపోవాలని నిశ్చయించుకునే, చాలామందిలానే ఆమెకూడా, ఎవరూ తనవాళ్లు కాదనే ఏకాకి తనంతో, ఎవరినీ తన జీవితానికీ, చివరికి మృత్యువుకీ కూడా బాధ్యుల్ని చేయకుండానే వెళ్ళిపోయింది.

ఆ రోజు, దౌత్య ఆఖరి సందేశం పంపిన ఆ అర్ధరాత్రి వేళ మాధవి, శ్రీధర్ లిద్దరూ గాఢంగా నిద్రపోతున్నారు. దౌత్య శ్రీధర్ ఫోన్‌కి పంపిన ఆఖరి సందేశం రెండుసార్లు నాజూకుగా శబ్దం చేస్తూ గాలిలో తేలుతూ వచ్చింది. ఆమె ఆఖరి ఆక్రందనని తానెందుకు వినలేక పోయానని, శ్రీధర్ కుమిలిపోని క్షణం లేదు.

"నాప్రియాతి ప్రియమైన నాన్నా, అమ్మ, ధీరజ్ అన్నయ్య, మిమ్మల్నందరినీ కష్టపెడుతున్నందుకు క్షమించండి. మనుష్యులు కూడా గాజు అద్దంలా పగిలి, పగిలి ముక్కలై పోతారు. అట్లా పగిలిపోయిన నేను, ప్రతిరోజూ అనేక మార్లు చనిపోతున్నట్లుగా ఉంది. ఇట్లా బతుకుతూ, నిత్యం చనిపోయి బతకటం కన్నా, నిజంగా, శాశ్వతంగా చనిపోవడమే మేలనిపించింది. నా మరణానికి ఎవరినీ కారణం చేయను."

"ఎవరైనా, ఎందుకట్లా చనిపోతారు. ఆత్మనిందతోనో, అపరాధ భావంతోనో, ఇంత పెద్ద ప్రపంచంలో తనకెవరూ లేరనే ఏకాకి తనంతోనో, లేదూ అకారణంగానో, ఎవరినీ శిక్షించ లేక, చివరికి తమని తామే శిక్షించుకుని... . అపరిమితంగా ప్రేమించినందుకు వాడు మృత్యువును కానుకగా ఇచ్చినప్పటికీ, వాడినింకా ప్రేమిస్తానే, మరణిస్తారా? చనిపోతున్న మనిషి మనసులో ఉన్న రహస్యాన్ని, ప్రపంచానికి వెల్లడించడానికి ఇష్టపడని, ఆ విషాదాంత జ్ఞాపకాన్ని కనుగొనడం ఎలా? చనిపోబోయే ముందా గదిలో దౌత్య ఏం చేసుంటుంది?

"నాకు చివరి సందేశం పంపిన అరగంట తరువాత, నా బంగారు తల్లి ఉరివేసుకుంది. ఆ ఆఖరి అరగంటలో దాని మనసులో ఏం సంభాషణలు నడిచాయో, చావు, బతుకుల మధ్య అది ఊగిసలాడిన క్షణాల్లో దాన్ని వెనక్కి లాక్కొచ్చే వాళ్లెవరూ దగ్గరలేక, చివరికి ఉరితాటికి ఊగిసలాడి.... ఊగిసలాడి..." శ్రీధర్‌కి దౌత్య తన సెల్ ఫోన్‌కి పంపిన ఆఖరి సందేశం గుర్తుకొచ్చినప్పుడల్లా, దు:ఖం ఆగదు. ఆ రాత్రి తానెందుకు నిద్రపోయాడు. తన ఫోన్‌కి, మెసేజ్ పంపిన తరువాత, బతికేఉన్న ఆ అరగంటలో తను ఫోన్ చేస్తానని ఎదురు చూసిందేమోనన్న ఆలోచనకే, అతడు నిలువెల్లా కంపించిపోతాడు. ఈ ఆలోచనని అతడెన్నడూ మాధవికి చెప్పలేదు.

* * *

"దౌత్యకి క్యాంపస్ సెలక్షన్స్‌లో, ఓ పేరున్న బహుళజాతి కంపెనీలో, బెంగుళూరులో ఉద్యోగం వచ్చింది. శ్రీధర్ తన శాయశక్తులా దౌత్యని ఆపేందుకు ప్రయత్నించి, మాధవితో తిట్లు కూడా తిన్నాడు.

"ఏంటది? ఎల్లకాలం మన దగ్గరే ఉండి పోతుందనుకున్నావా? దాని కెరియర్ అది ఏర్పరుచుకోడానికి, ప్రయత్నిస్తుంటే, ఎంకరేజ్ చేయాల్సింది పోయి, ఏమిటీ సిల్లీ బిహేవియర్" అంటూ ఒక్క కసురు కసిరాక ఊరుకున్నాడతను.

బెంగుళూరెళ్ళిన కొత్తల్లో దౌత్య, రెగ్యులర్‌గా ఫోన్‌లు, నెలకోసారన్నా వైజాగ్ రావడం చేసేది. ఆ తరువాత కొత్త ప్రపంచాన్ని, కొత్త పరిచయాలని ఆస్వాదించడం మెదలు పెట్టింది. మెల్లిగా ఆమె నుండి ఫోన్ కాల్స్, ఇంటికి రావడాలు తగ్గిపోయాయి. ఆమె రూపురేఖల్లోనూ మార్పు కనబడ్డప్పుడు, దౌత్య మారుతోందని మాధవితో అన్నాడు శ్రీధర్ . "ఒక కొత్తపనో, కొత్త ఉద్యోగమో ప్రారంభించినప్పుడు, ఆ పనిని ఈ తరం ఒక సవాలుగా తీసుకొంటోంది. ఎవరికి వాళ్ళు అందరికన్నా, తామే ముందుండాలను కుంటారు. ఈ విషయం నీకు తెలియంది కాదు. ఆ కొత్త ప్రాంతంలో, ఉద్యోగంలో దాన్ని నిలదొక్కుకోనివ్వు. ఊరికే హైరానా పడిపోకు." అంది.

శ్రీధర్ మరింకేం మాట్లాడలేదు. రెండేళ్ళ పాటు ఉద్యోగం చేసాక, పై చదువుల కోసం అమెరికా వెడతాననింది దౌత్య. పెళ్ళి చేసుకుని వెళ్ళమన్నారు మాధవి, శ్రీధర్‌లు.

"నీ మనసులో ఎవరన్నా ఉంటే చెప్పు" అని అడిగింది మాధవి. విని, నవ్వి ఊరుకుంది దౌత్య. అమెరికాకెళ్ళే ఏర్పాట్లు స్వయంగా చేసుకుంటుంటే శ్రీధర్‌కి చాలా కోపం వచ్చింది. "మీరు పంపక పోతే లోన్‌కి అప్లయ్ చేస్తా" నని దౌత్య అన్నాక మొదటి సారి వాళ్ళిద్దరికీ తమ చేతుల్లో తమ కూతురు లేదన్న విషయం అర్ధమైంది. వద్దంటే మరింత మొండికేస్తుందని తెలిసాక, శ్రీధర్ దౌత్యని అమెరికా పంపే ఏర్పాట్లలో నిమగ్నమయ్యాడు.

దౌత్యలో కొత్త ఉత్సాహం తొణికిసలాడటాన్ని మాధవి గమనించింది. ఇంట్లో ఉన్నా, ఎక్కువగా ఒంటరిగా ఉండాలను కోవడం, ఫోన్‌లో ఎక్కువగా మాట్లాడుతూ ఉండటం. అందరి మధ్య ఉన్నప్పటికీ, ఫోన్ రాగానే దూరంగా వెళ్ళిపోవడాలూ మాధవి దృష్టిని దాటిపోలేదు. ఓ రోజు రాత్రి బాగా పొద్దుపోయాక. ఇంటి ముందు కారాపి. గేటు తీసి. కారు పోర్టికోలో పార్క్ చేసి. తిరిగి గేటు మూసేందుకు వెడుతుంటే, మేడమీద తన గది బాల్కనీలో నిలబడి నెమ్మదిగా ఫోన్‌లో మాట్లాడుతున్న దౌత్య కనిపించింది.

"ఈ రాత్రి, దానికీ ఫోన్ లేమిటి?" అన్నాడు ఆశ్చర్యంగా మాధవితో. మాధవికీ అలానే అనిపించినా,

"ఏం అడుగుతాం శ్రీదర్. అంత పెద్ద పిల్లని. మరీ అన్నింటినీ పట్టించుకుంటున్నాం. మీన్‌గా ఆలోచిస్తున్నాం అనుకుంటుందేమో?" అంది.

చివరికి దౌత్య అమెరికా వెళ్ళిపోయింది.

మొదటి నాలుగైదు నెలలు. హాస్టల్లోనే ఉంది. తరువాత ఖర్చు ఎక్కువైపోతోందంటూ. ఎవరో స్నేహితులతో కలిసి. అపార్ట్‌మెంటులోకి మారింది దౌత్య. పార్ట్‌టైం ఉద్యోగంలో కూడా చేరానంది. చదువు, పరీక్షలు, ఉద్యోగం అంటూ క్షణం తీరిక లేదనేది. ఫోన్‌లు, ఇమెయిళ్ళు [illegible] తగ్గిపోయాయి. ఏం జరుగుతుందో. వాళ్ళిద్దరికీ [illegible] దౌత్యలో మార్పు వస్తోందని అనిపించింది వాళ్ళకి.

[illegible] మనసులో. తల్లిదండ్రులతో కూడా పంచుకోలేని. [illegible] కుంటుందన్న విషయం వాళ్ళిద్దరికీ తెలీదు. [illegible] తమతో కూడా దాచుకునే రహస్యాలుంటాయనే విషయం వాళ్ళు గ్రహించలేక పోయారు.

[illegible] వచ్చి వెళ్ళమంటే వీసా సమస్యలేవో చెప్పింది దౌత్య. శ్రీధరే తానొక్కడే వెళ్ళి రావాలనుకున్నాడు. అతను ఓసారి ప్రయత్నించాడు కానీ, అతనికి వీసా దొరకలేదు.

పెరిగిన పిల్లలకి స్పేస్ ఇవ్వాలని, వాళ్ళ అభిప్రాయాలను గౌరవించాలని. అనుకునే తల్లిదండ్రులు మాధవి, శ్రీధర్‌లు. చివరికి రెండున్నరేళ్ళ తరువాత ఇండియాకి తిరిగొచ్చిన దౌత్యని, వైజాగ్ ఎయిర్‌పోర్ట్‌లో రిసీవ్ చేసుకునేందు కెళ్ళిన వాళ్ళిద్దరూ, ఆమెని చూసి నివ్వెర పోయారు. చిక్కిపోయి. కళాకాంతులు లేని మొఖంతో, జబ్బు మనిషిలా ఉన్న దౌత్యని చూసి. మాధవి అక్కడే ఏడ్చేసింది. శ్రీధర్ కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. వాళ్ళిద్దరినీ చూసి పేవలంగా నవ్విందామె. ఇంటికి వచ్చి నాలుగు రోజులైనా, ఎవరితోనూ సరిగ్గా మాట్లాడకుండా. అనాసక్తంగా ఉన్న దౌత్యని చూస్తే వాళ్ళకి భయమేసింది. ఒంటరిగా. తన గదిలోనే ఉండేందుకు ఇష్టపడేది. ఏదో మానసిక వేదన తమ కూతురిని కుంగదీస్తోందని వాళ్ళకు అనిపించింది. అదేమిటో కనుక్కుతీరాలని అనుకుంది మాధవి.

దౌత్యకి ఇష్టమని బెండకాయ వేపుడు చేస్తుంటే, దౌత్య వెనకనించి వచ్చి మాధవి నడుం చుట్టూ చేతులేసి, భుజం పైన తలపెట్టి.

"అమ్మా, ఎవరికైనా సరే, ఎందుకు చచ్చిపోవాలనిపిస్తుంది?" అంది.

ఆ ప్రశ్నకి ఉలిక్కిపడి, వెనక్కి తిరిగి, "ఎందుకు నాన్నా! అలాంటి ప్రశ్నలడుగుతున్నావ్?" అంది ఆందోళనగా మాధవి.

"చెప్పు"

"నాకు తెలీదు. బహుశా, ఎవరికీ తెలీక పోవచ్చు. ఎందుకు చచ్చి పోవాలను కుంటున్నారో, ఆ చనిపోబోయే వాళ్ళు చెబితే తప్పా తెలీదు." అంది మాధవి.

"నే చెప్పనా? వాళ్ళు కోరుకున్నది వాళ్ళకిక దక్కదని తెలిసిపోతేనేమో! ఇక ఆశలూ, అన్ని దారులూ మూసుకుపోతేనేమో!" అంది దౌత్య నెమ్మదిగా.

మాధవి దౌత్యకేసి ఒక్క క్షణం దీర్ఘంగా చూసి,

"నీకట్లా అనిపిస్తుందా ఎప్పుడన్నా" అడిగింది.

"ఉహు! తెలీదు. అలాంటి కోర్కె ఎంత గాఢంగా నాకుందో తెలీదు. నీకెప్పుడైనా అలా అని పించిందా అమ్మా" అంది దౌత్య.

మాధవికి భయమేసింది. "ఏవిటా పిచ్చి మాటలు" అని తిట్టాలనుకుంది. స్టవ్ ఆర్పేసి, దౌత్య చేయి పట్టుకొని హాల్లోకి నడిచి, సోఫాలో తన పక్కనే కూర్చోపెట్టుకుంది.

"ఎందుకిలా మాట్లాడుతున్నావ్. ఏమైందిరా నీకు?" అంది మాధవి. ఆమె గొంతు దు:ఖంతో వణికింది.

"అమ్మా! ప్రేమించటం తప్పా?" అంది. ఈ మాట అంటున్నప్పుడు దౌత్య కళ్ళలో పలుచటి కన్నీటి పొర కదలాడింది. మాధవి మాట్లాడే లోగానే

"మనం ప్రేమించిన వాళ్ళు మనకి మాత్రమే ఉండాలనుకోవడం స్వార్ధమా?" అంది.

"ఏం కాదు. ప్రేమలో గాఢత, ఒక విధమైన పొసెసివ్‌నెస్ కూడా ఉంటాయి" అంది మాధవి.

కూతురు ఏదో చెప్పాలనుకుంటున్న విషయం అర్ధమైందామెకు.

"అమ్మా, నేనొకతన్ని ప్రేమించాను" అంది నెమ్మదిగా. ఈ మాటంటున్నప్పుడు, దౌత్య కళ్ళనుండి కన్నీటి చుక్కలు రాలిపడ్డాయి. మనిషికెంతో ఆనందాన్నిచ్చే. ప్రేమని ఇట్లా దు:ఖ పడుతూ చెబుతుందేమిటీ పిల్ల అనుకుంది మాధవి.

"అతదు నిన్ను కాదన్నాడా?"

"ఉహూ!" అంటూ తల అడ్డంగా ఊపింది దౌత్య.

"మరి"

"అతను కూడా నన్ను ప్రేమించాననే అంటాడు. అతడికి నేనెంత వరకు కావాలో నాకు తెలీదు. అతడ్ని నేనెంత వరకూ కావాలని కోరుకో వచ్చో కూడా నాకు తెలీటం లేదమ్మా." అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"అంటే"

"నా ప్రేమ అతడికి చాలా సఫకేటింగ్‌గా, ఊపిరాడనంత ఉక్కిరి బిక్కిరి చేస్తుందంటాడు. అతడెప్పుడూ, తన స్పేస్ తనకుండాల నంటాడు. ఆ స్పేస్ లో నేనే కాకుండా అతడికి..." దౌత్య మాటల్ని మధ్యలోనే ఆపేసింది.

"ఊ! అతడికి. ." అంటూ మాధవి రెట్టించి అడిగినా, దౌత్య మౌనంగా ఉండి పోయింది.

"అతడి పేరేమిటి? ఏంచేస్తాడు? తల్లిదండ్రులెవరు? ఎక్కడుంటారు?" లాంటి ప్రశ్నల్ని మాధవి అడిగినప్పుడు కూడా దౌత్య

తలవంచుకు మౌనంగానే ఉండిపోయింది. అడిగి, అడిగి మాధవికి విసుగొచ్చింది.

శ్రీధర్ ఇంటికి రాగానే, దౌత్య విషయం అతడికి చెప్పింది మాధవి. శ్రీధర్ తను దౌత్యతో మాట్లాడతానని అన్నప్పుడు, ఎట్టి పరిస్థితుల్లోనూ, దౌత్యపై కోపం తెచ్చుకొని, తిట్టొద్దని గట్టిగా చెప్పింది మాధవి. రాత్రి డాబా పైన, మసక వెన్నెట్లో కూర్చుని, వాళ్ళిద్దరూ మాట్లాడు కుంటుంటే, శ్రీధర్‌కి చిన్నప్పుడు తనని ప్రశ్నలతో వేధించే, చిన్నారి దౌత్య గుర్తుకొచ్చింది.

"అతని తల్లిదండ్రులతో, మమ్మల్ని మాట్లాడమంటావా?" అనడిగాడు శ్రీధర్.

"మాప్రేమ పెళ్ళి వరకూ వెడుతుందో లేదో నాకు తెలీటం లేదు నాన్నా. నాకు అతడు కావాలి. అతను లేకపోతే నాకెందుకీ జీవితం అనిపిస్తుంది. బెంగుళూరులో, అతను నాకు పరిచయ మయ్యాడు. నేను ఎం. ఎస్. చేసేందుకు అమెరికా వెళ్ళినప్పుడు, అతను ఉద్యోగం చేస్తూ అక్కడే ఉండేవాడు. ఇప్పుడు నేనొచ్చేసాను. అతను కూడా, మరో రెండుమూడు నెలల్లో ఇండియాకి తిరిగి వస్తాడు." అంది దౌత్య.

"అసలు మీరిద్దరూ మీ పెళ్ళి గురించి మాట్లాడుకున్నారా?" అడిగాడు శ్రీధర్.

"ఆ, చాలా సార్లు" అంటూ పేలవంగా నవ్వింది దౌత్య.

"తగాదా పడ్డారా!"

"లెక్క లేనన్ని సార్లు" అంది

"ఒకసారి నామీద ప్రేముందని అంటాడు. పెళ్ళి చేసుకుందా మంటాడు. మరి కొన్నాళ్ళకు ఇదంతా క్షణభంగురమే అన్నట్లు, ఏదో ఒక సాకుతో, నా ఆత్మగౌరవం దెబ్బతినేలా అవమానిస్తాడు. చీదరించుకుంటాడు. అలాంటప్పుడు, నా మనసు దెబ్బతిన్న పావురంలా, విలవిలలాడి పోతుంది.

"ఎదుటి మనిషి బాధ ఏ మాత్రం పట్టని వాడిలా ప్రవర్తించే, ఆ మనిషిని ఎలా అర్థంచేసుకోవాలో నాకు అర్థం కావడం లేదు నాన్నా. చాలాసార్లు అతడితో నా సంబంధం ఇక ముగిసి పోయిందనిసించేది. అయినా మళ్ళా మా మధ్య మాటలు మెల్లిమెల్లిగా ప్రారంభమయ్యేవి." అంది దౌత్య.

శ్రీధర్ కూతురి మాటల్ని వింటున్నాడు.

"ఒక్కోసారి మా ఇద్దరి ఆలోచనలూ వేరు వేరేమో, ఇక అతడికీ నాకూ కుదరదేమో అనిపిస్తుంది. ఇక చాలీ వేదన, నేనిక భరించలేను అనుకుంటాను. మళ్ళీ అతడు లేకపోతే నేనెలా ఉండగలనని భయమేస్తుంది. ఏంచేయాలో అర్థంకావటం లేదు నాన్నా. నా మీద నాకే నమ్మకం లేకుండా పోయింది"

"నీ ఊగిసలాటని నేను అర్థం చేసుకో గలనమ్మా. కానీ ఈ ఊగిసలాట మధ్య ఎక్కువ కాలం ఉండటం మంచిదికాదు. అతనితో మాట్లాడు. ఏదోక విషయం తేల్చుకోవాలి" అన్నాడు శ్రీధర్.

"అతను ఇండియా రాగానే మాట్లాడతాను" అంది దౌత్య.

తన ప్రేమ వ్యవహారాన్ని తానే పరిష్కరించుకోవాలనుకుంటోంది దౌత్య అని అన్పించింది శ్రీధర్‌కి. దౌత్య భుజం తడుతూ,

"నీ వెంట మేం ఎప్పుడూ ఉంటామన్న విషయం మర్చిపోకు." అన్నాడు శ్రీధర్.

దౌత్య మళ్ళీ మామూలుగా ఉండేందుకు ప్రయత్నించటాన్ని వాళ్ళు గమనించారు. ఫోన్ సంభాషణలు కొనసాగటాన్ని, మధ్య మధ్య, మరోలోకంలో దౌత్య విహరించటాన్ని, బాధనేదో అణచుకుని, పేలవంగా నవ్వును మొఖానికి పులుముకోడాన్ని మాధవి చూడగలిగింది. చివరికోనాడు ఆగలేక,

"ప్రేమలో, హింస, బాధ, అవమానం, అనుమానం, అబ్యూజ్ వంటి వాటికి చోటుంటే, అదేం ప్రేమ దౌత్యా! నీ ఆత్మగౌరవాన్ని దెబ్బతీస్తూ, నిన్ను దు:ఖపడేలా చేసి, నీ హృదయాన్ని గాయపరిచి, మళ్ళీ నిన్ను ప్రేమిస్తున్నాను కదా అనే మనిషిని నువ్వెలా నమ్మగలవ్!" అంది మాధవి.

దౌత్య తలవంచుకు వినింది.

"నీకు సంబంధించిన నిర్ణయాలు తీసుకో గల వయసు నీకొచ్చిందేమో కానీ, నాతోనూ, నాన్నతోనూ నువ్వు అన్ని విషయాలూ మనసు విప్పి మాట్లాడుతున్నావనిపించటంలేదు. మేం ఏం చేయాలో, ఎక్కడ కల్పించుకోవాలో కూడా మాకర్థం కావడం లేదు." అంది మాదవి. ఈ మాటలకీ మౌనమే సమాధానమైంది.

కొన్నాళ్ళకి హైదరాబాద్‌లో ఉన్న తన స్నేహితురాలి దగ్గరికెడతానని, ఉద్యోగం కోసం, ప్రయత్నిస్తానని అనింది దౌత్య. వద్దన్నా వెళ్ళి తీరుతుందని తెలుసు వాళ్లకి. వెళ్ళేప్పుడు, ఆ ప్రేమ వ్యవహారం నుండి బయట పడేందుకు ప్రయత్నిస్తానని చెప్పిమరీ వెళ్ళింది.

రోజూ ఫోన్‌లో మాట్లాడేది. ఉద్యోగప్రయత్నాల గురించి చెప్పేది. చాలా త్వరగానే నెల రోజుల వ్యవధిలోనే, ఉద్యోగం సంపాదించుకో గలిగింది దౌత్య. కొత్త ఉద్యోగంలో చేరాక వీకెండ్ లో ఓసారి, వైజాగ్ వచ్చి వెళ్ళింది. హాస్టల్ లేదంటే ఏ షేరింగ్ అపార్ట్‌మెంట్‌లోకో మారతానని చెప్పివెళ్ళింది.

అట్లా వెళ్ళిన ఇరవై రోజులకే తన అపార్ట్‌మెంట్‌లో దౌత్య ఉరివేసుకు చనిపోయింది. ఇక అతడితో విడిపోయేందుకు సిద్ధపడుతున్న కూతురు ఎందుకంత హఠాత్తుగా, అలాంటి నిర్ణయం తీసుకుందో, ఆమె జీవితాన్ని తలకిందులు చేసిన అతడెవరో వాళ్ళకి తెలియనేలేదు.

* * *

"ధీరజ్ కొన్నాళ్ళన్నా, తమతో వచ్చి ఉండమని అనేకసార్లు అడిగినా వైజాగ్ వదిలి వెళ్లేందుకు ఇష్టపడని మాధవి, కోడలి డెలివరీ కోసం ఆస్ట్రేలియా వెళ్ళక తప్పలేదు. శ్రీధర్‌ని ఒక్కడినే, వదిలి వెళ్ళేందుకు మాధవి సంకోచిస్తే, మరో నాలుగైదు నెలలకి తానుకూడా వస్తానని నచ్చచెప్పాడతడు. తీరా మాధవి వెళ్ళిపోయాక, ఆమె లేని లోటు అతడికి అడుగడుగునా అగపడసాగింది. ఇన్నేళ్ళలో తామిద్దరూ ఎన్నడూ, విడిగా లేమన్న విషయం అతడికి పదే పదే గుర్తుకొచ్చేది. వంటావిడ, పనివాళ్ళతో రోజూ మాట్లాడే విషయాలేవీ అగుపడక, నిశ్శబ్దం రాజ్యమేలే ఆ ఇంట్లో, అతడిప్పుడు కూతురు గదిలోకెళ్ళి రోజూ కాస్సేపు కూర్చుంటాడు. దౌత్య ఫోటో ఆల్బం చూస్తూ, జ్ఞాపకాల జడివానలో మునిగిపోతాడు. ఆ గదిలో రూపంలేని దౌత్య తిరుగుతున్నట్లుగా అతడు ఆమె అలికిడికై చూసేవాడు. దౌత్య పుస్తకాలు, నోట్సు, సి. డి. లు, మేకప్ సామగ్రీ, అలమారలో హేంగర్‌లకి వేలాడే దుస్తులు, ఆమె పోగుచేసుకున్న రకరకాల వస్తువులు... . అట్లా అర్థాంతరంగా అన్నీ వదిలేసుకుని ఎందుకు వెళ్ళిపోతారు మనుష్యులు... . మాధవి వచ్చాక దౌత్య వస్తువులు ఉపయోగపడే ఎవరికన్నా ఇచ్చేయాలనుకున్నాడు శ్రీధర్.

అతడి దృష్టి, అలమారాలో అడుగున ఉన్న నల్లటితోలు పెట్టెపై పడింది. దౌత్య అమెరికా వెళ్ళేప్పుడు కూతురు, తను, వెళ్ళి దాన్ని కొనుక్కొచ్చిన విషయం అతడికి గుర్తుకొచ్చింది. అదే సూట్‌కేస్ హైదరాబాద్ కూడా పట్టుకుపోయింది దౌత్య. అక్కడే కూలబడి, అతడా సూట్‌కేస్ తీసాడు. దౌత్య సర్టిఫికెట్లు, పాస్‌పోర్టు, ఐదారు జతల బట్టలు, ఇంట్లో వాళ్ళతో దిగిన ఫోటోలూ... . అతడొక్కొక్క వస్తువూ బయటకు తీసాడు. ఖాళీగా మిగిలిన సూట్‌కేస్ అడుగున, అరచేతిలో

తడుముతుంటే అతడికి ఎందుకో దు:ఖం వచ్చింది. ఇట్లానే తన బంగారు తల్లి, జీవితాన్ని ఖాళీచేసి వెళ్ళిపోయిందనే ఆలోచనేదో లోలోన కదలాడి.

అతడి చేతికేదో తగిలినట్లనిపించింది. సూట్‌కేస్ అడుగున కుట్టిన సిల్కు బట్ట వెనకాల, ఏదో చిన్న వస్తువు ఉన్నట్లనిపించి, జాగ్రత్తగా కుట్లు ఊడతీసి మెల్లిగా దాన్ని బయటకు తీసాడు. వేలెడంత ఉన్న, పెన్‌డ్రైవ్ అతడి కంటబడింది. అతని గుండె వేగంగా కొట్టుకుంది. గబగబా తన గదిలోకెళ్ళి, కంప్యూటర్ ఆన్ చేసి, పెన్‌డ్రైవ్‌ను ఇన్‌సర్ట్‌చేసి, చూస్తే, ఏవోకొన్ని, వాయిస్ రికార్డర్ నుండి డౌన్‌లోడ్ చేసిన ఫోల్డర్లు కనిపించి, ఓపెన్ చేసాడు. అవన్నీ వేరు, వేరు సందర్భాలలో, రికార్డు చేసినవి. తలకి హెడ్‌ఫోన్స్ పెట్టుకుని వినడం మొదలు పెట్టాడు శ్రీధర్. దౌత్య గొంతు వినపడగానే అతడికి తెలీకుండానే కళ్ళనిండా నీళ్లునిండాయి.

"ఎవరితోనన్నా, చెబితే బావుండనిపిస్తుంది. ఎవరితో చెప్పను? నవ్వొస్తోంది. ఇలా మాట్లాడటం..... సరే, నాతోనే, నేను మాట్లాడు కుంటాను. నాకేవో కొత్తగా రెక్కలొచ్చి, ఆకాశంలోకి ఎగిరి పోతున్నట్లుంది. కొంచెం భయంగా, కొంచెం గమ్మత్తుగా, మత్తుగా ఉంది. ఇంత సంతోషంగా ఎప్పుడూ లేనట్టుగాఉంది. అతడిని చూడాలనే తపన, అతను కనబడగానే కలవరం, వెళ్ళిపోతుంటే వేదన, ఎందుకు కలుగుతున్నాయో? నాకేమవుతుందో, నాకే తెలీటం లేదు. అతనెప్పుడూ నా సమక్షంలోనే, ఉండి పోతే బావుండునని పిస్తుంది. అతనికీ అలాగే ఉంటుందా?"

"అతడంటే నాకు తగని ఇష్టమనీ, అతడ్ని నేను ప్రేమిస్తున్నానని అనిపిస్తోంది. నాలానే అతడికీ అనిపిస్తుందేమో, అలా అనుకోవడం నాకు సంతోషంగా ఉంటుంది. అతడ్ని నేను ప్రేమిస్తున్న విషయం చెబితే, అతను ఒకరినొకరు అర్థం చేసుకునేందుకు కొంతకాలం డేటింగ్ చేద్దామన్నాడు. చిన్న పట్టణంలో పుట్టిపెరిగిన దాన్ని. అతనికి నచ్చేలా నేను మారాలేమో! మారేందుకు, ఇక్కడి జీవన వేగానికి తగినట్లు, మోడ్రన్‌గా నేనుండాలేమో! నాక్కొంచెం, గందరగోళంగా అనిపిస్తుందొక్కోసారి. అమ్మా వాళ్ళతో పంచుకోలేనేమో, ఈ సంగతులన్నీ అనిపిస్తుంది. ఇక్కడ కొత్తగా స్నేహితులైన అమ్మాయిలు కొందరు, నాకన్న చాలా స్వేచ్ఛగా ఉన్నారు. నాలా వాళ్లకి కొత్తగా, సంకోచంగా లేదేమో. ఎదురుచూడటాలు, ఎడతెగని సంభాషణలు, చిన్నిచిన్ని బహుమానాలు, షికార్లు, అలకలు, బతిమాలుకోవడాలు.... అతను తప్పా మరెవరూ ముఖ్యం కాదనిపించటాలు... నాలో ఏదో మార్పు కనిపిస్తుందనింది అమ్మ.... ఆ మార్పేమిటో చెప్పేయాలని పించినా, అతనికి మాటిచ్చినట్లు, నా ప్రేమ సంగతి, రహస్యంగా నాలోనే దాచుకున్నాను."

"అతనికి అమెరికాలో ఉద్యోగం వచ్చి వెడుతున్నాననగానే, నాకు గుండె ఆగిపోయినంత పనైంది. ఇంట్లో వాళ్ళకి చెబుదాం. వీలైనంత తొందరగా పెళ్ళిచేసుకుందాం అన్నాను. అతను చిరాకు పడ్డాడు. పెళ్లికి ఎందుకంత తొందరని అంటాడు. చివరికి, అతడి కోసమే, అతడిని చూడకుండా ఉండలేననిపించి, ఎం. ఎస్. చేస్తానంటూ, పట్టుబట్టి మరీ అమెరికాకి వచ్చేసాను. అతని కోసం, నా మనసెందుకు అంతలా, ఆరాటపడుతుందో, అతనికోసం ఏం చేసేందుకైనా నేనెందుకు, సిద్ధమైపోతానో నాకే తెలీదు. అమ్మా, నాన్న లడిగే ప్రశ్నల్ని తప్పించుకోవడం కోసం, వాళ్ళకి కొంచం దూరంగా, జరగటం తప్పా, నాకు మరో దారి కన్పించటం లేదెందుకో..."

"నేను హాస్టల్ ఖాళీ చేసాను. అతని అపార్ట్‌మెంట్ లో మేం, కలిసుండటం మొదలు పెట్టాం. మా మధ్య బంధం మనసులను దాటి, శరీర సరిహద్దులను దాటి, సహజీవనంగా మారిందని నేను అమ్మావాళ్ళకి చెప్పలేక పోయాను. నేనేమయ్యాను? దారీ తెన్నూ లేని ప్రవాహంలో అతనితో పాటూ కొట్టుకుపోతూ, అతను నాదస్వరం ఊదగానే పడగవిప్పి ఆడే నాగుపాములా... నేను... నాకు ఏడుపొస్తోంది. అతను రాలేదీవేళ. ఎదురు చూసి ఎదురు చూసి.... నీళ్ళునిండిన కళ్ళతో, కలలు లేని కలత నిద్దురలో... . అతనింకా రాలేదు... అతని రాకకోసం, నేను ఎదురు చూడటం ఇప్పుడతనికి చికాకు కలిగిస్తుందట. అతనికి విసుగు, కోపం ఎక్కువయ్యా యనిపిస్తోంది నాకు. మామధ్య మాటలు క్రమంగా తగ్గిపోయాయి. అతడు నానుండి, దూరమవుతున్నాడన్న ఊహకలిగి, దు:ఖంతోనూ, బాధతోనూ వాదించి, ఆగ్రహించి... అతడు మరింత దూరంగా జరిగి.. మా మధ్య, ఈ ఎడతెగని పెనుగులాటకి ముగింపు తెలీక.... మధనపడి, మధనపడి... చివరికి అతనన్నాడు... నాకు స్వేచ్ఛ కావాలని... ప్రేమలో ఊపిరాడని తనాన్ని భరించలేనని... మరి నేను, అతడితోనే నా ప్రపంచం అనుకున్న నేను ఏంకావాలి.... అన్ని సరిహద్దులను దాటి, అతడికోసం ఎగిరివచ్చిన నన్నతడు, అతడి స్వేచ్ఛకి ఆటంకంగా భావించినప్పుడు, నేనేం చేయాలో నాకు అర్థం కాలేదు. నా దు:ఖం గానీ, నా ప్రేమ గానీ, అతడ్నిక చలింప చేయదని నాకు అనేక సందర్భాలలో, అర్థంచేయించిన అతడ్ని ఏం అడగాలో, ఏం అనాలో కూడా నాకు తెలిసేదికాదు. అతడిపై ఎమోషనల్‌గా నేను ఆధారపడకూడదనే వాడు. మన బంధం కూడా ఎల్లకాలం ఉండాలనుకోకూడదని అనడం మొదలు పెట్టినప్పుడు అతని మాటలకి అర్థమేమిటో నాకు తెలియలేదు. ఇక అతడికి నేను అవసరం లేదేమో.... అతనికి నేనేం కానేమో..... అంతేనా... . చివరికి అంతేనా... ఏడుపొస్తోంది"

"తలుపు పైన, చిన్నగా చప్పుడవుతే తలెత్తి చూస్తే, వంటావిడ కాఫీ పట్టుకొచ్చింది. వేడి కాఫీ తాగాక కాస్త రిలీఫ్‌గా అనిపించింది శ్రీధర్‌కి. బాల్కనీలో చల్లగాలికి నిలబడి, సిగరెట్ తాగుతూ ఉంటే, దౌత్య జీవితంలో చివరి మూడు, నాలుగేళ్ళలో అత్యంత వేగంగా, తమకు ఒక్క ముక్కన్నా, తెలీకుండా వేగంగా మార్పులు జరిగాయనిపించిందతనికి. మళ్ళీ కంప్యూటర్ ముందుకెళ్ళి కూర్చున్నాడు శ్రీధర్.

"నువ్వు నాకుండీ లేనితనం, నన్ను బాధిస్తోందనంటే, అయితే విడిపోదాం అన్నాడతను నవ్వుతూనే. అతని మనసులో దాగిన అసలు విషయం అదేనా అని సందేహించినా, గట్టిగా అడగటానికి భయపడ్డాను. అతడికి కావల్సింది ఎలాంటి బాధ్యతలూ, బరువులూ లేని, అతడు కావాలనుకున్నప్పుడు మాత్రమే, అందుబాటులో ఉండే బంధం. ఒకోసారి, నాకనిపించేది... చాలా మంది పురుషులకి, స్త్రీలు, మిఠాయిల్లాంటి వాళ్ళేమో! వాళ్ళకి హుషారుగా, సరదాగా, ఉత్సాహంగా ఉన్నప్పుడో, లేక నీరసంగా, చికాకుగా ఉన్నప్పుడో, తక్షణం శక్తినిచ్చే పదార్థాలుగా వాళ్ళని చూస్తారేమో! అతడు కోరుకున్నప్పుడల్లా అందుబాటులో ఉండే, ఆలోచన, హృదయం లేని ఒక పదార్థాన్నా నేను... అతడు నా దేహాన్ని అర్థం చేసుకున్నట్లుగా, నా మనసును అర్థం చేసుకోలేక పోతున్నాడా? ఎట్లా చెప్పగల నతనికి.... అతడు నాకేమిటో...."

"అతడు మరో అమెరికన్ అమ్మాయితో, సన్నిహిత స్నేహం మెదలు పెట్టాడు. అతడు నా పట్ల చూపుతున్న నిర్లక్ష్యం, నన్ను తప్పుకు తిరగటం, అతడి నొప్పించే మాటలు... వీటన్నిటి వెనుకా ఉన్న కారణాలు నాకు అర్థమైనా, సూటిగా అడిగేందుకు నా సంస్కారం నాకు అడ్డమొచ్చింది. అతడికి చీటికీ మాటికీ, కోపం వచ్చేది. నీ పొసెసివ్‌నెస్‌ను, స్వార్థాన్ని భరించలేను, వెళ్ళిపొమ్మని అవమానించి, ఆ తరువాత నా చేతులు పట్టుకొని ఏడ్చాడు. అతడు మరో ఉద్విగ్నభరిత ప్రేమలో చిక్కుకుని,

నన్ననేక మార్లు గాయపరిచి, ఆ గాయాల్ని తట్టుకోలేక, నేనుచేసే ఆక్రందనల్ని మాత్రమే పట్టించుకొని, నేనంటేనే చిరాకు పడి ... మా మధ్య ఎడతెగని కొట్లాటలు సాగేవి.

నా అంతరాంతరాళంలో ఆ మనిషి పట్ల వెర్రి ప్రేమ, కోపం, భయం, బాధ, ఎడతెగని దుఃఖం... . ఇనుప చక్రాల మధ్య నలిగి పోతున్న, చెరకు పిప్పిలా నా హృదయం నలిగి, నలిగి నెత్తురోడి... నాకు చచ్చిపోవాలనిపిస్తోంది. ఒక బలహీనమైన గడ్డిపోచను పట్టుకొని, సముద్రంలో కొట్టుకుపోతున్నట్లు అనిపిస్తోంది. అతడే క్షణం లోనైనా, నాతోనున్న అన్ని బంధాలనూ, తెంచుకు పోగలడనే ఎరుక, నన్ను భయపెడుతోంది. అవధులు లేని ప్రేమని, నమ్మకాన్ని, అతనిలాంటి మగవాళ్ళు ఎందుకు తృణీకరించి వెళ్ళిపోగలరు? వాళ్ళని అంతగా నిలువనీయనిదేమిటి?అనేక ఆశలతో వెళ్ళి, చివరికి మృత్యు కాంక్షని, మదినిండా నింపుకొని, నేను వెళ్ళిపోతున్నా. అతనితో బంధం ముగిసి పోయిందని నాకనిపించినా, అతడు ఇండియాకొచ్చాక, మళ్ళీ మాట్లాడుకుందా మన్నాడు. అమ్మావాళ్ళకు తెలియకుండా, ఇలాంటి బంధంలో చిక్కుకున్నాను నేను."

"ప్రేమలో హింస, బాధ ఉంటే అది ప్రేమెలా అవుతుందని? అంది అమ్మ. అమ్మకేం తెలుసు అతడ్ని నేనెంతలా ప్రేమించానో... ఒక తృణీకారాన్ని తలపై మోస్తూ, ఇండియాకి తిరిగొచ్చాను నేను. అతని వివరాలు చెబితే, అతని తల్లిదండ్రులతో మాట్లాడతామంది అమ్మ. నాకు నవ్వు, బాధా వచ్చాయి. మా మధ్య బంధం ఏర్పరుచుకునేందుకు, అమ్మానాన్నల అనుమతి తీసుకోని వాళ్లం. ఇప్పుడు అతడు నన్ను పెళ్లాడేందుకు, నా వాళ్ళెల్లి, అతగాడి తల్లిదండ్రులని బతిమిలాడాలా? నా కిష్టం లేదు. నాకోసం వాళ్లలా వెళ్ళి అవమాన పడటం... నాకిష్టంలేదు..."

మధ్యలో కాస్సేపు నిశ్శబ్దం. ఇక ఏం లేదు ఆపేద్దామను కుంటుండగా, మళ్లీ వినిపించాయి దౌత్య మాటలు.

"అతను నాకు ఫోన్ చేయడం పూర్తిగా మానేయలేదు. మా మధ్య మాటలు... గాయాన్ని మళ్ళీ, మళ్ళీ రేపి, మందేసినట్లు. . నా జీవితాన్ని, దిగులుగానైనా, మళ్లా, ప్రారంభించే ప్రయత్నం మెదలెట్టి నెలరోజులన్నా కాలేదు. అతడు సెలవు తీసుకొని, ఇండియా కొచ్చాడు. అతడు తనను క్షమించమన్నాడు. హఠాత్తుగా కళ్ళనిండా, నీళ్ళు నింపుకుని. "నన్ను వదిలి వెళ్ళకు" అన్నాడు. "నిన్నిక భరించలేను. ఎన్నోసార్లు ఈ బంధాన్ని వదులుకోవాలనుకున్నానని, ఎన్నెన్ని రకాలుగా నాకు అర్థమయ్యేలా చేసావో తెలుసా" అన్నాను. అతడు మౌనంగా విన్నాడు నా మాటల్ని. మా మధ్య బంధం ఏదో మళ్ళా, చిగురించినట్టని పించింది. ఆ క్షణాలెంత అల్పమైనవి? ఆశ ఏదో మొగ్గతొడిగాక, నిర్దాక్షిణ్యంగా, అతడు మళ్ళీ నామీదుగా నడిచి వెళ్ళాడు. ఎన్నిసార్లిలా? అతడి లాంటి మగవాళ్ళకి, స్త్రీల హృదయభాష అర్థమవుతుందా? అతడిని నా నుండి తీసేసేందుకు పదే, పదే ప్రయత్నించి, విఫలమై, ప్రతి దినం అతని తలపులో మరణిస్తూ... కలలు, ఆశలూ కోల్పోయిన వాళ్ళెందుకు బతకాలి? అతడే జీవితం కాదు. జీవితం అంతకన్నా విశాలమైందని అమ్మా, నాన్నా అంటారని నాకు తెలుసు. కానీ నేనేం చేయను? అతనికి నేను అక్కర్లేదు. కానీ, నా కతను కావాలి. అతడి తిరస్కారాన్ని తట్టుకోవడం నావల్ల కావడంలేదు ... . నాకు బతకాలని లేదమ్మా... . నాకు ఏడుపొ స్తోందమ్మా... ." దు:ఖంతో పూడుకుపోయిన గొంతుతో దౌత్య ఆఖరి మాటలు.

శ్రీధర్ కళ్ళనుండి ధారాపాతంగా నీళ్ళు కారిపోతున్నాయి. దౌత్య అనుభవించిన వేదన అతని కళ్ళకు కట్టినట్లనిపించింది. జీవితపు వైఫల్యాలనుండి పారిపోయి తలదాచుకునేందుకు మృత్యువును ముద్దుపెట్టుకునే, అనేకానేకమంది ఆడపిల్లల్లానే దౌత్య కూడా... చనిపోయింది. . బలవంతంగా! ఆస్తులు, పిల్లల చదువులు, ఉద్యోగాలు, హోదాలు, అమెరికా సంబంధాల పట్ల ఎంతో శ్రద్ధ పెట్టే తల్లిదండ్రులు, తమ పిల్లలు వైఫల్యాలను, ఎదురుదెబ్బలనూ తట్టుకొని, నిలబడటం ఎలా, అన్న విషయంపై ఎందుకు శ్రద్ధ పెట్టరు అని అతడనుకున్నాడు. పిల్లల అభిప్రాయాలను గౌరవించి, అండగా నిలబడాలనుకునే వాళ్లం, తను, మాధవి. చివరికి, మాలాంటి వాళ్ళం, కూడా ఈ పిల్లల్లో ఆత్మవిశ్వాసం కల్పించలేక పోతే, మరెవరు కల్పించగలరు?

ఈపెద్ద పెద్ద చదువులు, చిన్న వయసులోనే ఉద్యోగాలు, ఆర్థిక వెసులుబాటు, స్వేచ్ఛ, మారుతున్న విలువలు, మానవసంబంధాలు, ఏం చేసైనాసరే, గెలిచితీరాలనే పాఠాలు... . ఈ పిల్లల్ని ఎక్కడికి తీసుకెడుతున్నాయి?

అతడికెందుకో హఠాత్తుగా, దౌత్య చెబుతున్న "అతడు" సర్వనామంలా, అనిపించింది. తనలోనూ, తన కొడుకులోనూ, మంచివాళ్ళనుకునే చాలా మంది మగవాళ్ళలోనూ "అతడు" లాంటి మరో మనిషి సజీవంగానే ఉన్నాడా?

నేనెప్పుడన్నా మాధవి పట్ల అతడిలా ప్రవర్తించానా? కనీసం కొంచెం, కొంచెం అతడిలా...

అతడెవరు? ఎలా ఉంటాడు? ఎవరెవరిలో అతడు దాగున్నాడు? అనాదిగా మారుతూవస్తున్న ప్రతి సమాజంలోనూ, మరల మరల, స్త్రీ సాంగత్యం కోసం, బాధ్యత లేని ప్రేమల కోసం, తన అధికారం, ఆనందంకోసం, వెంపర్లాడే అతడే ఉండి ఉంటాడా? అసలు అతడ్ని తయారు చేస్తుందెవరు?

ఏ లోకాతీత ప్రేమ కోసం మనుష్యులు పరుగెడతారు? దేహభాషను మనుష్యులు అర్థం చేసుకోగలరేమో! మనసుకు కూడా దాహం ఉంటుందనీ, అది కళ్ళాలు తెంచుకున్న గుర్రంలా, పిచ్చిగా పరుగెత్తి, ఆంక్షల ముళ్ళకంచెలనూ, అగడ్తలనూ, దాటబోయి, చివరికి చతికిలబడి, నిస్సహాయ రోదనల్లోకి దిగి, పగిలి, పగిలి తునాతునకలై అంతరించిపోతుందనీ తెలుసు కోగలిగేదెందరు? దౌత్య కూడా అలాంటి ప్రేమలోనే చిక్కుకొని అదృశ్యమైపోయిందా? అతడు, అతడి లాంటి అనేకానేక మంది మగవాళ్ళూ, స్త్రీలని ఏ కొసవరకూ తీసుకెళ్ళి, చివరికి నిర్దాక్షిణ్యంగా వదిలేసి వెడతారు? తమ హృదయాల్ని ప్రేమతో వెలిగించి, అతడి లాంటి వాళ్ళు పరిచే చీకటి దారుల్లోకి, గుడ్డిగా నడిచి వెళ్ళే ఈ ఆడవాళ్ళకి ఎప్పటికి తెలియాలి... తమ ప్రాణాల్ని పుష్పాల్ని చేసి ఆ అల్పుల పాదాల ముందు రాలిపోకూడదని... . .

మనసుకీ, దేహానికీ, మనిషికీ మధ్య ఉన్న పురాసంబంధం ఏమిటో నాకు తెలియటంలేదనుకున్నాడు శ్రీధర్. హింస, అవమానం, ఆత్మన్యూనత, రహస్యం లేని, అతడు లాంటి వాళ్ళు లేని అసలైన ప్రేమ, ఆడవాళ్ళ కెక్కడ దొరుకుతుంది? వైఫల్య ప్రేమల్ని తట్టుకొని, పడిలేచే కెరటంలా నిలబడగలగటం, ఏటికి ఎదురీదటం, జీవితాన్ని మళ్ళీ చిగురింప చేసుకోవడం, దౌత్య లాంటి ఆడపిల్లలు నేర్చుకునేదెట్లా? ఈ ప్రశ్నలకి సమాధానం కోసం ఎక్కడ వెతకాలి అనుకున్నాడతను.

దౌత్య ఆఖరి మాటలు మాధవికి చెప్పాలా? ప్రేమలో అది అనుభవించిన వేదనని, మానసిక హింసని, ఇప్పుడు మాధవి తెలుసుకొని, మరింత బాధపడటంకన్నా ఏం చేయాలదు?" అనుకున్నాడతను.

ఒక్క క్షణం ఆలోచించి, కంప్యూటర్ నుండి పెన్‌డ్రైవ్ తీసి తన పాత కళ్ళద్దాల పెట్టెలో పెట్టి అటకమీదికి విసిరేసాడు శ్రీధర్. 

కథ

# హనీమూన్

- హావోజాన్

టియన్‌ట్సిన్‌కు నేను అతిథిగా వచ్చాను. కనుక భోజనం చేశాక చాలా తీరిక దొరికేది నాకు. అందుకని హైహో నదీ తీరానికి నడుచుకుంటూ వెళ్లేవాడిని.

సాయంసంధ్యలో నది రూపమే మారిపోయేది. ఆ వెలుతురులో నదిపైనున్న ఉక్కు వంతెన, మేడలూ మసకగా కనిపించేవి. నది పైన తేలియాడే చిన్న చిన్న అలలు మెరుస్తుండేవి. ఆ చల్లటి గాలిలో రోజంతా ఉండిన అలసట మటుమాయమయ్యేది. అంతకంతకూ నదీ తీరానికి చేరుతున్న ప్రజల సంఖ్య పెరుగుతోంది. కానీ అందువల్ల ఆ ప్రదేశం తన ప్రశాంతతను కోల్పోలేదు. ముసలివాళ్లు చాయ్ తాగుతూ, చేతిలో పంఖాలు పట్టుకొని, తీరంలో బాగా వెలుతురు ఉన్న చోట్ల మౌనంగా కూర్చుని ఉన్నారు. ఇక పడుచు జంటలు మౌనంగా నది ఒడ్డున ఉన్న రైలింగ్‌ను ఆనుకుని ఉన్నారు. లేదా అక్కడి బెంచీల మీద కూర్చుని మంద్రస్వరంతో సంభాషించుకుంటూ ఉంటారు. పడుచు జంటల సంఖ్యే ఎక్కువ. ఆ ప్రశాంత సాయం సమయాన సంతోషకరమైన జీవితానుభూతిని పొందగల్గుతారు ఎవరైనా గానీ.

ఆ వేసవి సాయంకాలం దృశ్యాల్ని కన్నుల విందుగా చూస్తూ మెల్లగా నడుస్తున్నాను. హఠాత్తుగా నన్ను ఎవరో పిలిచారు. "లియాంగ్, భలే అనుకోకుండా కలిశామే", అంటూ. అలా పిలిచిన వ్యక్తి ఓ పూపొద మాటు నుంచి బైటకు వచ్చి నా భుజాన్ని తన బలమైన చేతుల్తో గట్టిగా కౌగిలించుకున్నాడు. ఆ మసక వెలుతురులో ఆ వ్యక్తి ముఖం నాకు సరిగ్గా కనిపించలేదు గానీ, అతనిలో యద్వానోద్రేకం బాగా వుందనిపించింది.

"అలా గుడ్లప్పగించి చూస్తావేంటి? నన్ను గుర్తు పట్టలేదా? నేను..."

నాకు అతను అప్పుడు గుర్తొచ్చాడు. "అరే, నువ్వు 'యంగ్ పైన్'వి. నిన్ను ఇక్కడ కలుస్తానని ఎవరు ఊహించారు!"

అతను నిష్కల్మషంగా నవ్వుతూ నా భుజాల్ని అంతసేపూ ఊపేస్తూనే ఉన్నాడు. అతను నాకేదో చెప్పాలనుకుంటున్నాడు గానీ ఎలా చెప్పాలో తెలీక ఆగినట్టనిపించింది.

"నువ్వింకా చీసియెన్ కౌంటీలోనే పని చేస్తున్నావు కదా? నీ కుటుంబం ఎలా వుంది? నీ...?"

"నా కుటుంబం గురించి అడుగుతున్నావా?" అంటూ మాట్లాడడం మొదలుపెట్టాడు. అతను గబగబా మాట్లాడేస్తున్నాడు. మాటలు దొర్లుకుంటూ వచ్చేస్తున్నాయి. "ఏయ్, మా ప్రాంతంలో గొప్ప మార్పు జరిగింది. పోయినేడాది మేమొక నదిని మా గ్రామం దాకా మళ్లించాం. హైహో నది అంత పెద్దది కాకపోయినా పంటకూ, పొలాలకూ కూడా సరిపడినన్ని నీళ్లు దొరుకుతున్నాయి దాని నుండి. ఈ ఏడాది మంచి దిగుబడి ఉండడం ఖాయం...."

నేనతన్ని ఒక పొద ఎదురుగ్గా ఉన్న బెంచీ దగ్గరకు లాక్కుపోయి కూచోబెట్టాను. ఆ పొద విరగబూసింది. ఆ మసక చీకటిలో పువ్వుల రంగు తెలీడం లేదు గానీ సువాసనను మాత్రం వెదజల్లుతున్నాయి ఆ పూలు.

హఠాత్తుగా మూడేళ్ల నాటి 'యంగ్ పైన్' నా మనసులో మెదిలాడు.

ఆ ఏడాది కూడా నేను పని మీద టియన్‌ట్సిన్ వచ్చాను. ఒక ప్రశాంతమైన కాలనీలో అతిథి గృహంలో ఉండేవాడిని. ఒక రోజు వసారాలో కొంతమంది టీనేజ్ అమ్మాయిలు, అబ్బాయిలు మా యింటి ముసలి వాచ్‌మెన్‌తో వాదించడం కన్పించింది నాకు.

"నువ్వు అంత మొండిగా ఉంటున్నావెందుకు? నువ్వేమన్నా సరే మేం ఎలాగైనా లోపలకు వెళ్తాం". ఆ గుంపుకు ఒక బక్కపల్చని యువకుడు నాయకత్వం వహిస్తున్నాడు. అతని జుట్టు రేగిపోయి ఉంది. చట్టి ముక్కు, తెల్లటి పొడుగు చేతుల చొక్కా, నిక్కరు, రబ్బరు బూట్లు తొడుక్కున్నాడు. అతను బోర విరుచుకుని కళ్లెర్ర చేస్తూ ముసలాయన మీద అరుస్తున్నాడు.

"మీరు లోపలకు రావచ్చు, కానీ మీరు ఎవరిని చూడాలనుకుంటున్నారో తప్పకుండా చెప్పాలి!" చేతులు బార్లాజాపి ఆయన వీళ్లను అడ్డుకుంటున్నాడు. ఆయన అతి కష్టం మీద తన కోపాన్ని అదుపు చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడని కనిపిస్తూనే ఉంది.

"గ్రామాల నుంచి వచ్చిన కార్యకర్తలెవరినైనా వేం కలవాలనుకుంటున్నాం!"

"కానీ అక్కడున్న అతిథులందరూ గ్రామాల నుంచి వచ్చినవారే!"

"కొండ ప్రాంతం నుండి, ఎత్తైన కొండ ప్రాంతాల నుండి వచ్చిన కార్యకర్త ఎవరైనా కావాలి", అన్నాడు ఆ చట్టి ముక్కు యువకుడు తలనెగురవేస్తూ.

"ఆ కార్యకర్త పేరు ఏమిటి? ముందు సందర్శకుల కాయితం నింపండి."

ఆ యువకుడు దొరికిపోయాడు. తన బృందం కేసి చూసి నాలుకను బయటపెట్టాడు. తర్వాత వాచ్‌మెన్‌ను బతిమాలసాగాడు. "అబ్బా, ఎవరో ఒకర్ని కలిపించు మాకు – నీకు ఎవరు సరైన వాళ్లనిపిస్తే వాళ్లను కలిపించు."

ఆ ముసలాయనకు ఇక సహనం చచ్చింది. వీళ్లను గేటు బయటకు తోసేస్తూ, "అల్లరి మూక! పోయి ఇంకెక్కడైనా ఆడుకోండి," అని అరిచాడు.

అతనికి యింతకంటే మంచి అవకాశం మరి దొరకదు. ఆ చట్టి ముక్కు యువకుడు గొంతు చించుకుని అరవసాగాడు. "ఈయన మనల్ని తిడుతున్నాడు కామ్రేడ్స్, మనం దూసుకుపోదాం కామ్రేడ్స్, ఛార్జ్!"

ఆ అరుపుతో పెద్దగా నవ్వుతూ ఆ యువతీ యువకులు వసారాలోకి దూసుకు వచ్చేశారు.

వారిలో కొందరు నన్ను చూశారు. ఒక అమ్మాయి మిగతావాళ్లతో చిన్నగా చెప్పింది. "అదుగో చూడండి, అక్కడున్న ఆ కామ్రేడ్ గ్రామాల నుంచి వచ్చినవాడిలాగే ఉన్నాడు." ఆ యువకుడు నాకేసి చూసి పల్లికిలించాడు. ఒక్క అడుగులో నా దగ్గరకొచ్చేసి వంగి సలాం చేసి ముక్తసరిగా, "కామ్రేడ్, మీరు గ్రామాల నుండి వచ్చారా? మీరు మాకు సహాయం చేయగలరా?" అని అడిగాడు.

తన చుట్టూ ఉన్న యువతీ యువకుల కేసి చూపిస్తూ, "మేం త్వరలో మిడిల్ స్కూలు నుండి డిగ్రీ పూర్తి చేయబోతున్నాం. మా క్లాస్‌మేట్స్ అందరం మాట్లాడుకుని, ప్రభుత్వం కోసం గొప్ప, గొప్ప పనులు చేయాలని నిర్ణయించుకున్నాం. కొందరు చదువు కొనసాగిస్తారు, కొందరు ఇంజినీరింగ్‌కి గానీ, వ్యవసాయ కళాశాలకు గానీ వెళ్తారు, కొందరు ఫ్యాక్టరీలకు గానీ, వ్యవసాయ పనిముట్ల కర్మాగారానికి గానీ వెళ్లాలనుకుంటున్నారు. ఇక్కడున్న ఈ కామ్రేడూ, నేనూ గ్రామాలకు వెళ్లాలని నిర్ణయించుకున్నాం. మా స్కూలు అధికారులు ప్రయత్నం చేసి మమ్మల్ని పట్టణ శివారు ప్రాంతాలకు పంపిస్తామని అన్నారు. కానీ మాకేమో శివారు ప్రాంతాలంటే మరీ దగ్గర అన్పిస్తోంది. అవి అంత సవాలు చేసేవిగా ఉండవనిపిస్తోంది. మాకు కొండ ప్రాంతాలకు వెళ్లాలనుంది. అతి కష్టమైన ప్రాంతాలకు వెళ్లాలనుంది. మీరు మాకు ఏదైనా ప్రాంతాన్ని చూసి పెట్టగలరా? నా పేరు 'యంగ్ ఫైన్'. ఇతని పేరు..."

'యంగ్ ఫైన్' - ఈ పేరు అతనికి సరిగ్గా సరిపోయింది. నిజానికి నా ఎదురుగా ఉన్న ఆ యువతీ యువకులందరూ ఎదుగుతున్న ఫైన్ చెట్లలాగానే ఉన్నారు.

అది మా మొదటి కలయిక. ఆ తర్వాత చాలాసార్లు అతను తన స్నేహితులతో నా గదికొస్తుండేవాడు. వాళ్ల ఆదర్శాల గురించి చెప్పి నా సహాయం అర్థించేవాడు. వాళ్లందరూ ఎంతో ఉత్సాహంగా వుండేవారు. ఉట్టి కబుర్లు చెప్పడం కాక నిజంగా పని చేయాలనే సంకల్పం గలవాళ్లు వాళ్లందరూ. ఒకసారి తను ఎంత పట్టుదలగా ఉన్నాడో తెలియజేయడానికి వాళ్ల నాన్నను కూడా తీసుకువచ్చాడు. ఆయన చాలా అనుభవం గల లేత్ టర్నర్. కార్మికుడిగా పాతికేళ్ల అనుభవం వున్న మనిషి. చాలా నిరాడంబరంగా, నిదానంగా ఉండే ఆయన తన కొడుకు కంటే చాలా భిన్నంగా ఉంటాడు. 'యంగ్ ఫైన్'కిప్పుడు పద్దెనిమిదేళ్లు వచ్చాయనీ, అందుకని అతనిప్పుడిక తన స్వంత జీవితాన్ని ఆరంభించాలనీ ఆయన అన్నాడు. పార్టీ అతనికి మార్గదర్శకత్వం వహిస్తుంది కనుక అతను తప్పుదోవ పట్టే అవకాశం లేదు. అయితే ఎవరైనా ఒక మార్గాన్ని ఎంచుకున్నాక వాళ్లు ఆ మార్గాన్నే అంటిపెట్టుకుని ఉండాలనీ, కేవలం కొత్తదనం కోసం దేన్నైనా ఎన్నుకునేవాళ్లంటే తనకు నచ్చదనీ మాత్రమే ఆయన తన కొడుకుకు చెప్పదల్చుకున్నాడు.

ఆ తర్వాత నేను వారి స్కూలుకు వెళ్లాను. అధికారులు కూడా వారి ఆలోచనను సమర్థించారు. నేను వారికి సహాయం చేస్తానని వాగ్దానం చేశాను.

పాత విముక్తి ప్రాంతానికి చెందిన ఒక జిల్లా పాన్‌షాన్. అక్కడ వుండే ఒక స్నేహితునికి ఉత్తరం రాశాను. కొద్ది రోజుల్లో ఆ జిల్లా అధికారులు స్కూలు వాళ్లకు కబురు చేశారు. ఆ విద్యార్థుల్ని తమ దగ్గరకొచ్చి వుండిపొమ్మని ఆహ్వానించారు. కొద్ది రోజుల్లోనే 'యంగ్ ఫైన్', అతని స్నేహితులు డిగ్రీ పూర్తి చేసుకుని, హోపెయ్ రాష్ట్రంలోని చిసియెన్ కౌంటీ, పాన్‌షాన్ జిల్లాకు చెందిన సియాంగ్ కువోయు ఉత్పత్తి బ్రిగేడ్‌లో చదువుకున్న కొత్త రైతులుగా మారిపోయారు.

అది జరిగి ఇప్పటికి మూడేళ్లవుతుంది. అనుకోకుండా అతన్ని ఇక్కడ మళ్లీ కలిశాను. అతను పొడుగ్గా, ధృఢంగా ఎదిగాడు. నా భుజాల మీద అతని చేతులు ఇనుప కడ్డీల్లా ఉన్నాయి.

"నువ్వు పాన్‌షాన్‌ను వదిలి పెట్టలేదు కదా?"

"లేదు, పోయినేడాది నన్ను పార్టీలోకి తీసుకున్నారు. వసంతకాలంలో మా ఉత్పత్తి బృందం సభ్యులు నన్ను డిప్యూటీ నాయకుడిగా ఎన్నుకున్నారు. నాకంత అర్హత లేదన్నాను. కానీ వాళ్లు పట్టుబట్టారు," అన్నాడు నవ్వుతూ.

"నిజంగానా, అయితే 'యంగ్ ఫైన్' పెద్ద చెట్టుగా ఎదిగిందన్న మాట!"

"ఏం కాదు, నేనింకా చిన్న పొదలాంటి వాడినే. కానీ నేను గ్రామీణ ప్రాంతాల్లో వేళ్లూనుకున్నాను. నిజంగా వేళ్లూనుకున్నాను." ఆ విషయంలో తన గర్వాన్ని దాచుకోలేక అతను అదే మాటను రెండుసార్లు అన్నాడు.

తూర్పు తీరం వెంబడి ఉన్న వీధి దీపాలు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. అవి ఎప్పటి నుండి వెలుగుతున్నాయో కూడా మేం గమనించలేదు. ఆ బంగారు కిరణాలు నీటి మీద పడి తళతళ మెరుస్తున్నాయి. సుదూర తీరాల నుండి వస్తున్న పడవ తెరచాపలు దించుతున్న శబ్దాలు, వాళ్లు హడావుడిగా అటూ ఇటూ తిరుగుతున్న శబ్దాలు మా చెవిన సోకాయి. కొంతసేపయ్యాక ఆ హడావుడి అంతమై వాతావరణం తిరిగి నిశ్శబ్దంగా మారిపోయింది.

మా ఇద్దరికీ చెప్పుకోవడానికి చాలా విషయాలున్నాయి. కానీ ఎక్కడ మొదలు పెట్టాలో అర్థం కాలేదు. 'యంగ్ ఫైన్' నవ్వుకుంటూ తాను గ్రామీణ ప్రాంతాల్లో నిలదొక్కుకున్నానని మరోసారి చెప్పాడు. అతను నాకేదో చెప్పాలనుకుంటున్నాడని నాకు అనుమానం వచ్చింది. నా అనుమానాన్ని నిజం చేస్తూ అతను నా భుజాల్ని గట్టిగా పట్టుకుని, కొద్దిగా సిగ్గుపడ్తూ గొంతు తగ్గించి, "లియాంగ్! నేను పెళ్లి చేసుకున్నాను. వారం రోజులే అయ్యింది," అన్నాడు.

"ఓహో! అయితే హనీమూన్ కోసం తిరిగి వచ్చావన్న మాట!"

"ఔను. నీకు చామంతి తెలుసా?"

"ఏమిటీ, చామంతి ఇప్పుడు నీ భార్యా?" నేను అరవకుండా వుండలేకపోయాను.

అతను చిరునవ్వుతో తలూపాడు.

నా మనోనేత్రం ముందు ఒక అమ్మాయి నవ్వుతూ, ఉత్సాహంగా నాకేసి పరుగెత్తుకొస్తున్న దృశ్యం మెదిలింది. ఒక కొండప్రాంత గ్రామంలో పూచిన చామంతిలాగే ఉంటుందామె. నేను 'యంగ్ ఫైన్'ని కలవడానికి కొద్ది రోజుల ముందే ఆమెను కలిశాను. ఆమె ఒక ఉత్పత్తి బృందం నాయకురాలు. చాలా సమర్థురాలు. ముక్కుసూటిగా పోయే మనిషి. ఆ గ్రామంలో చాలామంది యువకులు ఆమె పట్ల ఆకర్షితులయ్యారు గానీ అదే సమయంలో ఆమె అంటే కొద్దిగా భయపడేవారు. పీకింగ్‌లో ఆమెకు ఎవరో ఒక దూరపు బంధువు

ఉన్నాడనేవారు. అతనికి ఆమె అంటే చాలా ఇష్టమనీ, ఆమెకు ఎన్నో బహుమతులు తెచ్చివ్వాలనీ, ఆ విధంగా ఆమెను ఎలాగైనా నగరానికి తీసుకెళ్లాలనీ, సుఖమయమైన జీవితానికి ఆమెను ఒప్పించాలని ప్రయత్నించేవాడనీ అనేవారు. ఒకసారి అతను ఆమెకు ఖరీదైన బట్టలు, అలంకరణ సామగ్రి తెచ్చిచ్చాడు. ఆమె వాటిని ధరించి బొమ్మలా తయారై తన వెంట నగరానికి రావాలని పట్టుబట్టాడు. ఆమె కోపంతో ఊగిపోయింది. జీవితంలో ఎన్నడూ ప్రదర్శించనంతటి కాఠిన్యాన్ని ప్రదర్శిస్తూ, "మా కొండ ప్రాంత ప్రజలం మా కలల్లో కూడా ఆనందకరమైన జీవితం గురించే ఆలోచిస్తాం. కానీ మాకు మీ దయాదాక్షిణ్యాలు అవసరం లేదు. నువ్వు ఇదంతా మర్చిపోతే మంచిది. మళ్లీ ఇలాంటి చెత్త విషయాలతో నా దగ్గరకొస్తే నిన్ను చీపురు కట్టతో తరిమి కొట్టాల్సి వస్తుంది!" అంది. కొద్ది రోజుల వరకూ గ్రామంలో ఇదే చర్చనీయాంశమైంది.

ఆ ఘట్టం గుర్తుకు రాగానే నాకు నవ్వాగలేదు.

"ఎందుకు నవ్వుతున్నావు? మేం గ్రామీణ ప్రాంతంలో నిలదొక్కుకున్నామనే విషయం వాస్తవం కాదా? ఆమె నాకంటే చురుకైనదనీ, నేనంత చురుగ్గా వుండననీ, అందుకని మేం మంచి జంట కాలేమనీ నువ్వు అనుకుంటున్నావేమో? వూ, అది నిజమే." అతను వెనక్కి ఆనుకొని కొంతసేపు కళ్లు మూసుకుని ఆలోచించాడు. ఆ తర్వాత మళ్లీ హావభావాలతో తన సంభాషణను కొనసాగించాడు.

"మా పెళ్లి రోజు నా సహ విద్యార్థులూ, స్నేహితులూ మా ప్రేమ గాథను చెప్పమని అడిగారు. కానీ ఆ రోజు నేను ఒక్క ముక్క కూడా చెప్పలేకపోయాను. నిరంతరం కొట్లాడుకోవడం నుండి మా ప్రేమ పుట్టుకొచ్చినట్టు అనిపిస్తుంది. అదుగో, మళ్లీ నవ్వుతున్నావు, నేను చెప్పేది విను!"

"మూడేళ్ల క్రితం నేను గ్రామీణ ప్రాంతాలకు వెళ్లాలని నిశ్చయించుకున్నాను. అప్పుడు నా లక్ష్యం ఏదైనా గొప్ప పనులు చేయాలని, ఒక హీరోలాగా ఏమైనా అద్భుతాలు చేయాలని. నీకు అదంతా తెలుసు. వెనక్కి తిరిగి చూసుకుంటే అదంతా చిన్న పిల్లల చేష్టలా అనిపిస్తుంది. కానీ ఆ రోజు నా పట్టుదల పూర్తిగా ఈ లక్ష్యం మీదనే ఆధారపడి వుంది. స్కూల్లో చదివే రోజుల్లో నేను తరచూ 'పీపుల్స్ డైలీ'ని ఎందుకు చదివేవాడినంటే అందులో వుండే 'గొప్ప విషయాలు' తెల్సుకోవడం కోసం. అది పార్టీ కేంద్రకమిటీ పత్రిక. అది దేన్నైనా ఆమోదించింది అంటే అది నిస్సందేహంగా గొప్ప విషయమే అయి వుంటుంది. ప్రజా విముక్తి సైనికుల సాహసవంతమైన కథల్ని చదివినప్పుడు ఒక సైనికుడిని కావాలనుకునేవాడిని. పారిశ్రామిక నిర్మాణం గురించిన వ్యాసాలు చదివినప్పుడు, ఒక లోకోమోటివ్ డ్రైవర్ కావాలనుకునేవాడిని. వ్యవసాయం గురించి చదివినప్పుడు చాలా కష్టాలున్న ప్రాంతంలో రైతుగా పని చేయాలని ఆలోచించేవాడిని. ఒక్క మాటలో చెప్పాలంటే పార్టీ ఆదేశాల్ని పాటించడం ద్వారా నేను తప్పు చేసే అవకాశం వుండదనుకునేవాడిని. అటువంటి గొప్ప పనులు చేయాలనే లక్ష్యంతోనే నేను పాన్‌షాన్‌కు వెళ్లాను.

"నేను కమ్యూన్‌కు వెళ్లగానే, అక్కడి పార్టీ సెక్రటరీ నాతో, 'సియాంగ్ కువోయు ఉత్పత్తి బ్రిగేడ్ కొండ అవతల నుండి ఒక నదిని ఇక్కడకు మళ్లించదల్చుకుంది. అక్కడి పనిలో పాలు పంచుకోవడానికి చదువుకున్న వాళ్లను వాళ్లు ఆహ్వానిస్తున్నారు. నువ్వు అక్కడకు వెళ్లొచ్చు,' అన్నాడు. సంతోషం పట్టలేకపోయాను. రెండు రోజుల తర్వాత నన్ను తీసుకువెళ్లడానికి ఉత్పత్తి బ్రిగేడ్ నాయకుడు ఒక గాడిదను తీసుకువచ్చాడు. అతను కలవగానే నేను అతనితో నేనీ ప్రాజెక్టులో పాలు పంచుకోవాలనుకుంటున్నాననీ, ఏదైనా గొప్ప పని చేయాలనుకుంటున్నాననీ చెప్పాను. నేను ఇంకా ముగించానో లేదో అతని వెనకాల వున్న ఒక అమ్మాయి కొరడా ఝుళిపించినట్లే, "నువ్వు వుత్తి మాటలు మాట్లాడుతున్నావు. గొప్ప గొప్ప పనులు చేయాలని ఎందుకనుకుంటారో నీకేమైనా అర్థమౌతోందా?" అంది. ఆమె ఆ గదిలోకి వచ్చినట్టే నేను గమనించలేదసలు. అదేం ప్రవర్తన! నాకు పిచ్చి కోపం వచ్చేసింది. అది కొత్త ప్రదేశం కాకపోయి ఉంటే గట్టిగా అరిచేసేవాడినే. ఆమె యింకా ఏదో చెప్పాలనుకుంటున్నట్టుగా కన్పించింది. కానీ ఉత్పత్తి బ్రిగేడ్ నాయకుడు ఆమెకు సైగ చేయడంతో ఆమె వూరుకుంది. మేం బైల్దేరే ముందు బ్రిగేడ్ నాయకుడు ఆమెను బైటకు పిల్చి మందలించాడు. అతనన్న ఆఖరి మాటలు మాత్రం నేను విన్నాను.

"సమావేశం కాగానే వెంటనే వచ్చేసెయ్. ఈ పని నీకే అప్పజెప్పారు ఎలాగూ," అన్నాడు అతను.

"ఇనుమును తయారు చేయడానికి బొగ్గు వేసే మనుషులు చాలామందే అవసరం అవుతారు. కానీ అసలు విషయం ఏమిటంటే కొలిమిలో కరిగించే ముడి పదార్థం మంచిదై వుండాలి," అని సమాధానమిచ్చిందా అమ్మాయి.

"మంచో, చెడో మనం అతన్ని మంచి ఉక్కుగా తయారు చేయాలి. సరే. ఇప్పుడు మనం సమావేశానికి వెళ్దాం. నువ్వు తిరిగి వచ్చాక, ఈ విషయం మాట్లాడ్డానికి మనం కొంతమందిని సమావేశ పరుద్దాం." ఎందుకో వారు నా గురించే మాట్లాడుకుంటున్నా రనిపించింది నాకు.

"ఇదంతా జరిగినా కూడా నా ఉత్సాహం ఏమాత్రం తగ్గలేదు. నేను నా జుట్టును అంటకత్తెర వేయించుకున్నాను. గ్రామానికి వెళుతున్నప్పుడు చిన్న, చిన్న వాగులూ, వంకలూ దాటినప్పుడు కావాలనే నా ప్యాంటు మీద బురద చిందేలా నడిచాను. ఇలాంటి చిహ్నాలతో నేనొక రైతులా కన్పిస్తానేమో అనుకున్నాను."

"మేం గ్రామానికి చేరగానే, ప్రాజెక్టును ఎప్పుడు ప్రారంభిస్తాం అని అడిగాను బ్రిగేడ్ నాయకుడిని. ఆయన 'దాని మీద ఇంకా కొంత చర్చించేది ఉన్నది, ఈలోపు నువ్వు వేరే పన్లు ఏమైనా చేయొచ్చు. ముందు వ్యవసాయం పనులు ఎలా చేయాలో నేర్చుకో!"

'వ్యవసాయం పనులు తప్పకుండా చేస్తాను. నేను ఇక్కడకు వచ్చిందే పని చేయడం కోసం, పనిని తప్పించుకుంటానా?' అనుకున్నాను మనసులో.

"నాకిచ్చిన పని చాలా సులభమైనది. గడ్డిమోపుల్ని మార్చడంలో పశువుల కాపరికి సహాయం చేయడం. కానీ నాకెంతగా చెమటలు కారాయంటే ఉదయం పూట పని పూర్తయ్యే సరికి నా బట్టలు పూర్తిగా చెమటతో తడిసిపోయాయి. చెమటతో, దుమ్ముతో నా బట్టలు ఎంత మురికిగా తయారయ్యేవంటే రోజూ బట్టలు మార్చుకోవాల్సి వచ్చేది. నా దగ్గర ఇక ఉతికిన బట్టలన్నీ అయిపోవడంతో బట్టలు ఉతుక్కోవాలనుకున్నాను. మధ్యాహ్నం ఓ పెద్ద పింగాణీ బేసిన్

తీసుకుని వసారాలో బట్టలు ఉతకసాగాను. రెండు చొక్కాలు ఉతికాక ఆ మురికి నీళ్లను పారబోయబోతుండగా ఒక అమ్మాయి వసారాలోకి వచ్చింది. తలుపు దగ్గర నుంచుని కఠినంగా, "ఈ నీళ్లను ఎంత దూరం నుంచి తెచ్చారో తెల్సా నీకు? అనడిగింది."

"నాకు సహనం చచ్చింది. తలపైకెత్తి చూసేసరికి ఇంకెవరు? కమ్యూన్ ఆఫీసులో నన్ను తిట్టిన అమ్మాయే. నేను ముఖం మాడ్చుకున్నాను. ఆమెను పట్టించుకోలేదు. 'నా పనుల్లో వేలు పెట్టమని నిన్నెవరు నియమించారట? నేను నీళ్లు మోయలేనని అనుకుంటున్నావేమో, సరే వేచి చూడు నీకే తెలుస్తుంది' అనుకున్నా మనసులో. ఆ రెండు చొక్కాల్నీ తాడు మీద ఆరేసి మిగతా బట్టలు తీసుకుని గదిలోకి వెళ్లిపోయాను."

'అబ్బా, రెండు చొక్కాలు వుతికే సరికే నా వేళ్లు అప్పుడే ఎర్రగా కందిపోయి నెప్పెడుతున్నాయి!'

"మధ్యాహ్నం నాతో పని చేసే గ్రామస్తులను అడిగి బావి ఎక్కడుందో తెల్సుకున్నాను. గ్రామానికి రెండు 'లీ'ల దూరంలో పాత డ్రాగన్ చెరువు దగ్గర బావి ఉంటుందని చెప్పారు. రాత్రి పడుకునే ముందు నీళ్ల బకెట్లు, కావడి తయారు చేసి పెట్టుకున్నాను. మర్నాడు తెల్లారగట్ల వాటిని తీసుకుని బయల్దేరాను."

"ఉదయం పూట ఆ కొండ ప్రాంత గ్రామం ఎంత అందంగా ఉందనీ! నేనంత అద్భుత దృశ్యాన్ని ఎన్నడూ చూడలేదు. ఆ కొండలూ, లోయలూ అన్నీ పచ్చగా మెరిసిపోతున్నాయి. రోడ్డు పక్క పూల మీద మంచు బిందువులు ఆ రోడ్డుకే కళనిస్తున్నాయి. పక్షులు ఎగురుతున్నాయి. ఎక్కడపడితే అక్కడ మిడతలు ఆనందంగా గెంతులేస్తున్నాయి. నేను నడుస్తూ ఆ తాజాగాలిని పీల్చుకుంటున్నాను. కావడికున్న బకెట్లు కిర్రుకిర్రుమంటున్నాయి. పొలాల్లో పని చేయడం ఎంత ఆనందంగా వుంటుందనీ!"

"కానీ రెండు బకెట్లలో నీళ్లు నింపుకుని తిరిగి వచ్చేటప్పుడు నేను ఇంత ఆనందంగా లేను. కొద్ది దూరం నడిచానో లేదో ఆ బరువు తలకు మించినదనిపించేసింది. నా భుజాలు ఎంతగా నెప్పి పుట్టాయంటే నేను వెనక్కి వంగుతూ లేదా మెడను ముందుకు చాస్తూ ఆ నెప్పిని తగ్గించుకునే ప్రయత్నం చేశాను. కానీ అలా చేస్తే నా భుజాలు ఇంకా నెప్పి పుట్టేవి. నా కాళ్లు వణకసాగాయి. యాంకో జానపద నృత్యం చేసేవాళ్లలా ముందుకూ వెనక్కూ ఊగసాగాను. నేను ఎంత దయనీయంగా కనిపించి వుంటానో ఊహించుకో గలిగాను. నేను నా బరువును దించుకుని కొంచెం విశ్రాంతి తీసుకుందామనుకునేలోగానే, ఎవరో హఠాత్తుగా నా ఎదురుగా నుంచుని, "బరువుగా వుందా? నీళ్లు తేవడం అంత తేలికైన పనేమీ కాదనుకుంటాను, అవునా?" అన్నారు."

"తలెత్తి చూసేసరికి మళ్లీ ఆ అమ్మాయే. ఆమె అప్పుడే గ్రామం నుండి వస్తోంది. ఆమె కావడికి రెండు ఖాళీ బకెట్లు వేలాడుతున్నాయి. ఒక చిన్న వాష్ బేసిన్ ఉంది ఆమె చేతిలో. నేను పళ్లు గిట్ట కరచుకుని, బరువును భుజం మార్చుకోవడానికి మాత్రమే ఆగినట్లు నటించి ముందుకు వెళ్లాను."

"కావడి బద్ద ఒక కత్తిలా నా భుజాన్ని కోసేస్తోంది. నా కాళ్లు వణికిపోతున్నాయి. కొండవాలుకు చేరుకోగానే ఎంత ఉపశమనం పొందానో మాటల్లో చెప్పలేను. ఆ అమ్మాయి ఈ పాటికి కొండ దిగి వుంటుందనీ, ఆమె నన్నిక చూడలేదనీ, కనుక కొంత విశ్రాంతి తీసుకుందామనీ అనుకున్నాను. కానీ వెనక్కి తిరిగి చూసేసరికి ఆమె యింకా కొండ పైనే నుంచుని నన్నే గమనిస్తోంది! ఆమెకు నా మీద ఎంత కక్ష! నేను ఎంత దయనీయంగా వున్నానో చూద్దానికే ఆమె అలా గమనిస్తోంది. నేను బిగుసుకుపోయి ఇంటికేసి నడిచాను. నీళ్లకుండీలో నీళ్లు పోశాను. వెంటనే మంచం మీద పడి కాస్సేపు అలాగే పడి వుండాలని ఎంతగా అన్పించిందో! కానీ రెండోసారి నీళ్ల కోసం పోకపోతే ఆ అమ్మాయి తప్పకుండా నన్ను చూసి నవ్వుతుంది. నేను మెతకవాడినేం కాను. నేను మళ్లీ బకెట్లు తీసుకుని బైల్దేరాను."

"అదసలు బావి కాదు. ఒక రాతిబిలం. ఆ రాళ్ల సందుల్లోంచి నీళ్లు బొట్లుబొట్లుగా కారేవి. ఎక్కువా వచ్చేవి కావు. తక్కువా వచ్చేవి కావు. ఎప్పుడూ అంతే. నీళ్లు చాలా తక్కువగా వుండేవి. ముగ్గురు మనుషులు ఒకేసారి బకెట్లు తీసుకొస్తే నీళ్లు నింపుకోవడానికి సరిపోయేవి కావు."

"నేను నీళ్ల కోసం వచ్చేసరికి అక్కడ ఆ అమ్మాయి నిదానంగా బట్టలు ఉతుక్కుంటూ కూచుంది. ఆమెను పట్టించుకోకుండా నేను నీళ్లు తీసుకోవడానికి వంగాను. బకెట్లు నిండగానే నేను బరువును ఎత్తుకుని వెళ్లబోయాను. 'కొంచెం విశ్రాంతి తీసుకో', అన్నది. అయినా నేనామెకేసి చూడలేదు. 'నీకు వెంటనే కోపం వస్తుంది కదూ', ఆమె బనాయించింది. నేను కోపంగా ఏదో అనబోయాను. ఇంతలోనే ఆమె పకపకా నవ్వసాగింది. ఆమె ఎంతసేపు నవ్విందంటే ఆమె ఇక ఆపదా అన్పించేసింది. నేను ఆమెకేసి చాలా కోపంగా చూశాను. కానీ ఎంత ఆశ్చర్యం! హఠాత్తుగా ఆమె చాలా అందంగా వుంటుందని గుర్తించాను నేను. నేను ఇంతవరకు చూసిన అమ్మాయిల్లోకెల్లా ఆమె ఆకర్షణీయంగా వుంది. ఆ పచ్చని వాతావరణంలో తెలుపు, గులాబీ రంగు చుక్కలు గల చొక్కా వేసుకున్న ఆమె తాజాగా, అప్పుడే విరబూస్తున్న తామరపూవులా ఉంది. నిర్మలంగా, చిలిపితనం నిండిన ఆమె కళ్లు రెండు ముత్యాల్లా మెరుస్తున్నాయి. ప్రశాంతమైన లోయలో పచ్చని గడ్డి మీద మంచు బిందువుల్ని ఆ నవ్వు కదిలించినట్టు తోచింది. ఆమెకేసి చూస్తున్న కొద్దీ ఆమె మీద నా కోపం మటుమాయమైంది. నాకు తెలీకుండానే బుద్ధిగా గడ్డి మీద కూర్చున్నాను. ఆమె నాకేదో చెప్పాలను కుంటున్నట్లనిపించింది. అందుకని ఆమె మొదలుపెట్టేవరకూ ఓపిగ్గా కూర్చున్నాను. కొంత సేపయ్యాక తల వూపి, 'వూ, నువ్వు చాలా బాగా చేశావు. ఒక మనిషికి ఉండాల్సిన పట్టుదల నీకు ఉంది. ఇదే పద్ధతిలో కొనసాగించు ఏ పనైనా. భవిష్యత్తులో ఎప్పుడైనా ఇబ్బందుల నెదుర్కున్నప్పుడు కూడా ఇదే పద్ధతిలో వాటితో వ్యవహరించు. అప్పుడిక నిన్ను ఏదీ ఆపలేదు!' అంది."

"అయితే నాకీ ఉపన్యాసం యివ్వడానికే ఆమె నన్ను కూర్చోమన్నదన్నమాట. నేను వెంటనే లేచి బకెట్లు తీసుకుని వెళ్లిపోయాను. దారిలో అంత పళ్లు గిట్టకరుచుకోవాల్సి వచ్చినా నేను ఒక్కసారి కూడా వెనక్కి తిరిగి చూడలేదు. ఒక్కసారి కూడా దమ్ము కోసం ఆగలేదు."

"నేను ఉంటున్న యింటి గేటు వద్దకు వచ్చేసరికి, ఆమె నా వెనకాలే వచ్చిందని అర్థమైంది. ఆమె తన చిన్న బేసిన్ కింద పెట్టి,

'వీటిని ఆరెయ్!' అంది. ఆమె ఇంతసేపూ వుతికిన బట్టలు నావేనని అప్పుడు అర్థమైంది నాకు!"

"ఆ రోజు రాత్రి బ్రిగేడ్ నాయకుడు నన్ను కలవడానికి వచ్చాడు. వెళ్లే ముందు, "సరే అయితే, చామంతి నిన్ను తన బృందంలోకి ఎన్నుకుంది. ఆమె ఈ బృందం నాయకురాలే కాక, యువజన సంఘం సాధారణ శాఖా కమిటీ సభ్యురాలు కూడా. ఆమె బృందంలోని యువతీ యువకులందరూ ఆమెను ఇష్టపడతారు. నువ్వు ఆమెతో సహకరించాలి. మీరు ఇద్దరూ ఒకరి నుండి ఒకరు నేర్చుకోవాలి."

"కానీ నాకలాంటి వ్యక్తితో పరిచయమే లేదు. అందుకని అడిగాను, "ఈ చామంతి ఎవరు?"

"అదేంటీ, పాత డ్రాగన్ చెరువు దగ్గర మీరు ఇద్దరూ వుదయం అన్నీ మాట్లాడుకుని తేల్చుకోలేదా?"

"ఓహో, అయితే ఆమేనన్నమాట! ఆమెతో అన్నీ మాట్లాడి తేల్చుకున్నదెవరంట? కానీ ఇప్పుడు నాయకత్వం నన్ను ఆమె బృందానికి కేటాయించింది. నాకు ఆ ఆలోచన నచ్చలేదు. కానీ నేను యేం అనలేదు. ఎందుకంటే నాయకత్వం ఆదేశాల్ని పాటించాలని నాకు తెలుసు."

"మర్నాడు ఉదయాన్నే చామంతి నన్ను తన బృందంలో చేర్చుకోవడానికి వచ్చింది. ఆమె బృందంలోని వారు చాలామంది కుర్రకారే. కనుక మేమందరం మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ ఎంతో సంతోషంగా ఉండినాం. అప్పటి నుంచీ చామంతి ఇంతకు ముందరలా నన్ను తప్పు పట్టడం మానేసింది. అందుకు భిన్నంగా ఆమె నా గురించి ఎంతో పట్టించుకునేది. ఉదాహరణకు, నేను ఒకసారి వారితో పాటు మట్టి తవ్వాను. మేమా రోజు పొలానికి వెళ్లేముందు ఆమె నేను చేసిన పనిని నిశితంగా పరిశీలించింది. ఎంత నిశితంగా పరిశీలించిందంటే ఏదో పోగొట్టుకున్న నిధిని వెతుకుతున్నట్టు, అది దొరికేవరకూ కదలదు అన్నట్టుగా కన్పించింది. ఆఖరికి ఇక లేచి నుంచుని, "కొత్తగా మొదలు పెట్టావు కనుక చాలా మెరుగు అనే చెప్పుకోవాలి. కానీ నువ్వు నుంచున్న పద్ధతి ఏ మాత్రం సరిగ్గా లేదు. నీ కాళ్లూ, చేతులూ ఎంతగా బిగుసుకుపోయి ఉన్నాయంటే నీకు పక్షవాతం వచ్చిందనుకుంటారు ఎవరైనా," అంది."

"మరో ఉదాహరణ. సాయంత్రం నేను బృందంలోని సభ్యుల వర్క్ పాయింట్లు రాసేటప్పుడు ఆమె నా పక్కనే నుంచుని నా చేతుల కేసి తేరిపార చూసింది. ఒక రోజు ఇంటికి వెళ్లే ముందు ఇలా అంది, "నీ చేతిరాత చాలా అందంగా, స్పష్టంగా ఉంది. బృందంలో చదువుకున్న వ్యక్తి ఉండడం యెంతో బాగుంది. నీ జ్ఞానాన్ని ఉపయోగించడానికి నీకు సరైన అవకాశం దొరికింది. కానీ కేవలం నీ చేతుల్ని ఉపయోగించి బుర్రను ఉపయోగించకపోతే ఏం ప్రయోజనం ఉండదు. ఈ సంఖ్యల్లో అంటే లెక్కించడంలో ఉండే సమస్యల్ని కనిపెట్టడానికి ప్రయత్నించాలి నువ్వు. ఆ విధంగా వాటిని పరిష్కరించడానికి నాయకత్వానికి సహాయపడాలి. లేకపోతే నువ్వు ఒక రాసే యంత్రానివి అయిపోతావు!"

"చూశారా, ఆమె నాతో వ్యవహరించిన విధానం అది. ఒకే సమయంలో పొగడ్తనూ, విమర్శనూ అందించేది."

"ఆశ్చర్యకరంగా ఆమె అలా వ్యాఖ్యానించిన ప్రతిసారీ నేను నా పనిలో కొంత అభివృద్ధి చెందేవాడిని. మట్టిని తవ్వేటప్పుడు ఇతరులు యెలా చేసేవారో, ఎలా నుంచునేవారో, వారి కదలికలు ఎలా వున్నాయో అధ్యయనం చేసేవాడిని. నేను తక్కువ శ్రమతో పని చేయగల్గడమే కాక, మెరుగ్గా కూడా చేయగల్గేవాడిని. వర్క్-పాయింట్లు నమోదు చేసేటప్పుడు ఒక యంత్రంలా రాసుకుపోవడం కాక, ఆ సంఖ్యల వెనుక వున్న విషయాల్ని తెలుసుకోవడానికి ప్రయత్నించేవాడిని. కొంతమంది సభ్యులు అంత ఉత్సాహంగా పని చేయకపోవడం వల్ల వారికి తక్కువ వర్క్-పాయింట్లు వచ్చేవి. అలాంటివారి గురించి నాయకులకు చెప్పేవాడిని, చెప్తే వారికి సహాయపడగల్గుతారు అనే వుద్దేశ్యంతో. వారు ఇందుకు యెంతగానో సంతోషించారు. రాన్రాను నా పని పట్ల నాకు ఆసక్తి పెరగసాగింది."

"ఒక రోజు చామంతి నన్ను తనతో పాటు కలుపు తీయడానికి పిల్చుకుపోయింది. ఉత్తరాన వున్న గుట్టల కింద ఉన్న జొన్న చేలల్లో మేమిద్దరం పని చేయసాగాం. అక్కడ మట్టి సిమెంటులాగా ఉంది. నేను పారతో తవ్వబోయినప్పుడల్లా అది టంగ్‌మంటూ ఎగిరపడేది. నేను దానితో లాగడానికి ప్రయత్నిస్తే నేల మీంచి జారిపోయేది తప్ప దిగేది కాదు. కొద్దిసేపటికే నా చేతులు మొద్దుబారిపోయాయి. బాగా నెప్పి పెట్టసాగాయి. నేను నేలను నిశితంగా పరిశీలించాను. అది బీటలువారి ఉంది. అందులో జొన్న మొలకలు వెంట్రుకంత సన్నగా ఉన్నాయి. గాలి గట్టిగా వీస్తే అవి ఎగిరిపోతాయనిపించింది."

"ఇక్కడి మట్టి ఎందుకూ కొరగాదు", అన్నాను చామంతితో. ఎంతగా అనకూడదనుకున్నా అనకుండా వుండలేకపోయాను.

"ఏం కాదు," అని ఖండించింది చామంతి. దాన్ని రుజువు చేయడానికి గాను ఆమె నేలలో ఒక గుంటను తవ్వింది. లోపలి మట్టిని తీసి చూపింది. అది పసుపువచ్చ రంగులో ఎంతో సారవంతంగా ఉంది."

"నువ్వు ఉదయం ఏం తిన్నావు?" అని గద్దించింది.

"జొన్న జావ"

"ఆ జొన్న ఎక్కడి నుంచి వచ్చిందో నీకు తెలుసా?"

"దాన్ని పొలాల్లో పండిస్తారు కదా!"

"సరిగ్గా చెప్పావు. మన బృందంలోని వారందరూ తిండి కోసం ఈ పొలాల మీదే ఆధారపడతారు. మన పశువులకూ, గుర్రాలకూ, పందులకూ, కోళ్లకూ మేత కోసం, దాణా కోసం మనం వీటి మీదే ఆధారపడతాం. ప్రభుత్వం చేపట్టే నిర్మాణ ప్రాజెక్టులకు మద్దతునివ్వడం కోసమూ, పట్టణాల్లో ప్రజలను పోషించడానికీ మనకీ పొలాలే అవసరం. కానీ ఈ పొలాలు ఏమీ యివ్వడానికి సిద్ధంగా లేవు. ఈ మట్టి చెడ్డది కాదు. మనం చాలా ఎరువులు కూడా వేశాం. కానీ లేనిది ఏమిటి తెల్సా?"

"నాకు తెలీదు. లేనిదేమిటో చెప్పు"

"లేనిదల్లా నీరు. పురాతన కాలం నుండి ఈ ప్రాంతాల్లో ప్రజలు వర్షం నీటి మీదే ఆధారపడి పంటలు పండిస్తూ వస్తున్నారు. ఆకాశానికి మా మీద కోపం వచ్చి వర్షాలనివ్వకపోతే, ఆ మొలకలు దాహంతో మాడిపోవడం కళ్లారా చూడ్డం తప్ప ఏం చేయలేకపోయేవాళ్లం. మేం కనీసం ఆ గింజల మందమైనా రాబట్టుకోలేకపోయేవాళ్లం. మరి తిండి, దాణా ఎక్కడ నుంచి తెస్తాం? ప్రభుత్వానికీ, నగరాలకూ ఏం పంపిస్తాం?"

"నేను ఒప్పుకుంటూ తల ఊపాను. పారను భుజాన వేసుకుని, 'మన పని ఐపోయింది. ఇంటికి వెళ్దాం పద!' అంది.

"ఆ రోజు నుంచి నాకు 'నీళ్ల స్పృహ' పెరిగిపోయింది. నేనింక పొద్దస్తమానం నీళ్ల గురించి తప్ప వేరే ఏమీ ఆలోచించేవాడిని కాదు. కలల్లో కూడా జొన్న మొలకలకు నీళ్లు పోస్తున్నట్టుగా ఊహించుకునే వాడిని."

"కొద్ది రోజుల తర్వాత, బ్రిగేడ్ లాంఛనప్రాయంగా నదిని విస్తరించే సమస్యను చేపట్టింది. కార్యకర్తలందరూ సమావేశ మయ్యారు. దానికి మా యువజన సంఘం వారిని కూడా ఆహ్వానించారు. ఒక పథకాన్ని తయారు చేశాక ఆ ప్రాజెక్టును నిర్వహించే కమిటీకి మరో ఇద్దరిని ఎన్నుకోవాలన్నారు. వాళ్లను వెంటనే నీటి పరిరక్షణ విషయంలో జరిగే శిక్షణా తరగతులకు పంపుతారంట. కొత్తగా ఎన్నుకునేవాళ్లు సైద్ధాంతికంగా సరిగా ఆలోచించగలిగేవాళ్లు అయి వుండాలనీ, కొంత చదువు వచ్చినవాళ్లు అయి వుండాలనీ ప్రత్యేకంగా చెప్పారు."

"నేను దీపం దగ్గరే కూచుని వున్నా కూడా నేను వారికి కన్పిస్తానో లేదో అని భయపడ్డాను. నా గుండె వేగంగా కొట్టుకోసాగింది ఉద్వేగంతో."

"అందరికంటే ముందు మాట్లాడినది చామంతి. ఆమె కళ్లు నాకేసే చూస్తుండడంతో నా గుండె జారిపోయింది. ఆమె తల తిప్పి, చాలా గంభీరంగా, 'కామ్రేడ్ యంగ్ షైన్ చాలా గొప్ప పనులు చేయాలనే సంకల్పంతో గ్రామాలకు వచ్చాడు. మన నది ప్రాజెక్టు చాలా గొప్ప పని అని భావించి మన గ్రామంలోకి అడుగు పెట్టడంతోనే దాంట్లో పని చేస్తానని అడిగాడు. అవన్నీ వట్టి మాటలు అని అన్నాను నేను. అతనికి ఆ విమర్శను స్వీకరించడం చాలా కష్టంగా తోచి వుంటుందని నాకు కచ్చితంగా తెల్సు. ఇప్పుడు అతనిక ఏ మాత్రం అలాంటి వూహల్లో తేలడం లేదనుకుంటున్నాను. గతంలో కంటే నేల మీద నుంచుని ఆలోచిస్తున్నాడు. అతన్ని మన నీటి పరిరక్షణ సాంకేతిక నిపుణుడిగా ఎన్నుకుందాం. అతను ఈ పనిని సమర్థవంతంగా చేయగల్గుతాడని నా నమ్మకం."

"ఆమె ఉపన్యాసంలోని ఈ అనుకోని మలుపు నన్ను ఆనందసాగరంలో ముంచెత్తింది. మేమిద్దరం కలిసే వెళ్లాం. ఆ రోజుల్లో ఆమెకు వేగంగా చదవడం, రాయడం వచ్చేవి కావు. ఆమెకు సహాయం చేయాల్సిన బాధ్యత నాకుంది అనుకునేవాడిని. మేం నివేదికల్నీ, పాఠాల్నీ వింటున్నప్పుడు ఆమెకు నోట్సు తీసుకోవడం కష్టంగా ఉండేది. ఒకే సమయంలో రెండూ చేయాలంటే ఆమెకు చెమటలు పట్టేసేవి. ఆమెకు చదువుకోవడానికి నా నోట్సు ఇచ్చాను. ఆమె దాన్ని తిరగేసి బుంగమూతి పెట్టి, 'సాలెగూడులా ఉంది నీ రాత. జనాలెవ్వరికీ అర్థం కాకూడదని కావాలనే ఇలా రాశావు,' అంది."

"ఏం చేయాలి? ఆమెకు ఏ విషయమైనా కంఠతా పట్టడం వచ్చేది కాదు. నోట్సు లేకుండా ఆమె చర్చల్లో ఎలా పాల్గొంటుంది? అందుకని నేను అర్థమయ్యేటట్టు రాయడానికి ప్రయత్నించేవాడిని. కానీ దాంతో నాకు రాయడానికే ఎంత సమయం పట్టేదంటే, పాఠాలను సరిగా వినలేకపోయేవాడిని."

"మూడో రోజు ఈ సమస్యను పరిష్కరించే మార్గం కనిపెట్టాను. ఆ రోజు సాయంత్రం విద్యార్థులందరూ ఒక నాటకం చూడ్డానికి వెళ్లారు. నేను చామంతి నోటుబుక్కు తీసుకుని ఉండిపోయాను. వాళ్లు వెళ్లిపోయాక నేను బల్ల మీద వంగుని ఆమె కోసం నోట్సు కాపీ చేయసాగాను. వాళ్లు పదకొండు గంటలకు ఎప్పుడు తిరిగి వచ్చారో కూడా నేను గమనించలేదు. పడుకునే సమయం కావడంతో నేను హాల్‌లోకి వెళ్లి నా రాతను కొనసాగించాను. తెల్లారగట్ల రెండు గంటల వరకూ రాస్తూనే ఉన్నాను. నేను గొప్పలు చెప్పుకుంటున్నానని అనుకోకండి గానీ ప్రతి ఒక్క అక్షరాన్నీ, ప్రతి పదాన్నీ నేను ఎంతో జాగ్రత్తగా రాశాను. రాత చాలా స్పష్టంగా, పొందిగ్గా ఉండింది. మర్నాడు చామంతికి ఆమె నోట్సు తిరిగి ఇచ్చాను. ఆమె కొన్ని పేజీలు తిప్పి చూసి తల వూపి చిరునవ్వు చిందించింది. ఆమె మెచ్చుకుంది అనడానికి అది చాలు. కానీ అంతటితో ఆగలేదు. 'నాకేం దృష్టి లోపం లేదు. అంతంత పెద్ద అక్షరాలు రాశావెందుకు? కాయితం వృథా చేశావు,' అంది."

"ఆమె విమర్శించినప్పటికీ నాకు చాలా సంతోషం వేసింది. ఎందుకంటే ఆమెకు నేను చేయగల ఏకైక సహాయం నోట్సు రాసి పెట్టడమే."

"ఆ రోజు నుండి ప్రతి రోజూ సాయంత్రం నేను ఆమెకు నోట్సు కాపీ చేసి పెట్టేవాడిని. అలా నెల రోజుల పాటు యెటువంటి ఆటంకం లేకుండా ఈ నోట్సు కాపీ పని కొనసాగింది. ఆ తర్వాత మేం గ్రామానికి తిరిగి వెళ్లాల్సిన తరుణం వచ్చేసింది"

తిరిగి వెళ్లడం విషయానికొస్తే నీకు ఇంకో కథ చెప్పాలి.

"ఈ నెల రోజుల శిక్షణా తరగతుల కాలంలో మేం ఖాళీ సమయంలో ఎంతో బిజీగా ఉండేవాళ్లం. చామంతి ఈ రోజు ఒకళ్లతో మాట్లాడితే, రేపు ఇంకొకళ్లతో జోకులు వేస్తూ కనిపించేది. కొద్దిరోజుల్లోనే ఆమె అందరితో స్నేహం చేసింది. నేనేమో కొంచెం సమయం దొరికితే చాలు పుస్తకాల షాపుకు పరుగెత్తేవాడిని. అందులో కెళ్లానంటే ఇక బైటకు రావడమే మర్చిపోయేవాడిని. అలా ఆమె తన పనుల్లో బిజీగా ఉంటే నేను నా పనుల్లో మునిగిపోయేవాడిని. మేమిద్దరం ఎక్కువ సమయం కలిసి గడిపేవాళ్లం కాదు."

"కానీ ఆమె నా చేతిలో కొత్త పుస్తకం చూసినప్పుడల్లా 'ఎందుకు డబ్బులన్నీ ఆ పుస్తకాల మీద పెడతావు? ఇప్పటికే చదవడానికి బోలెడు పుస్తకాలు లేవూ నీ దగ్గర?' అనేది."

" 'పుస్తకాలు విజ్ఞానపు గనులు. పుస్తకాలు లేకుండా, నేను మంచి సాంకేతిక నిపుణుడిని ఎలా అవుతాను?' అంటూ ఆమె వాదనను తిప్పికొట్టేవాడిని."

'సరేలే, పుస్తకాలు చదివినంత మాత్రాన అవే నీకు నదిని తవ్వడానికి ఉపయోగపడవు!'

"ఆమెతో వాదించి ప్రయోజనం లేదు. అందుకని మౌనంగా ఉండేవాడిని."

"కానీ ఇంటికి వెళ్లేటప్పుడు నేను చాలా ఇబ్బంది పడ్డాను. ఆఖరి బస్టాప్ నుంచి మా గ్రామం ఇరవై 'లీ'ల దూరంలో ఉంటుంది. కనుక మేం కాలినడకన వెళ్లాల్సి వచ్చింది. ఆమెకు పెద్ద బరువులు లేవు కనుక ఆమెకేం యిబ్బంది లేదు. కానీ నాకేమో నా బట్టలకు తోడు పెద్ద పుస్తకాల సంచీ కూడా ఉంది. ఆ బరువుకు నేను చెమటలు కక్కుతుంటే ఆమె దారి పొడవునా నా మీద జోకులు వేస్తూ నవ్వుతూనే

ఉంది."

'నీ ఇకయికలూ పకపకలూ కాస్సేపు ఆపుతావా? నాకు సహాయం చేయొచ్చు కదా?' అరిచాను నేను.

'నువ్వు చాలా బరువులు మోస్తూంటావు. కొన్నింటిని వదిలించుకోకూడదూ?'

'అంటే నేను కొన్ని పుస్తకాలు పారేయాలనా నీ ఉద్దేశ్యం?' అడిగాను.

'నీ బుర్రలో ఉన్న కొన్ని బరువుల్ని వదిలించుకోమని నా ఉద్దేశ్యం.'

'నేను ఆమెకు సమాధానం చెప్పలేదు. మేమెలాగూ ఇంటి దగ్గర కొచ్చేశాం అప్పుడే.'

"మేం మా బ్రిగేడ్ నాయకుడికి మా అధ్యయనం గురించి చెప్పాం. అతను మా కోసం నూతన కర్తవ్యం తయారుగా ఉందని చెప్పాడు. కొత్త నది ప్రవాహగతిని మార్చాల్సి ఉంటుంది. అంతకు ముందు ఉన్న పథకం ప్రకారం కొండకీ, మా పొలాలకీ మధ్యనున్న లోయ గుండా నీళ్లు రాకుండా వుండడానికి గాను నదిని చుట్టు తిప్పి పది 'లీ'ల దూరం తీసుకుపోవాలనుకున్నాం. కానీ శ్రమనూ, ఖర్చునూ తగ్గించడానికి గాను ఇప్పుడు ఆ లోయ గుండానే నదిని నడిపిస్తే మంచిదని ఆలోచించాడాయన. కానీ ఆ పని ఎలా చేయాలనే విషయాన్ని నాకూ, చామంతికీ పూర్తిగా వదిలేశాడాయన."

"ఆ పని మాకు అప్పగించినందుకు సంతోషించాం గానీ అదే సమయంలో మాకు కొంచెం దిగులేసింది కూడా. నేను చామంతితో కొంత డేటా వెతికి పెట్టమనీ ఏదైనా పరిష్కారం సూచించమనీ అడిగాను. కానీ ఆమె అందుకు ఒప్పుకోలేదు. 'పుస్తకాలు చదువుకుంటూ కూర్చుంటే నువ్వు దేన్నీ సాధించలేవు' అంది. మేం వాదించుకోసాగాం. కానీ ఎవరం ఎదుటి వాళ్లు చెప్పేది ఒప్పుకోలేకపోయాం. నేను ఇంజినీరింగ్ పుస్తకాలు, నీటి పరిరక్షణ గురించిన పుస్తకాలు చదువుకుంటూ పోయాను. నేను పగలూ, రాత్రీ గదిలోంచి కనీసం బైటకు కూడా పోకుండా చదివేస్తున్నాను. నాకు తలకాయ తిరగసాగింది. తలనెప్పి వచ్చేసింది. ఆమె మాత్రం ఈ విషయాన్ని చాలా మామూలుగా తీసుకుంది. రెండో రోజు ఆమె సైకిల్ మీద షాన్‌హో కౌంటీకి వెళ్లింది. శిక్షణా తరగతుల కొచ్చిన ఒక సహ విద్యార్థి అక్కడ వుంటున్నాడు."

"మూడు రోజుల తర్వాత ఆమె తిరిగి వచ్చింది. నేనింకా పుస్తకాల్లో మునిగిపోయి ఉండడం చూసి బాగా నవ్వింది. నేను ఆమెను ఏ మాత్రం పట్టించుకోలేదు.

'మీరు చాలా కష్టపడతారండీ పండితులుగారూ – మీరు ఏ ముని నుండో ఉత్తేజం పొంది ఉంటారు!' అని బనాయించింది.

'పొందానో లేదో! నేను నా శాయశక్తులా అయితే ప్రయత్నించాను. నేనేమీ షికార్లు కొట్టి రాలేదు' అని సమాధానము ఇచ్చాను.

'నేను సరదాగా షికార్లు కొట్టడానికి వెళ్లాననుకుంటున్నావా?' అందామె నవ్వుతూ. 'నిజం చెప్పాలంటే, నేను ఆ కౌంటీలో నీటి పరిరక్షణ ప్రాజెక్టును చూడ్డానికి వెళ్లాను. నేను దాని గురించి శిక్షణా తరగతిలో విన్నాను. దాన్ని స్వయంగా చూద్దామని వెళ్లాను.'

'మరి నాకెందుకు చెప్పలేదు?'

'నీతో ఆ పుస్తకాలు పక్కన పెట్టించి నాతోపాటు తీసుకు పోదామనే అనుకున్నాను గానీ బ్రిగేడ్ నాయకుడు నన్ను విమర్శించాడు. నేను ఒక వైపుకు కొట్టుకుపోతున్నాననీ, నువ్వు మరో వైపుకు కొట్టుకుపోతున్నావనీ అన్నాడు. సైద్ధాంతిక జ్ఞానానికీ, ఆచరణకీ సమానమైన ప్రాముఖ్యతనిచ్చి రెంటినీ కలపడమే సరైన పద్ధతి అన్నాడు. ఆయన చెప్పింది సరియైనదనిపించింది. అందుకే వచ్చి నిన్ను నిరాశపర్చదల్చుకోలేదు నేను.'

'అయితే నువ్వు వాళ్ల అనుభవం నుండి నేర్చుకుని వచ్చావనుకోనా నేను?'

'వాళ్లు కూడా అంతకు ముందెప్పుడూ అలాంటి ప్రాజెక్టుల్లో పని చేసినవాళ్లు కారు. అయితే నీటి పరిరక్షణ విషయంలో కొందరు ఆదర్శ నిర్మాతల్ని వారు నాకు పరిచయం చేశారు. వారితో నేను చర్చించాను. వంతెన కట్టవచ్చు అని వారు నాకు సూచించారు.'

"ఆ విషయం నా జ్ఞానాన్ని మెరుగుపర్చింది. అవును, ఒక అక్విడక్టు కడితే పని జరుగుతుంది. మనం ఆ లోయలో ఒక వంతెనను కడితే నీరు ప్రవహించగల్గుతది కదా?

మేం లోయ దగ్గరికి వెళ్లి అక్కడి భౌగోళిక పరిస్థితిని పరిశీలించి అక్విడక్టును ఎలా నిర్మించాలో చర్చించాం.

'మనం ఎటువంటి వంతెనను కడతాం?' అడిగిందామె.

'చెక్క వంతెనను కడదాం' అన్నాను. కానీ మళ్లీ ఆలోచిస్తే చెక్క వంతెన కుదరదు అనిపించింది. ఖర్చు చాలా అవుతుంది, పైపెచ్చు వంతెన కూడా ఎక్కువకాలం నిలవదు. 'మనం రాతితో కట్టాల్సి వుంటుందేమో' అన్నాను.

'కానీ రాతితో కట్టాలంటే ఉక్కు, సిమెంటు అవసరం. మన దగ్గర అవి వున్నాయా?'

దాంతో నేను మళ్లీ ఆలోచనలో పడ్డాను. తిరిగి వచ్చేటప్పుడు చాలా నిస్సహాయంగా అన్పించింది.

హఠాత్తుగా, 'సైద్ధాంతిక జ్ఞానాన్ని ఆచరణతో జోడించాలి' అన్న పదాలు నా చెవుల్లో గింగురుమన్నాయి. చైనా గోడ నిర్మాణం గురించి నేను చదివిన విషయం ఏదో చూచాయిగా గుర్తొచ్చింది. ఆ గోడలో విల్లు ఆకారంలో ఉన్న కంతలన్నీ రాతితోనూ, ఇటుకలతోనూ నిర్మించారనీ, చెక్క ఏ మాత్రం ఉపయోగించలేదనీ రాశారు. అందులోనే ఏదో పురాతన కాలం నాటి పేరుగాంచిన వంతెనను కూడా ఇలాగే నిర్మించారనీ రాశారు.

"దాని గురించి నాకు తెలిసిన ఆ కొంత సమాచారాన్ని చామంతికి చెప్పాను. ఆమె యెంతగానో సంతోషించింది. గోడ గురించి రాసిన ఆ పేజీలన్నీ వెతికి పట్టుకోమని ఆమె నన్ను తొందరపెట్టింది. ఇంటికి పోగానే పుస్తకాల మీదకు లంఘించాను. ఆమె కూడా నాకు సహాయం చేసింది. అర్ధరాత్రికి గానీ ఆ పేజీలు దొరకలేదు. కానీ ఆ వర్ణన ఎంత క్లుప్తంగా ఉండిందంటే మాకు దానివల్ల కొత్తగా ఏ జ్ఞానమూ రాలేదు."

'చైనా గోడ ఇక్కడి నుంచి ఎనభై 'లీ'ల దూరం మాత్రమే. మనం రేపు వెళ్లి చూసొద్దాం' అంది చామంతి.

"మర్నాడు మేం కొంత తిండి మూట గట్టుకుని చైనా గోడలోని హువాంగ్‌యాయ్ కనుమను చూడ్డానికి వెళ్లాం. దాన్ని పరిశీలించి, ఆర్చి స్కెచ్ గీసుకుని గ్రామానికి తిరిగి వచ్చి బ్రిగేడ్ నాయకునికి

మా ఆలోచన్ను చెప్పాం. ఆయనకు ఆ ఆలోచన నచ్చింది. దాన్ని చర్చించడానికి ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. ఆఖరికి, ఆ ఆర్చి సూత్రాన్ని ఉపయోగించి ఒక అక్విడక్టును నిర్మించాలని తీర్మానించారు."

"ఆ తర్వాతి నెలల్లో నేనూ, చామంతీ మా పనిలో ఎంతో వుత్సాహంగా నిమగ్నమైపోయాం. సమిష్టిగా మట్టిని తవ్వేవాళ్లం, ఇబ్బందుల్ని యెదుర్కొనేవాళ్లం. గ్రామస్తులతో కలిసి వాటిని అధిగమించేవాళ్లం. మేం ఒక సమస్యను పరిష్కరించినప్పుడల్లా, మా ప్రాజెక్టు ఎంతో వేగంగా ముందుకు పోయేది. అదే సమయంలో మేం ఒకరికొకరం దగ్గరయ్యాం."

ఆ విధంగా మేం ఒకరినొకరం అర్థం చేసుకుని, ప్రేమించుకున్నాం. తర్వాత పెళ్లి చేసుకున్నాం.

ఇక్కడ ఆ యువకుడు మాట్లాడ్డం ఆపాడు. అతను సుకూన్‌గా వెనక్కి ఆనుకుని ఏవో సంతోషకరమైన జ్ఞాపకాల్లో తేలిపోతున్నట్టుగా ఆకాశం కేసి చూడసాగాడు. నేను కూడా అప్పుడే ఏదో అద్భుతమైన కవిత్వాన్ని ఒక్క వూపులో చదివేసినవాడిలా మౌనంగా ఉండిపోయాను. మేఘాలు లేని ఆకాశంలో నెలవంక. హైహో తన నదీతీరాన కూర్చున్న సంతృప్తిజీవుల్ని చూసి నవ్వుతున్నట్టుంది.

కానీ నాకు తృప్తి కలగలేదు. "నువ్వింకా పూర్తి చేయలేదు. నువ్వు చెప్పినదానికి ప్రేమగాథగా చెలామణీ అయ్యే అర్హత యింకా రాలేదు," అన్నాను నవ్వుతూ.

అతను కూడా నవ్వేశాడు. "నిజానికి ప్రత్యేకంగా చెప్పే ప్రేమగాథ ఏమీ లేదు. ఒక యేడాది కాలం మా ఇద్దరికీ ఒకరి పట్ల ఒకరికి ఆపేక్షతో కూడిన భావాలు ఉండేవి. మా ఇద్దరి మధ్యా ఒక పల్చటి తెర మాత్రం ఉండింది. ఒక్కసారి ప్రయత్నిస్తే ఆ తెర తొలిగిపోయి ఉండేది. కానీ ఇద్దరిలో ఎవరమూ ఆ విషయాన్ని ప్రస్తావించేవాళ్లం కాదు. నువ్వు నమ్ముతావో లేదో గానీ, మా పెళ్లికి కేవలం వారం రోజుల ముందు మాత్రమే మేం మా ఆశల్ని స్పష్టంగా వ్యక్తం చేసుకున్నాం.

"కొత్త నదీపరివాహక ప్రాంతాన్ని తయారు చేశాక, బాగా వర్షం పడి నీటిమట్టం వేగంగా పెరిగింది. ఆ చెక్క వంతెనను ప్రవాహం ముంచెత్తినప్పుడు మా బ్రిగేడ్ సభ్యులందరం దాన్ని కాపాడ్డానికి వెళ్లాం. పగలూ, రాత్రీ ఆ తుఫానులో వంతెనను కాపాడ్డానికి కృషి చేశాం. ఆ సమయమంతా చామంతీ, నేనూ కలిసే పని చేశాం. కానీ అప్పుడు నేను వంతెన గురించి తప్ప మరి దేని గురించీ ఆలోచించలేదు. మా చేతుల్తో స్వయంగా నిర్మించాం దాన్ని. అది కూలిపోతే నది అవతల ఉన్న ప్రాంతానికి ఎలా వెళ్తాం, పంటల్ని ఎలా పండిస్తాం? తెల్లారేసరికి ఆఖరి గుంజ పాతేది ఉండింది. సరిగ్గా అప్పుడు నేను కాలు జారిపడ్డాను. కాలుకు దెబ్బ తాకింది."

"ఆ తర్వాత చాలా రోజులు నేను కాలును బాగు చేసుకుంటూ ఇంట్లోనే ఉండిపోయాను. అప్పుడు చామంతి రోజులో చాలాసార్లు నన్ను చూడ్డానికి వచ్చేది. నా గాయానికి కట్లు కట్టేది. నాకు వండి పెట్టేది. బ్రిగేడ్ వార్తలన్నీ చెప్పేది."

"నాకు కొంత బాగైనాక, ఒక రోజు సాయంత్రం వచ్చి నన్ను వెంటనే లేచి నుంచోమన్నది. నేను బుద్ధిగా నుంచున్నాను. ఆమె నా పక్కబట్టలు మడతపెట్టసాగింది.

'ఏం చేస్తున్నావు?' అడిగాను.

'నీకీ కుటుంబంతో ఏం సంబంధం ఉందని, ఇంకా యెంతకాలం ఇక్కడే వుంటావు? మా ఇంటికొచ్చేయ్,' అంది.

'నాకు ఎక్కడైనా ఒకటే. కానీ నాకూ మీ కుటుంబానికీ ఏం సంబంధం వుందని నేను మీ ఇంటికి రావాలంట?'

'ఊ, అమ్మకు నిన్ను తన అల్లుడిని చేసుకోవాలనుందట. ముసలితనంలో ఆమెను నువ్వు చూసుకుంటావని అట.'

"ఆ విధంగా మా మధ్య సంబంధాన్ని స్పష్టం చేసుకున్నాం."

"కానీ ఆమె యింటికి వెళ్లాక ఆమె మళ్లీ ఆ మాట ఎత్తితే ఒట్టు."

"నా కాలు బాగైన కొద్ది రోజులకు మా అమ్మ నాకు ఉత్తరం రాసింది. టియన్‌ట్సిన్‌కు వచ్చేసి పెళ్లి చేసుకోమని రాసింది. నాకు చిన్నప్పటి నుంచి తెలిసిన బంధువుల అమ్మాయిని అమ్మ సంబంధం చూసింది. వాళ్లది సియావో-చాన్ ప్రాంతం. మా అత్త ఆ సంబంధం తెచ్చింది. నేను సరే అంటే ఇక చేసేద్దామని నిశ్చయించుకున్నారు."

"నేను ఆ వుత్తరాన్ని ఉన్నదున్నట్టుగా చామంతికి చదివి వినిపించాను. నేను పూర్తి చేయగానే ఆ వుత్తరంలో విషయాల్ని ఏ మాత్రం విననట్టే 'బ్రిగేడ్ నాయకుడు ఏమంటున్నాడంటే మనం కేవలం భూమిని సాగులోకి తేవడంతో తృప్తి పడి ఊరుకోకూడదు. మనకిప్పుడు నీరు ఉంది కదా. అందుకని మనం ప్రయత్నించి వరి పండించాలి. అది మేలు రకం ధాన్యం, దిగుబడీ ఎక్కువ వుంటుంది. సియావో-చాన్ ప్రాంతం వరికి పేరు పొందింది. మనం వచ్చే సంవత్సరం మొదలుపెట్టవచ్చు,' అంది. మా అమ్మ వుత్తరంలో రాసిన విషయం ఆమెకేమాత్రం అర్థం కాలేదనుకోవాలా?"

'వరిని పండించడం బాగానే వుంటుంది, కానీ పెళ్లి విషయం ఏంటి?' అడిగాను ఆతృతగా.

'అదేం ఫర్వాలేదు. నిజానికి, నువ్వు అలా చేసుకుంటే సమిష్టి ప్రయోజనాలూ, వ్యక్తిగత ప్రయోజనాలూ కూడా నెరవేరుతాయి. పెద్దవాళ్ల కోరికా తీరుతుంది. అలాగే వరిని ఎలా పండించాలో నేర్చుకోవాల్సిన అవసరమూ తీరుతుంది.'

"ఆమె వ్యాఖ్యానంతో నా మీద చల్లనీళ్లు గుమ్మరించినట్టయ్యింది. నేనింతకాలం కేవలం ఊహించుకుంటూ వున్నానా? నాకు చాలా బాధనిపించింది. ఆ విషయం మాట్లాడేద్దాం అనుకునేలోగా వాళ్ల అమ్మ అప్పుడే ఆడించిన పిండి తీసుకుని గదిలోకి వచ్చింది."

"తిన్నాక ఇక నేను ఏ మాత్రం ఆగలేకపోయాను. ఆమెను వసారాలోకి పిలిచి గద్దించాను, 'చామంతీ, మాట్లాడు!'

'దేని గురించి?'

'పెళ్లి గురించి'

'ఈ విషయంలో నేనేమనుకుంటున్నానో నీకు గతంలోనే నిజాయితీగా చెప్పాను కదా? నీకు అంత ఆతృతగా వుంటే రేపే వెళ్దాం. సరేనా?'

"అదండీ విషయం. అలా జరిగిపోయింది."

అతను చెప్పడం ముగించేవరకు నాకు నవ్వాగలేదు. వాళ్ల ప్రేమగాథ అదన్నమాట. సమిష్టి, సోషలిస్టు ప్రయోజనాలతో మిళితమైన ప్రేమ. ప్రేమ భావాలకు సంబంధించి అతని కథలో నాకేం సమాచారం అందకపోయినప్పటికీ, కేవలం ప్రేమకు

సంబంధించిన సంఘటనల్ని విడదీసి చెప్పడానికి అతనికి ఏమీ దొరకవు అని నాకు తెలుసు.

'యంగ్ పైన్' కూడా మనస్ఫూర్తిగా నవ్వుతున్నాడు. "ఈ కోడల్ని తెచ్చినందుకు మా అమ్మ సంతోషం పట్టలేకపోయింది. సియావోచాన్‌లో మా అత్త మమ్మల్ని ఎంతో ఆదరంగా ఆహ్వానించింది. మమ్మల్ని వారం రోజులు ఉంచేసుకున్నది. మేం సియావోచాన్‌లోని నిపుణులైన వరి రైతుల్ని కలిసి వారు చెప్పినవన్నీ పూర్తిగా నోట్సు రాసుకున్నాం. మేం నిన్ననే తిరిగి వచ్చాం."

"మీరు మీ హనీమూన్‌ని అద్భుతంగా గడుపుతున్నారనిపిస్తుంది."

"ఓహో! మర్చేపోయాను," అంటూ 'యంగ్ పైన్' హఠాత్తుగా బెంచీ మీద నుండి లేచి నెత్తి మీద తన పెద్ద చేతితో కొట్టుకోసాగాడు. "నేనిక్కడకు చామంతిని వెతుక్కుంటూ వచ్చాను. ఒక్క నిమిషం నేనేమెను వెంటనే కనుక్కోవాలి."

నేను కలవరపడ్డాను. "చామంతిని ఇక్కడిదాకా వంటరిగా ఎలా రమ్మన్నావు?" అని అడిగాను.

"మా అమ్మకు మమ్మల్ని చూస్తుంటే ఎంత గర్వంగా ఉంటుందో! అందుకని ఆమె మా నాన్న స్నేహితులందరి దగ్గరకీ మమ్మల్ని తీసుకెళ్లి చూపిస్తోంది. ఊరికే ప్రదర్శించడం అన్నమాట. కానీ మేం వాళ్లనూ, వీళ్లనూ కలవడానికి అంత సమయం వెచ్చించలేం. అంతేకాక అదంతా యెంతో ఇబ్బందికరంగా వుంటుంది. అందుకని మేం ఒక మార్గం కనిపెట్టాం. తిన్నాక చామంతి ఎవర్నో కలవడానికని చెప్పి బయటపడింది. కొంత సేపయ్యాక చామంతికి ఇక్కడ దారులు తెలీవనీ, వెనక్కి రావడం ఇబ్బంది అవుతుందేమో అనీ అమ్మతో అన్నాను. దాంతో అమ్మ నన్ను వెంటనే వెళ్లి చామంతిని తీసుకురమ్మంది. నేనా అవకాశాన్ని తీసుకుని వెంటనే బయట పడ్డాను," అన్నాడు చిలిపిగా నవ్వుతూ.

తర్వాత, హఠాత్తుగా అతను నా భుజం పట్టుకుని గంభీరంగా, "లియాంగ్, నీకు ఒక విషయం చెప్పడం మరిచాను. మా పాన్‌షాన్ ఎప్పటినుంచో రకరకాల పండ్లకు ప్రసిద్ధి గాంచింది. విముక్తి తర్వాత ఎన్నో కొత్తపండ్ల చెట్లను నాటారు. అవిప్పుడు కాపుకొచ్చాయి. ప్రతి సంవత్సరం ఎన్నో టన్నుల పండ్లను పట్టణాలకూ, నగరాలకూ పంపించాల్సి ఉంటుంది మేం. మేం ఈ మధ్యే ఇనుము, టంగ్‌స్టన్ గనుల్ని కూడా తెరిచాం. ఈ ఉత్పత్తులన్నింటినీ అంటే ఖనిజాల్నీ, యింటికి అవసరమైన సామాన్లనీ, ధాన్యాన్నీ ట్రక్కులలోనో, ఎడ్లబండ్లలోనో, గాడిదల మీదనో లేక కావిళ్లతో మనుషులో మోయాల్సి వస్తోంది. గతంలోకంటే మా దగ్గర బండ్లూ, ట్రక్కుల సంఖ్య పెరగింది. కానీ పెరుగుతున్న ఉత్పత్తితో పోలిస్తే అవి సరిపోవడం లేదు. రవాణా పెద్ద సమస్యగా ఉంటోంది. పరిష్కరించడానికి చాలా కష్టంగా ఉన్న వైరుధ్యం ఇది."

నదికేసి చూపిస్తూ అతను కొనసాగించాడు. "అక్కడున్న ఆ పడవలు చూశారా? నిన్న నేనూ, చామంతీ ఇటువైపుగా వచ్చాం. ఇక్కడ ఈ పడవల్ని చూడగానే నీటి మీద రవాణా సాధ్యాసాధ్యాల గురించి ఆలోచించాం. మేం వెళ్లగానే ఈ కొత్త రవాణా పద్ధతిని ప్రవేశపెట్టమని నాయకత్వానికి సూచించాలనుకున్నాం."

ఆ ఆలోచన చాలా బాగుంటుందనిపించింది నాకు. "అయితే మీరు కొండల్లో పడవలు నడుపుతుంటారన్నమాట?" అని అడిగాను.

అతను అపార్థం చేసుకున్నాడు. పిడికిళ్లు ఊపుతూ, పట్టుదలగా, "ఎందుకు నడపకూడదు? కొండకు అవతలనున్న నదిని మళ్లించడంలో మేం విజయవంతమయ్యాం. అది యిప్పుడు మా పొలాలకు నీరందిస్తోంది. మేం ఇంకా సాధించగలం! మా కెనాల్ ఈ నది అంత విశాలంగా లేదు. కానీ అదేం ఫర్వాలేదు. పెద్ద పడవలు ఉపయోగించలేకపోతే చిన్నవి ఉపయోగిస్తాం. మేం పడవలు నడపడం కూడా నేర్చుకుంటాం. మేం త్వరలో కొందరు పల్లెకారులను కలిసి వాళ్లను మాకు నేర్పమంటాం. వాళ్లు మమ్మల్ని పడవలో ఎక్కించుకుని కొన్నిసార్లు తిరగడానికి అంగీకరిస్తే మరీ మంచిది. కానీ నేను ఇప్పుడు వెంటనే వెళ్లి చామంతిని వెతకాలి. మా కోసం ఇక్కడే ఎదురుచూడు. మనం కలిసి కొన్ని కబుర్లు చెప్పుకుందాం."

ఈ మాటలంటూ అతను పరుగెత్తాడు. వేగంగా దూరమౌతున్న అతని రూపాన్ని ఆ మసక వెన్నెల్లో చూస్తూ వుండిపోయాను. అతని రూపం కనుమరుగయ్యాక, "చామంతీ, ఎక్కడున్నావు?" అని అతను పిలవడం వినిపించింది.

కొద్ది క్షణాల్లో సమాధానం వచ్చింది. "నేనిక్కడ వున్నాను 'యంగ్ పైన్' వెంటనే రా!" అని. తీరం వద్దనున్న ఒక పడవలోంచి ఆమె పిలుస్తోంది.

నేను వెంటనే లేచి ఆ వైపుగా నడిచాను. నేను ఎంతో పులకించిపోయాను. గొంతెత్తి పాడాలనిపించింది.

హైహో నది మీద వేసవికాలంలో ఒక రాత్రిని గడపడం చాలా బాగుంటుంది. ఈ యువజంట ఆ అందాన్ని సజీవం చేశారు.

*టియన్‌ట్సిన్, ఆగస్టు 6, 1961.*

ఆంగ్లం నుండి అనువాదం : షహీదా



కథ

# మా తుఝే సలామ్

- ఆర్. శశికళ

స్కూల్లు తెరిచారు. వేసవి తాపం తగ్గింది. నా డ్యూటీ మొదలయింది. అడ్మిషన్ల వ్యవహారం చూస్తున్నాను. ఆఫీసు రూంలో కూర్చుని ఉన్నా... కొంత విరామం దొరికింది.... అనుకుంటున్నా ఇంతలోనే ఓ బుజ్జిగాన్ని చేత్తో పట్టుకుని నడిపించుకొంటూ ఓ అందమైన యువతి లోపలికి వచ్చింది.

నిమ్మపండు రంగు చీర, మ్యాచింగ్ జాకెట్, బొట్టుబిళ్ళ, కళ్ళకు కాటుక మెరుస్తోంది. చెవుల్లో పెద్ద రింగులు - తన పొడవాటి జడకు వేలాడుతూ పువ్వుల దండ ఊగుతోంది.

ఆమెను ఎక్కడో చూశా. కానీ గుర్తు రాలేదు. ఆ గుండ్రని ముఖం మణికట్టుపై పెద్ద గాటులాంటి మచ్చ గాజుల కుదుపులో కన్పడుతోంది.

'నమస్తే మేడమ్మా' అంది. ప్రతి నమస్కారం 'చేస్తూ కూర్చోమ్మా' అన్నా - బెరుకుగా అలానే నిలబడింది. 'ఫర్వాలేదు కూర్చోండి బాబును ఆ బెంచిపై కూర్చోబెట్టు' అన్నాను. 'ఈ స్కూల్‌లోనే తెలుగు మీడియం ఉందంట. నా పెద్ద కూతురు లక్ష్మి చెప్పింది' ఆ స్కూల్లోనే ఏత్తామనుకుంటే మా కూతురే వద్దనింది. ఆడ బాగా చెప్పరంట - అంది గబగబా. ఫీజులు అన్ని వివరాలు అడిగింది. 'నేను ఫీజులు అన్నీ కట్టుకుంటా కానీ ఆలస్యమయినా తట్టుకోవాలా రామును అడగొద్దు' ఈ సాయం చేయమ్మ సాలు. మా రాము పెద్ద పెద్ద సదువులు సదవాల మేడమ్మా మీలాగే' అంది.

'సరా నేను కొన్ని రోజులే తెలుగు మీడియం స్కూలును చూస్తా, తర్వాత హెడ్‌మాస్టరు చేరతాడు ఆయనకు చెప్తాలే' అన్నాను.

'అప్లికేషన్ పూర్తి చేసిస్తావా' అడిగాను ఆమె ముందుకు పెట్టా. 'నాకాడ సదువాత్తాదమ్మ, వేలిముద్ర యాడపెట్టమంటా ఆడపెట్తా' మీరే సేసియ్యండి.

పేరు - రాము తండ్రి పేరు అడిగాను.

తరగతి 1వ తరగతి కులం..... సంవత్సరం ఆదాయం, చిరునామా తండ్రిపేరు చెప్పకుండా ఎటో చూస్తోంది.

'నా పేరు రాసుకోమ్మా' నేనాగదా సదివించేది అంది. అయినా తండ్రి పేరు రాయలమ్మా. 'పేరు లేదు, గీరు లేదు నా పేరే రాసుకోండి' అంది కొంత అసహనంగా - అంటూ - మిమ్మల్ని వదిలేశాడా? ఆ కోపంతో చెప్పటం లేదనుకున్నా. ఆమెను చూస్తే భర్త చనిపోలా, మరయితే?

'ఒకవేళ చనిపోయింటే కూడా పేరు రాయాలమ్మా... 10వ తరగతి సర్టిఫికేట్ వచ్చేవరకూ తండ్రి పేరే ఉంటుంది మరే' కొంత వివరంగా చెప్పా. మొదటి భర్త చనిపోతే మళ్ళీ పెళ్ళి చేసుకొని ఉండొచ్చు గదా. నా అనుమానం.

'లేదమ్మా లేదని చెప్తాంటా' - అంది రెట్టించిన కోపంతో నా పేరే రాసుకొండి - 'కమలమ్మా' - గట్టిగా గదిమినట్టు అంది. తర్వాత చూడచ్చులే ఈ వ్యవహారం అనుకోని మనసులోనే పూర్తి చేసిన అప్లికేషన్ పై వేలిముద్ర వేయించాను. స్కూల్ వెనుకల ఉండే గుడిసెల్లోనే ఆమె నివాసం... అది మిషన్ కాంపౌండ్ - ఎన్నో ఏళ్ళుగా పేదలు గుడిసెలు వేసుకొని ఉన్నారు. 'రామును పిలుచుకొని వెళ్తూ, మేడమ్‌కు నమస్తే చెప్పు అంది. 'అబ్బ ఈమె కోపం తగ్గింది అనుకొని రాము బుగ్గలు లాగి బాగా సదువుకోవాల' చెప్పా.

ఆ రోజు వ్యవహారాలు ముగించి ఇంటికి చేరే సరికి బాగా ఆలస్యమయింది. ఇంట్లో పని హడావుడి ముగించి నిద్రకుపక్రమించా, అయినా కమలమ్మ ముఖం నన్ను వెంటాడుతూనే ఉంది. అప్పుడు తళుక్కున మెరిసింది ఆ తార ఎవరో - ఇంక నిర్ధారణ చేసుకోవాలి ఆ చిలి మణికట్టుపై గాయం గుర్తు - నాకిప్పటికీ గుర్తే... నేనపుడు 10వ తరగతి పరీక్షలకు తయారవుతున్నా. ఇంక పదిహేను రోజులే. ఆ రోజు రాత్రి 12 గంటలవుతోంది. గోడ గడియారం నా నిద్రమత్తు వదలగొట్టింది. అప్పటికింకా మిషన్ కుట్టూనే ఉంది అమ్మ... 'ఇంక పడుకో తెల్లారి లేపుతాలే' అంది దుప్పటి పైకిలాక్కున్నాను...

ఇంతలో బయట పెద్దగా కేకలు. ఎవరిదో ఆర్తనాదం... ఏడుపు. చుట్టుపక్కల ఇంట్లో వాళ్ళు తలుపులు తీసి బయటకొచ్చారు. అమ్మా నాన్న బయటికి పోయి ఆ గుంపులో ఏం జరుగుతుందో తొంగి చూస్తున్నారు. ఆసక్తితో బయటికి నడిచా...

అక్కడ పదమూడేళ్ల అమ్మాయి పడిపోయింది మణికట్టు దగ్గర పెద్ద లోతయిన గాయం, రక్తం కారుతోంది. వళ్ళంతా దెబ్బలే - చేతులు గీరుకుపోయి ఉన్నాయి. జనం పోగయ్యేసరికి ఆమెను తరుముకొస్తున్న వారు ఎవరో పారిపోయారు. తిట్లు తిట్టే వాళ్ళు - ఎవరికి తోచింది వాళ్ళు మాట్లాడుతూనే ఉన్నారు. ఆ పిల్లను ఎవరూ తాకలేదు. మా ఇంటి బయట రెండు పెద్ద అరుగులున్నాయి. మా అమ్మ నాన్నలు ఆ పిల్లను తీసికొని అక్కడికి వచ్చారు. ఇంట్లోకి పోయి సైబాల్ పసుపు పట్టుకొని రమ్మంది అమ్మ. క్షణంలో అక్కడున్నా - గాయాలు తుడిచి కట్టు కట్టారు. ఆ పిల్ల భయంతో మాటి మాటికి రోడ్డువైపే చూస్తోంది. ఏడుస్తూనే ఉంది, మోచేతులు చూసుకొని ఊదుకొంటోంది.

'ఇంక భయం లేదులే పాపా! ఎవ్వరూ రారు. మేమంతా ఉన్లా' అన్నాడు నాన్న - 'మీ ఇల్లు ఎక్కడో చెప్పు' మేము వదిలి పెట్టి వస్తాం...' అంది అమ్మ. ఎదురింటి అనంతమ్మా ఓదార్చింది... ఇంతలో గుంపంతా జారుకొన్నారు. 'ఇంట్లోకి తీస్కపోండి' బయటుంటే కష్టం - 'ఆ లబ్డీనా కొడుకులు మల్లొస్తే' అనంతమ్మ సందేహం... ఆ పిల్లను ఇంట్లోకి పిలుచుకొచ్చారు. నన్ను అక్కా అంటోంది ఆ పిల్ల. వారం రోజులు సపర్యల తర్వాత వివరాలన్నీ కనుక్కొన్నాం. వాళ్ళ మామని ఎవరో ఒకతను వచ్చాడు. అనంతమ్మ అతన్ని విచారించింది. 'లచ్చిందేవి, పంపించింది మీరు మాత్రం ఎన్ని

రోజులు చూస్తారు మీకు ఇద్దరు ఆడపిల్లలున్నారు అంది. అమ్మతో.... అమ్మ తలూపింది.

తర్వాత రాము గురించో, ఫీజు కట్టాలనో వచ్చినపుడు నన్ను మాట్లాడించేది. అప్పటి ఆ పిల్లే... ఈ కమలమ్మ ఇన్ని సంవత్సరాల తర్వాత ఇలా... గుర్తు చేశాను... చాలా సంతోషించింది.

తర్వాత పెద్ద బిడ్డ పెళ్ళికి పిలవాలని వచ్చింది. పదారేళ్ళకే పెళ్ళి - 'బాగా చదువుతుంది కదా! అప్పుడేం తొందర' అడిగాను 'ఎదిగిన పిల్లను ఇంట్లో పెట్టుకోలేనమ్మ -' ఇప్పటికే ఎక్కువ. ఒంటరిదాన్ని ఎవరు చూస్తారు? నాకు కుంటా తినిపోతారు. బంధువులా పాడా' తిట్టిపోసింది. చెరువు కట్టపైనే పెళ్ళి తప్పక రావాలమ్మ-' వెళ్ళిపోయింది.

తర్వాత రెండు, మూడేళ్ళు గడిచిపోయాయి. నేను ఇంగ్లిష్ మీడియం బాధ్యతల్లో ఉన్నా - తెలుగు మీడియం హెడ్మాస్టర్ చేరారు. అందుకని అక్కడి పిల్లల గురించి పెద్దగా పట్టించుకోలేదు. 6వ తరగతిలో అడ్మిషన్ చేసేందుకు రాము వాళ్ళమ్మను పిలిపించాడు హెడ్మాస్టర్... నాలాంటి అనుభవం ఆయనకు ఎదురయింది... అప్పుడు రాము అమ్మాయి అని తెల్సింది... పేరు - 'రామాంజినమ్మా... 'అంజని' అని మారుస్తాం బాగుంటుంది అడిగాను. రాము - అంజని అయింది. రాము పేరే అలవాటు. కొత్తగా ఉంది. తరగతులు మారుతున్నాయి. అంజని ఎన్నో బహుమతులు అందుకుంది. క్లాసులో ఆ పిల్లా మొదటి ర్యాంకు - వాళ్ళమ్మ వచ్చినప్పుడు తప్పక నన్ను కలిసే వెళ్ళేది.

రాము 8వ తరగతిలో కొచ్చింది - కానీ నిక్కరు చొక్కాలోనే వచ్చేది. 'ఎందుకు అలా డ్రస్‌లు కొనివ్వమ్మా' చెప్పా 'ఈ విషయంలో నన్నేమీ బలవంతం చేయద్దమ్మా' - ఇంకా రెండేళ్ళు తర్వాత ఎక్కడో చేరుస్తా - అప్పుడు తప్పదు కదా! అంది. ఆమె వేదన నాకర్థమయింది. బాలల దినోత్సవం నాడు రాము తప్పకుండా నెహ్రూ గురించి మాట్లాడుతుంది, అన్ని పోటీల్లో పాల్గొంటుంది - టీచర్లంతా ఆ అమ్మాయిని అభిమానిస్తారు.... 'నా బిడ్డ బాగా సదువుతాంది, ఎంత సదివితే అంతా సదివిత్తా' అంది ఒక రోజు మెరిసే కళ్ళతో - 10వ తరగతి రిజల్ట్ వచ్చింది - అంజని డిస్టింక్షన్‌లో పాసయింది - కమలమ్మ స్వీట్లు తీసుకొని వచ్చింది - 'ఇన్నాళ్ళు నా బిడ్డను అంతా కడుపులో పెట్టుకుండారు. ఇంకెట్లా చేయాలో డాక్టరు సదువుతాదంట...' అంత శక్తి నాకేదుందమ్మ...' అంజని తల్లి పక్కనే నిలబడింది ఎప్పట్లాగా క్రాపు, షర్ట్, పాంటు - గొప్ప తేజస్సుతో వెలిగిపోతోంది. టీచర్లందరం అభినందించి బహుమతులిచ్చాం - 'ఎప్పుడే అవసరం ఉన్నా తప్పదు కదా', మెడిసిన్ చాలా చాలా కాలం పడ్తుంది. అమ్మ పరిస్థితి ఆలోచించు అన్నా... తర్వాత శెలవు తీసుకొన్నారు... విజయవాడ గీతాంజలిలో ఫీజులు లేకుండా చేర్చుకున్నారని తెల్సింది. అంజని ఇంటర్ మొదటి సంవత్సరం పరీక్షలు రాసింది. అక్కడా మంచి మార్కులతో పాసయిందట. వాళ్ళమ్మ వచ్చి సంతోషం పంచుకొని పోయింది.

'ఇప్పుడూ పాంటు, షర్టేనా అడిగింది' పద్మావతి టీచర్.

'లేదు మేడమ్ ఇప్పుడన్నీ డ్రస్సులే - ఇప్పుడెంత బాగుందో నా బిడ్డ' కమ్మలమ్మ.

'శెలవులిస్తే రమ్మను స్కూలు మరిచిపోతే ఎట్లా అన్నాను. లేదమ్మా - మిమ్మలందరిని తల్చుకుంటూనే ఉంటాం' అంది కమలమ్మ.

* * *

కాలేజీలు తెరిచారు. అంజని ఇంటర్ రెండో సంవత్సరంలోకి అడుగు పెట్టిందట... తర్వాత కమలమ్మ రావటం బాగా తగ్గిపోయింది.

ఆ రోజు ఆదివారం కావటంతో టీ తాగుతూ, పేపర్లు తిరగేస్తున్నా.. 'జీసస్‌నగర్‌లో ఓ మహిళ దారుణ హత్య' వార్త - ఆమె ఇంట్లో దోపిడి జరిగిందని, గుర్తు తెలియని వ్యక్తులెవరో చంపారని' - రాశారు ఎక్కువ వివరాలు లేవు - ఫోటో ఉంది మృతురాలి ముఖం స్పష్టంగా లేదు. రక్తపు మడుగులో పడి ఉంది.

పేపర్లు మడిచి పక్కన పడేశాను. సోమవారం స్కూలుకు వెళ్ళా. ఇంకా గేటుదాటి లోపలికి వెళ్ళలేదు. ఇంతలోనే విజయ టీచర్ దగ్గరగా వచ్చింది - 'మేడమ్ మీరు వార్త పేపర్ చదివారా నిన్న - అడిగింది.

లేదు మేము ఈనాడు తెప్పిస్తాం అన్నాను.

'అంజని వాళ్ళమ్మను ఎవరో దారుణంగా చంపేశారంట మేడమ్' అంది ఆమె - వారం క్రితమే క్లాసులు మొదలయ్యాయంట - వాళ్ళ అక్క తల్లి దగ్గరే ఉంది, బావ ఆ పిల్లను పిల్చుకు రావడానికే వెళ్ళారట' అంది. కమలమ్మ - అందమైన ముఖం నా మనసులో మెదిలింది... 'ఎందుకింత దుర్మార్గం. ఆమె ఇళ్ళలో పని చేసుకొని బతికేది. ఆమె మీద ఎవరికింత శత్రుత్వం' అన్నాను అప్రయత్నంగా. 'మీకు తెలీదా మేడమ్, ఆమె గురించి, అందరికీ తెల్సు. ఆమెకు గుండాలతో లింకులున్నాయి అందొక టీచర్ - 'నీకెలా తెల్సు అడిగా.

'వేరే పేరెంట్స్ మాట్లాడుకుంటుంటే విన్నాను' అంది.

ఆ రోజు పని మీద దృష్టి పెట్టలేకపోయాం 'ప్రేయర్‌లో ఆమె ఆత్మశాంతి కోసం మౌనం పాటించాం' తర్వాత ఎవరి క్లాసులకు వాళ్ళు వెళ్ళి పోయాం.

ఆఫీస్ రూంలో ఒంటరిగా ఉన్నా - టీ తెప్పించుకొని తాగాను. తల వేడెక్కి పోతోంది.. ఏమిటీ ఘోరం... కమలమ్మ, అంజనీలు కనపడుతున్నారు.. చివరిసారిగా నాతో కలిసి చెప్పిన మాటలు నా చెవుల్లో గింగురుమంటున్నాయి.

'ఆ రోజు కాస్త తీవ్రంగానే కోప్పడ్డాను...' ఎప్పుడు పేరెంట్స్ మీటింగ్ పెట్టినా రావెందుకు? మీ అమ్మాయి బాధపడదా? కమలమ్మ 'అమ్మా నా బిడ్డ గురించి అడిగేందుకేం ఉంది అంతా మీరేసూత్తున్నారు నేనొత్తే మీ మాదిరి అంతా గౌరవిత్తారా? ఏ తెల్సక నాబట్టో నా బిడ్డను ఏడిపిత్తే, అవమానిస్తే' అంది.

'తప్పుదు నాయాళ్ళు రాత్రిళ్ళు తప్పతాగి నా ఇంటికొత్తారు' వాళ్ళలో ఎవడన్నా ఏదన్నా వాగితే నా బిడ్డలకు కష్టం కదా?' అంది. 'ఇంతవరకూ అది బిడ్డ అని తెలియనీయలేదు ఎవరికీ' స్కూలుకి షర్టు నిక్కరు, పాంటూ, షర్టులో పంపాను'.

'అప్పుడప్పుడూ అందరిలా గౌన్లు, రంగురంగుల డ్రస్‌లు వేసుకోవాలని, ఏడ్చి ఏడ్చి గోల గోల చేసేది-' నేనూ మొండిగా తిట్టే దాన్ని - సదువు మాన్పిత్తా అంటే చాలు గోలంతా కట్టి పెట్టేది... ఏం చేసేదమ్మా - ఇంతకంటే ఆమె ముఖంలో ఆవేదన స్పష్టంగా కన్పడుతోంది. అది బిడ్డ అనే విషయం తప్పుదు నా కొడుకులకు

# ఎన్నికలు ఎళ్లిపోయాక... ఎన్నెల ఎలిసిపోయ్యాక

- బమ్మిడి జగదీశ్వరరావు

## ఐక్యూ

'హైదరాబాద్‌ని ఎవరు నిర్మించారు?'

'చంద్రబాబు!'

'భాగ్యనగరం ప్రేమకథ ఎవరిది?'

'చంద్రబాబుది!'

'చార్మినార్ కట్టించిందెవరు?

'చంద్రబాబు!'

'సరే, తెలంగాణ సాయుధ పోరాట వీరుడి పేరొకటి చెప్పు?'

'కేసీఆర్!'

'నా తెలంగాణ కోటి రతనాల వీణ అని అన్నదెవరు?'

'కేసీఆర్!'

'హైదరాబాద్‌ని పాలించిన నైజాం నవాబెవరు?'

'కేసీఆర్'

మాష్టారి ప్రశ్నలకు మావాడి జవాబులివి. నేను ఆశ్చర్యపోయినా మాష్టారు ఆశ్చర్యపోలేదు!? పైగా పిల్లలందరూ ఈ మధ్య ఇలాంటి సమాధానాలే చెపుతున్నారని చాలా కూల్‌గా కూడా చెప్పారు. అయితే 'నన్నేం చెయ్యమంటారు?' అని ఆందోళనగా చూసాను.

'మీ టీవి కనెక్షన్ పీకించెయ్యండి చాలు' ప్రమాదమేమీ లేదన్నట్టు చూసారు మాష్టారు!

'?'

## నీటి ఏనుగులు

'నాన్నా... నాన్నా... మనిషి కోతి నుండి పుట్టలేదు' అన్నాడు మా వాడు. ఆ మాట వింటూనే 'మనిషి కోతి నుండి పుట్టకపోతే దేన్నుండి పుట్టాడురా?' మా ఆవిడ ఆసక్తిగా కాక ఆందోళనగా అడిగింది.

'మనిషి నీటి ఏనుగు... హిప్పో పోటమస్ నుండి పుట్టాడు' అని ఆలోచనగానే అన్నాడు. ఆకతాయిగా అనలేదు. వాడి సమాధానానికి ఈసారి నేను ఆందోళనపడి 'అదెలా' అన్నట్టు చూసాను.

ఇలా అన్నట్టు టీవి పెట్టాడు. చూసి కాదనలేకపోయాను. మావాడు కనిపెట్టింది నిజం కాకపోయినా అబద్దమూ కాదు!?

... వాళ్ళూ మనుషులే... కాకపోతే దున్నల్లాగ గున్న ఏనుగుల్లాగ ఒళ్ళు చేసి ఉన్నారు. మెడా ఛాతీ పొట్టా అంతా కలిసిపోయి సంచిల్లా కాదు, బస్తాల్లా ఉన్నారు. నీటి ఏనుగుల్లానే నిండుగా ఉన్నారు, కాకపోతే తెల్ల చొక్కాలతో చాలా వరకు కవరు చేసుకున్నారు!

చూసి చూసి మావాడు చెప్పింది నిజమేనని, మనిషి కోతినుండి కాదు, నీటి ఏనుగు నుండి పుట్టాడని అప్పటికి నమ్మేసాం. 'ఎలక్షన్లు మండిపోయిన ఎలక్షన్లు, దొంగల నాటకం ఎంతని చూస్తాం, టీవి ఆపండ్రా' అంది మా అమ్మ అప్పుడే!

## పాత ప్రభుత్వం - కొత్త పాలన

"కేంద్రంలో ఇంకా కాంగ్రెస్ యూపియ్యే ప్రభుత్వమే ఉంది... పరిపాలిస్తోంది..."

"అదేంటి? బీజేపీ ఎన్‌డియ్యే ప్రభుత్వం కదా ఉన్నది?"

"లేదు, కాంగ్రెస్సే పాలిస్తోంది"

"కాదు, బీజేపీ పాలిస్తోంది"

"కాంగ్రెసు పాలిస్తోంది, ఎవరితో చెప్తే నమ్ముతావ్?"

"ఎవరితో చెప్పించినా నమ్ముతాను..."

- అలా ఓ ఇద్దరు వాదులాడుకొని ఒక అంగీకారానికి

---

చెప్పలా - ఆ పక్క గదిలో సంటిబిడ్డప్పటి నుండి రాత్రి ఎనిమిదికే నిద్రమాత్రలు వేసి పాలు తాపించి పడుకోబెట్టేదాన్ని. పెద్ద పిల్లనెట్టా కాపాడిందానో నాకే తెల్సు. మా చిన్నాయిన ఇంటి కంపేదాన్ని అందుకే అంత తొందరగా పెళ్ళి చేసినా', అంది కమలమ్మ... తండ్రి గురించి అడిగినపుడు ఆమె ఎట్లా స్పందించిందో గుర్తొచ్చింది.

ఆ తల్లి ఎంత వేదన అనుభవిస్తుందో మాటల్లో పెట్టటం కష్టం...

'పిల్లల గౌరవం కోసం పగలు నాల్గిండ్లల్లో పని చేసేదాన్ని మేడమ్. నా బతుకెట్టా కాలిపోయింది. మా రాముా బాగా సదవాలి - సల్లగుండాలి - ఈ నా బతుకు శత్రువుకు కూడా వద్దు...' ఆమె ఏడుస్తోంది...' ఆవేదన అంతా బయటకొస్తోంది. ఇంతలో, ఎవరో అటు రావడంలో కళ్ళు తుడుచుకొని లేచింది. నమస్కారం చేసి వెళ్ళిపోయింది. నేనలా మాన్పడి పోయా - స్తబ్దుగా ఉండిపోయా. వెళ్తూ వెనక్కి తిరిగింది ఎందుకో - ఇంకా ఏదో చెప్పాలనుకుంటుంది.

నీ బిడ్డకు మేమంతా అండగా ఉంటాం ఏ సహాయం కావాలన్నా అడగమని చెప్పు అన్నాను. ఆమె సంతోషంతో వెళ్ళిపోయింది. అదే ఆఖరవుతుందని అనుకోలా ఆ రోజు... ఇప్పుడు ఆమెకిచ్చిన మాట నిలబెట్టుకొనే అవకాశమొచ్చింది. టీచర్లందరం సాయంత్రమే కలిసి చర్చించుకొన్నాం అందరూ ప్రయివేటు ఉద్యోగాలు, చిన్న జీతాలే. సోషల్ వెల్ఫేర్ ఫండ్ ఎలానూ ఉంది... ఆర్.డి.టి. వాళ్ళ సాయం కోసం అడిగాం... తలా చెయ్యి వేశాం...

అంజనిని దిగులు, దైన్యం నుండి బయట పడేయాలనుకున్నాం... కానీ ఆ దుఃఖం తీర్చడం ఎవరికి సాధ్యం... అందరూ మాట్లాడి ధైర్యమిచ్చాం - అక్కా బావలు అండగా నిలబడ్డారు. కొత్త కథ మొదలయింది. అంజినిప్పుడు బి.టెక్ ఫైనలియర్. చదువు ఆపలేదు.



వచ్చారట. రైల్వే శాఖా మంత్రి సదానంద గౌడని పిలిచి సాక్ష్యం చెప్పమని కోరారట.

"నాకంటే ముందు పని చేసిన వారిచ్చిన ఉత్తర్వులను అమలు చేయాల్సి వస్తోంది. అమలును ఆపుతూ ఉత్తర్వులను ఉపసంహరించుకున్నానంతే...' రైల్వేశాఖా మంత్రి సదానంద గౌడ అనేసరికి - అందుకు సాక్ష్యంగా పట్టాలమీది రైలు 14.2 శాతం అధిక వేగంతో వచ్చి ప్రజల్ని గుద్దింది.

## సమీక్ష

'ఇసుక పోస్తే ఇసుక రాలనంత జనం వచ్చారు.

ఊకపోస్తే ఊక రాలవంత జనం వచ్చారు...' అన్నాడొక నాయకుడు.

'మరి మనకు ఓట్లెందుకు రాలేదు?' అడిగాడు యువ నాయకుడు.

'ఆ పార్టీ వాళ్ళు ఇంటింటికీ డబ్బులు పంచారు...' చెప్పాడు ఇంకో నాయకుడు.

'మనం మనిషి మనిషికీ డబ్బులు పంచాం కదా?' అన్నాడు యువనాయకుడు.

ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు, ఏం మాట్లాడితే ఏమొస్తుందోనని!

'వేలకొద్దీ లక్షల కొద్దీ జనం మన సభలకు వచ్చారు కదా?' కారణాలు అన్వేషిస్తూ అడిగాడు యువనాయకుడు.

'వచ్చారు కాదు, రప్పించాం...' అని సర్దబోయి మింగేసాడో పార్టీ పెద్ద.

'మరి మన సభలకు జనం ఎందుకొచ్చినట్టు?' అర్థం కాక అడిగాడు యువనాయకుడు.

'లక్ష కోట్లు తిన్నవాడు ఎలా ఉంటాడో చూద్దామని వచ్చాం గాని...' సమీక్షా సమావేశం బయట ఓటరు అన్నమాట అక్కడి వారు చెవిన వేసుకోలేదు!

## 'ప్లీజ్.. నన్ను ఇన్‌వాల్వ్ చెయ్యకండి!'

'నేను....'

'... అను నేను శాసనం ద్వారా నిర్మితమైన భారత రాజ్యాంగం పట్ల నిజమైన విశ్వాసం, విధేయత చూపుతానని - భారతదేశ సార్వభౌమాధికారాన్ని సమగ్రతని కాపాడతానని - తెలంగాణ / ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మంత్రిగా నా కర్తవ్యాలను శ్రద్ధతో అంతఃకరణశుద్ధితో నిర్వహిస్తానని భయంగాని పక్షపాతంగాని రాగద్వేషాలుగాని లేకుండా రాజ్యాంగాన్ని శాసనాలను అనుసరించి ప్రజలందరకు న్యాయం చేకూరుస్తానని దైవసాక్షి'గా ప్రమాణం చేస్తున్నాను..'

మొదటి ప్రమాణ స్వీకారం ముగిసీ ముగియక ముందే 'ప్లీజ్ సార్... నన్ను ఇన్వాల్వ్ చెయ్యకండి' గొంతు వినిపించింది!?

ఎవరూ పట్టించుకోలేదు!

'నేను...'

'... అను నేను తెలంగాణ/ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంత్రిగా నా పరిశీలనకు వచ్చిన లేదా తెలియవచ్చిన విషయాలను నా కర్తవ్యాలను నిర్వహించేందుకు అవసరమైన మేరకు తప్ప ప్రత్యక్షంగాగాని ఏ వ్యక్తులకూ సంస్థలకు గాని తెలియపర్చనని లేదా వెల్లడించనని దైవసాక్షి'గా ప్రమాణం చేయుచున్నాను...' మళ్ళీ 'ప్లీజ్ సార్... నన్ను ఇన్‌వాల్వ్ చెయ్యకండి' గొంతు చించుకుంది!?

ప్రతి ప్రజా ప్రతినిధి చేసే ప్రమాణ స్వీకారం మధ్యలో చివర్లో దైవసాక్షి'గా అని అన్నప్పుడల్లా 'ప్లీజ్ సార్... నన్ను ఇన్వాల్వ్ చెయ్యకండి' అని పదే పదే వినిపిస్తూనే ఉంది!?

అది రింగు టోన్ అనుకున్నారు కొందరు. బ్రహ్మానందం కామెడీ డైలాగ్ అనుకున్నారు ఇంకొందరు.

సాక్షాత్తూ ఆ దైవమే 'ప్లీజ్ సార్... మీకు దండం పెడతాను, నన్ను ఇన్‌వాల్వ్ చెయ్యకండి' అన్నా - ఎవరూ వినిపించుకోలేదట?!?

## నేడే విడుదల!

జూన్ 2న తెలంగాణలోనూ జూన్ 8న ఆంధ్రప్రదేశ్‌లోనూ రెండు చోట్ల రెండు సినిమాలు భారీగా విడుదలయ్యాయి!

ఈ రెండు సినిమాలు అయిదేళ్ళ వరకూ ఆడనున్నాయి! దేశవ్యాప్తంగా ఇలాగే అనేక సినిమాలు విడుదలయ్యాయి!

తెలుగు చిత్రాల్లో 'సెంటిమెంటు'ని పుష్కలంగా పండించారు. ఈ అయిదేళ్ళ సినిమా ప్రదర్శనతో ఇంతవరకూ పెట్టిన పెట్టుబడిని బాగానే రాబట్టుకుంటామని ఆయా సినిమా నిర్మాతలు గట్టిగానే నమ్ముతున్నారు!

అయితే ఆంధ్రాకు మంచి థియేటర్స్ లేవని... త్వరలోనే సింగపూర్ తరహాలో మల్టీప్లెక్సులను నిర్మించి తీరుతామని నిర్మాత సినిమా విడుదలకు ముందునుండీ చెపుతున్న విషయం విదితమే!

మా సినిమాను అయిదేళ్ళూ ఆడిస్తామని అభిమానులు అంటూ ఉంటే, ఆడించేది మీరయినా ఆడేది మేమేనని ఆయా ప్రాంతాల ప్రజలు గుసగుసలాడుకుంటున్నారు!

సినిమా బాగోకపోతే తెరలు చించేస్తారని... అక్కడా ఇక్కడా కాదు, ఎక్కడయినా తప్పదని కొందరు హెచ్చరిస్తే - ఈ సినిమా కాకపోతే ఇంకో సినిమా మార్చి మార్చి చూడాల్సిందేనా అని సినిమాలు చూసి చూసి విసిగిపోయిన వాళ్ళు ప్రశ్నిస్తున్నారు! జవాబుల కోసం కొందరు బయల్దేరారు!

## కర్త - కర్మ - క్రియ

'మీరు పదేళ్ళుగా ఎన్ని అవస్థలు పడ్డారో నాకు తెలుసు...' అన్నాడొక కొత్త ముఖ్యమంత్రి, పాత ముఖం పెట్టుకొని.

'మా బాబే...' జనానికి ఆశ పుట్టింది.

'మీరు ఎన్నెన్ని కష్టాలు పడ్డారో కూడా నాకు తెలుసు...' ముఖ్యమంత్రి మాటలు పూర్తి కాలేదు.

'బాబ్బాబు... అది అర్థమయితే చాలు...' జనం గుండె నిండా ఊపిరి పీల్చుకున్నారు.

'మీరు పడ్డ శ్రమ వృథాపోదు, మీ శ్రమకు తగ్గ ప్రతిఫలం నేనందిస్తాను...' మంత్రి మరింత భరోసా ఇచ్చారు.

'నిన్ను గెలిపించించినందుకు ఆ మాట చాలు బాబూ...' జనం సంతోషం సగం బలం కాదు, పూర్తి బలం మాదే అనుకున్నారు.

'నాకు ఈ అధికారాన్ని కట్టబెట్టిన మీకు ఏ విధంగా సాయపడాలో ఆ విధంగా సాయపడతానని...' మంత్రిగారు మాంచి ఊపు మీద ఉన్నారు...

'మా బాబే... ఎన్టీవోడ్ని నిజంగానే మరిపించాడ్రా...' మరికొందరు జనం వేడుకగా లైవ్ చూసారు.

'నేను బాగా ఆలోచించాను, మీ అందరి కోసరం సంక్షేమ నిధిని ఏర్పాటు చేస్తున్నాను. ఆ విధంగా నన్ను గెలిపించిన పార్టీ కార్యకర్తల రుణం తీర్చుకుంటాన'ని... ముఖ్యమంత్రి ముఖ్యమైన మాటని... అసలు విషయాన్ని ఆఖర్నీ అలా చెప్పేసరికి -

జనం వెర్రి చూపులు చూసారు!

కార్యకర్తలు మాత్రం బాబుకు జే కొట్టారు!

సభ విజయవంతమైంది కూడా!

## అబ్బా... వృద్ధి

తెలుగు జాతి రెండుగ వెలుగు జాతిగా రెండు చోట్లా కొత్త ప్రభుత్వాలు ఏర్పడ్డాయి! ఎప్పటిలాగే అవి పాత ప్రభుత్వాలుగా - ప్రజలు పాత ప్రజలుగా - సమస్యలు పాత సమస్యలుగా...

కొత్త నినాదం 'అభివృద్ధి' మాత్రం బాగా అభివృద్ధిలోకి వచ్చిందట...

గతంలో లాగే వర్తమానంలోనూ గంపెడు ఆశలతో జనం తమ నియోజక వర్గ ఎమ్మెల్యేలను ఎమ్‌పీలను మంత్రులను కలుసుకోవడానికి... తమ బాధలు వెళ్ళబోసుకోవడానికి బయల్దేరారట...

గేటు గుమ్మంలోనే ఆపేసారట గెలిచిన నాయకుల అనుయాయులు!... అదేమంటే... దర్శనానికి కూడా టికెట్టు తీసుకోవాలని అన్నారట... 'దేవుడి దర్శనానికి మాత్రం టిక్కెట్టు తీసుకోరా? ఒత్తి చేతులతోనే వెళతారా?' అని ప్రశ్నించారట..

'మేం గెలిపించిన వాళ్ళని మేం కలుస్తామంటే ఏమిటీ విడ్డూరం...' జనం గుసగుసలాడి గసపోస్తే...

'ఎన్నికల్లో గెలవడానికి బోలెడంత ఖర్చయింది. అప్పుడే నెలయిపోయింది, చూస్తుండగానే అయిదేళ్ళు అయిపోతాయి, అందుకే ఈ నిర్ణయం'... అని అంటే 'పనయ్యాక ఇవ్వాల్సింది ఎలాగూ ఇస్తాం' అన్నారట ప్రజ.

'అది పాత పద్ధతి. అయినా అది అదే. ఇది ఇదే' అన్నారట అనుయాయులు. పార్టీలు మారి పెట్టుబడులు పెట్టి గెలిచి దేనికి? సంకనాకడానికా?' అని గుట్టుగా తమ గోడు వెళ్ళబోసుకున్నారట. 'మా గోడు ముందు మీ గోడెంత?' అని కూడా అన్నారట.

'కలవడానికి కూడా ఖర్చు పెట్టాలా?' కలవరపడి మనసులో మాట బయట కనేసారట కొందరు ప్రజలు.

ఏమీ అనలేక 'ఏమిటిది?' అన్నారట ప్రజ.

'అభివృద్ధి' అలవాటుగా అనేసాడో ప్రజా ప్రతినిధి.

## విషాద వసంతం

నిజం! కుంభకర్ణుడు నిజంగానే నిద్రాహారాలు మానేసాడు. లంకలన్నీ కుంకలయి పోయాయి. రావణుడు రాజనీతిజ్ఞుల నందరిని సమావేశపరిచాడు. ఏడాదిలో ఆరు మాసాలు తిండి... ఆరు మాసాల నిద్రతో తన తమ్ముడు అ'ద్వితీయ'మైన పాత్ర పోషించాడని, అలాంటిది నిద్రాహారాలు మానేయడమేమిటని రావణుడు ఆవేశపడ్డాడు.

కారణం లేనిదే రణం చేయలేమని... తమ కొచ్చిన ఆపదేమని... అవమానమేమని... చెప్పమని... కుంభకర్ణుణ్ని కోరుకున్నారు ఆ రోజు నీతి కోవిదులు... విధ విధాలా.

కుంభకర్ణుడు నోరు తెరిచాడు, తినడానికి కాదు. 'నన్ను మించిన నరులు తయారయినారు...' అని కుంభకర్ణుడు వాపోయాడట. వెక్కి వెక్కి ఏడ్చాడట. కడవల కొద్దీ కాదు, కాలువల కొద్దీ కన్నీరు కార్చాడట. ఆ కన్నీరు మున్నీరుకి సముద్ర నీటి మట్టం అమాంతం పెరిగి పోయిందట! లంక మునిగిపోబోయిందట!? ఈ ఉప'ద్రవాన్ని' ఆపడానికి... కుంభకర్ణుడుకి ఉపశమనం కలిగించడానికి లంక మంత్రివర్గం ప్రయత్నించిందట. అప్పటికప్పుడు మాయాదర్పణం తెప్పించి నరలోకం మీదికి దృష్టి సారించిందట...

భరత ఖండం భగ్గుమని వెలుగు వెలిగిపోతూ కనిపించింది. ఎంతో కష్టపడి ఎన్నికలలో గెలిచిన గుంపులు గుంపులు ఎక్కడికక్కడ చక్రవర్తుల్లా చక్రం తిప్పుతూ కనిపించారు!

పరికించి పరిశీలించి పరిశోధించి కారణాలు వెతికి కుంభకర్ణుని ఇంటికి తోరణాలు కడదామని చాలా దగ్గరగా చూసారట లంక రాజకోవిదులు. ఈ ప్రయత్నాన్ని అగ్రరాజ్యం అమెరికా సయితం కనిపెట్టలేకపోయింది. ఎవరో ఏలియన్స్ వచ్చారని మాత్రం కొంత మంది పసిగట్టారు.

కాలంతో ప్రయాణించినప్పుడు త్రేతాయుగం కలియుగం పక్క పక్కనే వుంటాయని - అంచేత లేనిపోని అనుమానాలకు తావు ఇవ్వవద్దని అసలు విషయం మీద దృష్టి కేంద్రీకరించారట రావణ పరివారం. కుంభకర్ణుడు కూడా ఏడుపు ఆపి ఏదో జరిగిపోతోందని రెప్పలార్పకుండా చూసాడట. ఏదో విధంగా ఏడుపు ఆపాడు అని రావణుడు ఊపిరి పీల్చుకుంటే, సముద్ర నీటి మట్టం పెరగకుండా ఆగినందుకు - ఆగిపోయిన ఊపిరిని తిరిగి తీసుకున్నారట లంకవాసులు.

అండాల కొద్దీ అన్నం, డెక్సాల కొద్దీ పప్పు, పళ్ళేల కొద్దీ మాంసాహారల వేపుళ్ళూ, డ్రమ్ముల కొద్దీ పులుసులు... ఇలా తినే పదార్థాలే తినడం తెలిసిన కుంభకర్ణుడు ముక్కున వేలేసుకున్నాడట!? భూమీ పుట్టా ఇనుమూ ఇసుకా బొగ్గూ గడ్డీ గాదరా ఒకటేమిటి అన్నీ దవడ కదపకుండా అంగుట్లో వేసుకొని మింగేస్తున్నారట. మింగినోళ్ళకి మింగినంత!

కొందరు మధ్య మధ్యలో మభ్యపెడుతున్నట్టు 'ప్రజాస్వామ్యానికీ జై' అంటున్నారట.

'ఏమిరా ఇది?' రావణుడు పది తలల ఇరవై కళ్ళు చేసి చూసాడట. చూస్తూనే ఉన్నాడట.

'అయిదేళ్ళ వరకూ వాళ్ళనెవరూ ఆపలేరు, వాళ్ళకా శక్తి ఇచ్చింది ప్రజలే ప్రభూ...' అని మేధావులు వివిధ తావుల పరిశీలించి పరీక్షించి చెప్పేరట. రావణుడు ఒక్క తల కూడా ఊపలేదట!?

'ఇలాంటి తుచ్ఛుల్ని ఎన్నుకున్నందుకు ప్రజలేమను కుంటున్నారు?' పది తలల్లో ఒక్క తలే మాట్లాడిందట.

'మనం ఎన్నుకున్న నాయకులంతా గెలుస్తూనే నిద్రపోవడం

వ్యాసం

# "విప్లవ సాహిత్యం-స్త్రీల కృషి" నమోదుకు ఒక చేర్పు

- షహీదా

2013 జనవరి-ఫిబ్రవరి 'అరుణతార'లో 'విప్లవ సాహిత్యం-స్త్రీల కృషి' అనే కామ్రేడ్ కృష్ణాబాయిగారి (కృష్ణక్క) వ్యాసం ప్రచురించారు. అందులో ఆమె "అజ్ఞాతంలో ఉండి ప్రజాజీవితాన్ని రికార్డు చేస్తున్నవారూ వున్నారు. అయితే విప్లవోద్యమంలో నిమగ్నమైన వారి రచనలు అన్నీ అందుబాటులో ఉండే అవకాశం తక్కువ అనే పరిమితిని దృష్టిలో ఉంచుకోవడం అవసరం. పదుల సంఖ్యలో వున్న అజ్ఞాత మహిళా రచయితలు రాసిన రచనలు బయటి ప్రపంచానికి అందకపోవడం వల్ల సంపూర్ణమైన అంచనాకు రాలేం గానీ, కొంతవరకు సమగ్రత కోసం ప్రయత్నించవచ్చు" అని రాశారు.

బయటి ప్రపంచానికి అందకపోవడం ఒక సమస్య అయితే, అందినవి ఆయా అజ్ఞాత మహిళా రచయితలు (అ.మ.ర.) రాసినవి అని తెలీకపోవడం అనే సమస్య, వారిలో కొందరు ఒక పేరుతో కాక అనేక పేర్లతో రాయడం అనే సమస్య, వారు రాసినవి అజ్ఞాతం నుండి ప్రచురణ అయ్యే పత్రికల్లో అచ్చువ్వడం వల్ల అవి అందచ్చు, అందకపోవచ్చు అనే సమస్య, తాము రాసినవి వీరిలో అత్యధిక శాతం రచయితలు తమ వద్ద సేకరించి ఉంచుకోలేకపోవడం లేదా ఉంచుకోకపోవడం సమస్య, వారే తాము రాసిన రచనలు ఫలానా అని మర్చిపోవడం సమస్య, ముఖ్యంగా పాటలు చాలావరకు ప్రచురితం కాని సమస్య, నోటు పుస్తకాల్లోనో, ప్రజల నాలుకల మీదో తప్ప అవి దొరకని సమస్య...ఒకటా, రెండా ఇలా ఎన్నో సమస్యలు మహిళల సాహిత్య కృషి నమోదు కాకపోవడానికి, కర్ణుడి చావుకు కారణాల్లా. రాస్తే చాంతాడంత అవుతయి.

అయితే అందుబాటులో ఉన్నవాటిని కూడా మరింత శ్రద్ధగా, లోతుగా, (వివిధ వనరుల ద్వారా) సమాచార సేకరణతో పరిశీలించి, పరిశోధించి తెలుసుకోవడంలో ఇంతకంటే ఎక్కువ లోపాలు కూడా ఉన్నాయి. కృష్ణక్క చేయాలని కాదు గానీ, మరెవరైనా యువతరంలోని వారు నిజంగా విప్లవ సాహిత్యంలో స్త్రీల కృషిని నమోదు, విశ్లేషణ చేయాలనుకుంటే మాత్రం మరికొన్ని వనరులు ప్రగతిశీల పత్రికల, పుస్తకాల రూపంలో ఉన్నాయని మాత్రం ఇక్కడ చెప్పి వదిలేస్తాను. (ఉదాహరణకు - "ఆమె నడిచినంత మేరా" అని అమరురాలు (తిరుపతి) పద్మక్క రచనలు విరసం వారే ప్రచురించారు. నిత్య రాసిన "ప్రేంచంద్ నవలల్లో స్త్రీ పాత్రలు" పుస్తకం 'మహిళామార్గం' ప్రచురణగా వచ్చింది, ఇలాగే ఇంకెన్నో...).

నేను ప్రధానంగా ఇక్కడ రాయాలనుకున్నది ఈ విషయం కాదు. పైన చెప్పినట్టే అ.మ.ర. సాహిత్య కృషి నమోదుకు ఒక చేర్పు చేద్దామని మాత్రమే. సుజాత, మైనా, నిత్య అనే దండకారణ్య మహిళా రచయితల పేర్లు 'అరుణతార' పాఠకులకు పరిచితమైనవే. వీరిలో మైనా 'సింధుకిరణ్', 'మాడివి ఇడిమే', 'తుడుం' పేర్లతోనూ, నిత్య 'నర్మద' పేరుతోనూ కూడా రచనలు చేశారు. సుజాత ఒక కథను మాత్రం 'సీత' పేరుతో 'మహిళామార్గం'లో రాశారు గానీ దాదాపుగా సుజాత పేరుతోనే రచనలు చేశారు. (కామ్రేడ్ మల్లోజుల కోటేశ్వరరావు పై రాసిన కవిత ఈ సుజాతదే. తెలిసినట్టే వార్తాపత్రికలు దాన్ని ఆయన సహచరి రాసినట్టుగా పాదసూచిక రాసేశాయి). "ముప్పై ఏళ్ల దండకారణ్య సాహితీ సాంస్కృతిక చరిత్ర" పుస్తకంలో కామ్రేడ్ పటేల్ సుధాకర్ కు నివాళి అర్పిస్తూ ఇలా పేర్కొన్నారు - "విప్లవోద్యమంలోని మహిళల రచనలను సేకరించి వాటినచ్చువేసి ప్రపంచానికందించాలని 2007లో చొరవ చేసి ఒక తీర్మానం చేయించిన సాహితీ అభిమాని ఆయన." ఇందులో భాగంగానే ఈ ముగ్గురి రచనలనూ సంకలనం చేసి తీసుకురావాలనే ఒక ప్రయత్నం సిపిఐ (మావోయిస్టు) నుండి జరిగింది. అది ఇప్పటికీ ఒక అసంపూర్తి సాహితీ కర్తవ్యంగా మిగిలి ఉంది. ఆ ప్రయత్నంలో భాగంగా ఎంతో 'ప్రయత్నం' (వాడుక భాషలో 'పోరిన') తర్వాత గానీ ఈ ముగ్గురూ (దీనితో జత చేస్తున్న) రచయితలుగా తమ ఈ స్వీయ పరిచయాలు రాశారు కారు. వీటిని దండకారణ్య సాహితీ సాంస్కృతిక పత్రిక 'ఝుంకార్' 2009లో పత్రికకు అనుబంధంగా వెలువరించింది. వారి రచనలు సంకలనం అయి ప్రచురణ కావడం అనే కర్తవ్యం దండకారణ్య పార్టీ ఉన్న యుద్ధ పరిస్థితుల్లో నానాటికీ సుదూరం అవుతున్నట్టు తోచడంతో సూర్యుడికి దివిటీలా ఒక చిన్న పరిచయం

---

ప్రారంభించారని... మళ్ళీ అయిదేళ్ళ వరకూ నిద్ర లేవరని...' కోవిదులు సేకరించిన వివరాలు చెప్పీ చెప్పక ముందే కుంభకర్ణుడు 'అన్నయ్యా...' అని రావణుని పట్టుకొని బావురుమన్నాడు. తనను మించి పోయారన్న కుంభకర్ణుడి అంతరంగాన్ని అన్న రావణుడు అర క్షణంలో గ్రహించగలిగాడట.

పది తలల్తో పరికించి చూసిన రావణుడు దిగ్భ్రాంతికి లోనయినాడట. రావణుని పది ముఖాలు నివ్వెరపోవడంతో కుంభకర్ణుడు ఏడుపు ఆపి అంతఃపుర పెద్దలతో కలిసి కళ్ళు నిలిపాడట.

మాయ దర్పణంలో మర్మమేదో అగుపించిందట!

నిరంతరం ధన దాహంతో అందిన కాడకి తాగేస్తూ దోచేస్తూ ఉన్న నాయకుల ఒక్కో ముఖం రెండుగా కనిపించిందట! ప్రజలకు కనిపిస్తున్న ముఖం నిద్ర ముఖమయితే, కనిపించని ముఖం ఆబ తిండిబోతు ముఖమట!? ఏక ముఖాన రెండు ముఖాలు చూసి రావణ కుంభకర్ణాది కోవిదులంతా కొయ్యబారి చూసేరట!

'నేను వీళ్ళముందు ఎందుకు పనికొస్తాను అన్నయ్యా...' అని కుంభకర్ణుడు రావణుని పట్టుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్నాడట. అలా తలచుకొని ఏడ్చి ఎదపోసుకున్నప్పుడల్లా 'సముద్ర నీటి మట్టాలు పెరుగుతున్నాయి' అని మనం అనుకుంటూ ఉంటామట! తెలియక తుఫానుకొక పేరు పెట్టుకుంటూ ఉంటామట!?



రాసి వీటిని కనీసం 'అరుణతార'కైనా పంపుదాం అని నాకు నేను అనుకున్న తర్వాత కూడా నేనూ మరిన్ని నెలలు గడిపేస్తూ ఉండగా కృష్ణక్క వ్యాసం అవసరమైన 'తోపు' తోసింది. 'అరుణతార' సంపాదకులు వీటిని ప్రచురణకై పరిశీలిస్తారనీ, ప్రచురణకు స్వీకరిస్తే అచ్చుతప్పులు లేకుండా టైప్ చేయించి ప్రచురిస్తారనీ ఆశిస్తున్నాను.

ఈ మూడూ వీరి సాహిత్య కృషిని గురించి పరిచయం చేయడం అనే ప్రయోజనాన్ని నెరవేర్చేవి అనేది అర్థమయ్యేదే గానీ ఇప్పటివరకూ దాదాపుగా ఏ అజ్ఞాత విప్లవ రచయితల (పురుషులు గానీ, స్త్రీలు గానీ) నుండీ ఇలాంటివి రాలేదనేది కూడా మనం గమనించాలి అన్పిస్తుంది. అందులోనూ మహిళల నుండి రావడం అనేది పరిగణించినప్పుడు వీటికి ఒక అరుదైన ప్రాధాన్యత, విలక్షణత ఉన్నది, కదా?

వీటిలో వీరు ప్రస్తావించిన రచనలు కాక మరెన్నో రచనలు వీరివి అనేక ప్రక్రియల్లో ఉన్నవి. అలాగే కామ్రేడ్స్ మైనా, నిత్యలు కోయ భాషలోకి మరిన్నిటిని (పుస్తకాలూ, కథలూ) అనువాదాలు చేశారు, చేస్తున్నారు. కాగా కామ్రేడ్ సుజాతది వ్యాసరచనలో ప్రముఖ కృషి ఉన్నది. అమరులపై జ్ఞాపకాలు ముగ్గురూ మరిన్ని రాశారు. సరే, ముందే చెప్పినట్టు ఇక దివిటీ అనవసరం.

చేర్పులో భాగంగా అనుకుని రాయకపోయినా, ఆ ప్రయోజనాన్ని నెరవేర్చగల కామ్రేడ్ గజ్జెల సరోజ (స్పార్క్) సాహిత్య కృషి గురించిన వ్యాసాన్ని దీనితోపాటే పంపుతున్నాను. అయితే ఇక్కడ నేను చేర్పులో భాగం కావడం కోసమే మరో అ.మ.రచయిత గురించి మాత్రం కొన్ని ముక్కలు రాస్తాను.

2013 ఏప్రిల్ 29న అమరురాలైన కామ్రేడ్ గడ్డం లక్ష్మి (భాగ్య, మహిత) అంజన పేరుతో రచనలు చేశారు. వాటిలో చైనా విప్లవ విజయానికి యాభై ఏండ్లు నిండిన సందర్భంగా రాసిన 'ఇళ్లకు మళ్లిన స్త్రీలు తిరిగి నిప్పుపూలై వస్తారు', 'స్వర్ణోత్సవ సంవత్సరంలో మహిళల స్థితిగతులు' అనే వ్యాసాలు 'మహిళామార్గం' పత్రికలో ప్రచురితమయ్యాయి. సిపిఐ (మావోయిస్టు) ప్రచురించిన ఆమె జీవితచరిత్రలో రచయితగా ఆమె కృషిని నమోదు చేస్తూ, "ఫెమినిస్టు రచనలు చదివి వాటిపై విమర్శనాత్మక వ్యాసాలు 'అంజన' పేరుతో రాసింది. సెమినార్ల సందర్భంగా పేపర్స్ తయారు చేయటంలో భాగమైంది. మహిళా పత్రిక సంపాదక వర్గంలో ఉండి పత్రికను తేవటంలో భాగమైంది. ఏఓబిలో (ఆంధ్రా-ఒడిషా సరిహద్దు జోన్) మహిళా పత్రిక 'విప్లవి' సంపాదకవర్గంలో ఉండి అనేక రచనలు చేసింది. క్రాంతి పత్రికకు విద్యారంగం మీద ఒక వ్యాసం రాసింది. విశాఖలో 'వాకపల్లి' ఘటనపై వేసిన పుస్తకంలో పాలకవర్గ దోపిడీ విధానాలను వ్యతిరేకిస్తూ ప్రధాన వ్యాసం రాసింది," అని పేర్కొన్నారు.

'ఫెమినిస్టు రచనలు చదివి రాసిన విమర్శనాత్మక వ్యాసాలు' అంటే ఒకటి మాత్రమే పూర్తి చేశారు. అది ఓల్గా రాసిన 'ప్రయోగం' కథల సంకలనం మీద విమర్శనాత్మక సమీక్ష. మరొకటి పూర్తి కాకుండానే ఉండిపోవడం విచారించదగినది. కృష్ణక్క వ్యాసంలో – "ఇక విప్లవోద్యమంలో నిర్దిష్టంగా మహిళా సమస్యను, స్త్రీవాదం లాంటి ప్రభావశీలమైన ఉద్యమాలను మార్క్సిస్టు సిద్ధాంత వెలుగులో పరిశీలించిన వారు జాతీయ స్థాయిలో అనురాధ గాంధీ, ఆంధ్రప్రదేశ్‌లో డా.టి.నళిని, ఎం.రత్నమాలలు," అని ఉంది. "విప్లవోద్యమంలో నిర్దిష్టంగా మహిళా సమస్యను మార్క్సిస్టు సిద్ధాంత వెలుగులో" పరిశీలించిన కామ్రేడ్స్ ఇంకా ఉన్నారు, ఒక విధంగా అదంతా సమిష్టి కృషి కూడా (అనురాధ గాంధీ సహా). అయితే ఇక్కడ "స్త్రీవాదం లాంటి ప్రభావశీలమైన ఉద్యమాలను మార్క్సిస్టు సిద్ధాంత వెలుగులో పరిశీలించినవారు" అన్నప్పుడు తప్పకుండా అంజనను కూడా పేర్కొనాలి అని చెప్పడానికి రాస్తున్నాను. నిజానికి అంజన 'ప్రయోగం' పుస్తకంపై రాసిన వ్యాసం, డా.టి.నళిని 'మూడు తరాలు'పై రాసిన వ్యాసం ఒకటే పుస్తకంగా 'మహిళామార్గం' ప్రచురణగా వచ్చింది కూడా. ఇటీవలి అక్టోబర్-నవంబర్ 2013 'అరుణతార' విమర్శ ప్రత్యేక సంచికలో సాహిత్య విమర్శ విషయంలో రాసిన వ్యాసాలు చదివి ఆ రంగం గురించి మరింత రిఫరెన్స్ చేయాలనుకుంటే లేదా భవిష్యత్తులో మరింత రాయాలనుకుంటే లేదా విడిగా సాహిత్య విమర్శలో స్త్రీల కృషి గురించి తెలుసుకోవాలన్నా ఈ పుస్తకం తప్పక చూడాల్సినవాటిల్లో ఒకటిగా ఉంటుందని భావిస్తున్నాను. అలాగే కామ్రేడ్ (తిరుపతి) పద్మ రాసిన 'పురాణాల్లో స్త్రీ పాత్రలు' వరుస వ్యాసాలు, నిత్య రాసిన 'ప్రేంచంద్ నవలల్లో స్త్రీ పాత్రలు' కూడా ఉంటాయి, ముఖ్యంగా మహిళలు సాహిత్య విమర్శలో చేసిన కృషిగా. ఇవన్నీ అందుబాటులో ఉన్నవే.

ఇవి కాక కామ్రేడ్ గడ్డం లక్ష్మి రాసిన ఫీల్డు రిపోర్టులు కూడా ఎంతో విలువైనవి. ఆమె జీవిత చరిత్రలో ఇలా రాశారు – "శ్రీకాకుళం డివిజన్లో ఉండగా గొట్ట ఏరియాలో, బొరిగి ఏరియాలో వర్గవిశ్లేషణ చేసింది. దండకారణ్యంలో రీజనల్ పొలిటికల్ స్కూలు గురూజీగా తిరుగుతున్న క్రమంలో తూర్పు బస్తర్‌లో, దక్షిణ బస్తర్‌లో, పశ్చిమ బస్తర్‌లో కొన్ని క్రాంతికారి జనతన సర్కార్ పని చేస్తున్న ప్రాంతాల్లో తిరిగి ప్రజల జీవితాల్లో జనతన సర్కార్ తీసుకుని వచ్చిన అభివృద్ధిని అధ్యయనం చేసింది." ఇది విప్లవ సాహిత్య కృషి కిందకి రాకపోవచ్చేమో గానీ పార్టీలో కూడా వర్గవిశ్లేషణ చేయడంలో, ఫీల్డురిపోర్టులు రాయడంలో మహిళల కృషి అరుదు. ఆ అరుదైన కృషి చేసినవారిలో కామ్రేడ్ లక్ష్మి ఒకరు అని చెప్పడం అసందర్భం కాదని భావించి రాస్తున్నాను. ఆ పనిని ప్రశంసనీయంగా కూడా చేశారు.

ఇక కొసమెరుపుగా – కృష్ణక్క వ్యాసంలో పేర్కొన్న 'గమ్యం చేరేదాకా పరుగుపందెం' రాసిన 'లక్ష్మి' ఎవరో కాదు సిపిఐ (మావోయిస్టు) ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ గణపతి. ఆయన 'లక్ష్మి' కలంపేరుతో మరిన్ని రచనలు కూడా చేశారు. అలాగే ఇందులో ప్రస్తావించిన 'మయూరి' కూడా పురుష రచయిత అని విన్నట్టు గుర్తు, కచ్చితంగా చెప్పలేను కానీ తెలుసుకోవడం కష్టం కాకపోవచ్చు. సాధారణంగా స్త్రీలు పురుష పేర్లతో రాయడం ఉండదు. (ఉత్తర తెలంగాణ స్పెషల్ జోన్ కమిటీ సభ్యురాలు కామ్రేడ్ న్యాలకొండ రజిత 'మార' పేరుతో రాసేది. ఏంటి అర్థం అంటే "అమరుడు కామ్రేడ్ మాసాని రవీందర్ ప్రేరణ నాకు చాలా ఉంది. ఆయన గుర్తు," అని చెప్పింది. 'మార', 'స్పార్క్' లాంటి కలంపేర్లు ఉన్నప్పుడు పురుషుడా, స్త్రీనా గుర్తించడం కష్టం. అలాగే ఎందుకో తెలీదు గానీ నా 'జ్ఞాపిక' కథను 'సుధాకర్' పేరుతోనూ, నేను ప్రభాత అనే పేరుతో పంపినదాన్ని ప్రభాత్ పేరుతోనూ 'అరుణతార' వారు ప్రచురించినలాంటి 'సందర్భాలను' వదిలేద్దాం). కానీ మహిళల పేరుతో రాసే పురుష కామ్రేడ్స్ బానే దొరుకుతారు, భవిష్యత్తులో గమనంలో ఉంచుకోవాలి సుమా!

వ్యాసం

# జీవన పరిణామ చిహ్నాలయిన సమూహాల ధ్వంసం నేరం!

- నల్లూరి రుక్మిణి

అభివృద్ధి పేరుతో జరిగే విధ్వంసంలో మానవత్వం కూడా నశించి పోతుందనే దానికి పోలవరం ప్రాజెక్టు మరో మంచి ఉదాహరణగా మిగిలింది. అసలు బాగా ధనవంతంగా, విలాసవంతంగా ఉండాలనుకోవడమే సంకుచిత ధోరణి కాగా... అందుకోసం, 'ఎవరేమై పోతే మాకేంటీ?' అనేది మరింత దుర్మార్గమైంది. వెనకటి రోజుల్లో పెద్దలు, "ఇరుగు చల్లన, పొరుగు చల్లన, ఇంట్లో చల్లన" అని చెప్పేవారు. అలాంటి రోజులు ఎప్పుడైనా ఉన్నాయో, లేవోగానీ... ఇప్పుడు మాత్రం 'కలికానికి' కూడా కానరావడం లేదు. ఇది వ్యక్తులకే కాదు, సమూహాలకే 'లేకుండా పోయింది. ఎందుకు ఈ మాట అంటున్నానంటే పోలవరం తెచ్చే లాభాల సంగతి సరే!... అది కడితే లక్షల మంది జనం జీవితాలు ధ్వంసమయిపోతాయి. వందల గ్రామాలు రూపు రేఖలు లేకుండా పోతాయంటుంటే! ఆ అన్న వాళ్ళను అభివృద్ధి నిరోధకులంటున్నారు.

అది మాత్రమే కాదు. ఈ మునకలో పూర్తిగా కానరాకుండా పోయేది మామూలు మనుషులు కాదు! అరుదైన ఆదివాసీలు. అసలు ఆదివాసీలనూ, గిరిజనులనూ ఎట్లాంటి దృక్పథంతో చూడాలన్న దాని మీదే మన చరిత్రకారులకు, సైన్సు బోధకులకు కొంచమైనా ఇంగితం లేదు. నిజంగా వీళ్ళిద్దరికీ సరైన దృష్టి ఉన్నట్టయితే, ఈ రోజు ఏవో ప్రజా సంఘాలు కాదు, దీని మీద పనిచెయ్యాల్సిందీ, ప్రశ్నించాల్సింది, పర్యావరణవేత్తలు, చరిత్రకారులు, సైన్సు చదువుకున్న వాళ్ళూనూ! ఎందుకు ఈ మాట అంటున్నానూ అంటే! ఆదివాసీలు ఆదిమానవుడి కొనసాగింపుగా, వారసులుగా మిగిలి ఉన్నవాళ్ళు. వారి ఆచారాలూ, సంస్కృతీ గురించి కాదు నేను చెప్పేది! వారి జీన్స్, శారీరక నిర్మాణం, వారి భౌతిక ప్రత్యేకతల గురించి. ఆధునిక మానవుడు రూపొందటానికి మూలధాతువు లాంటి సమూహాలను ఎంత పదిలంగా భద్రపరచాలి? మద్రాసులో 'చచ్చిన కాలేజీ, బతికిన కాలేజీ" అనేవి ఉన్నాయంట అని నా చిన్నప్పుడు మా ఊళ్ళ నుండి తిరుపతికి పోయిన వాళ్ళు, గుండ్లతో సహా మద్రాసు ట్రిప్పులు పోయి చూసి వస్తుండేవారు. ఆ 'చచ్చిన కాలేజీ' గురించి వింతల వింతలు చెప్పుకోవడం నాకింకా గుర్తే! అట్లా రాతి యుగం నాటి వస్తువుల దగ్గర నుండి శరీసృపాలు, రాక్షస బల్లులు వంటి వాటిని అట్లాగే చారిత్రక గుహలను, అజంతా, ఎల్లోరా, బౌద్ధ ఆరామాలనూ ఎందుకు కాపాడుతున్నాం. అట్లాంటిది, సజీవ జీవన పరిణామానికి సంబంధించిన సమూహాలను అభివృద్ధి పేరుతో ధ్వంసం చేసుకోవడం మానవ తప్పిదం కదా! దీని మీద మాట్లాడవలసింది పరిశోధకులు కాక, మరెవరూ? కానీ ఈ రోజు ఆ సైన్సు చదువరులు, చరిత్ర విద్యార్థులకూ ఈ రకమైన దృక్పథం ఉన్నట్టు మచ్చుకైనా కానరావడం లేదు. ఎందుకంటే ఇట్లాంటి వాటి మీద వ్యాసాల్లో, పోరాటాలో, వ్యతిరేకతలో ప్రదర్శిస్తే వారికేం దొరుకుతుందీ? ఆస్తులా! బిరుదులా! సన్మానాలా?!

ఆ మధ్య ఇండోనేషియాలో వచ్చిన 'సునామీ'లో ఎన్నో వేల మంది చనిపోయారు. ప్రపంచమంతా, దానిమీద గందరగోళ పడిపోయింది. ఈ 'సునామీ' దెబ్బకు అల్లల్లాడి పోయింది చాలా వరకు తీరాన ఉన్నవాళ్ళు, విలాసంగా గడపడానికి షైర్ల కెళ్ళిన వాళ్ళూనూ!... కానీ చాలా ఆశ్చర్యంగా సముద్రం మధ్యలో 'అండమాన్'లో ఉన్న అసలు ఆదివాసీలు 'సునామీ' రాబోతుందని ముందే గ్రహించి... మిట్టల మీద కెక్కారని, మనం చదువుకున్నాం. నిజానికి వాళ్ళేం చదువుకుని 'సునామి' రాకను గ్రహించారు? కేవలం వారసత్వంగా ప్రకృతిని పరిశీలించడం ద్వారా సముద్రంలోని అలల్లోని మార్పులు... సముద్ర గర్భంలో వచ్చిన 'నేల తిమ్మిరి'ని, జంతువుల, పక్షుల అలజడిని గుర్తించడం ద్వారా సునామీని గ్రహించగలిగారు. అదీ ఆదివాసీలకు, ప్రకృతితో ఉన్న అనుబంధం, మమేకత్వం. అలాంటి మనుషులను ఈ భూమి మీద మిగుల్చుకోవాలన్న జిజ్ఞాస ఎవరికుందీ? అన్ని దేశాలూ అంతులేని డబ్బూ అధికార దాహంతో కొమ్మ మీద కూర్చుని చెట్టును నరుకుతున్నారు. ఇక్కడ ఆదివాసీలు కావచ్చు, మరో దేశంలో రెడ్ ఇండియన్స్ కావచ్చు! చాలాసార్లు అనిపిస్తుంది మన ఆంధ్రులకూ, అమెరికా వాళ్ళకూ జీన్ ఒకటేనాని?... కానీ నా ఊహ నిజం కాకుండుగాక!

"సామాజిక స్పృహలేని సాహిత్యం వ్యర్థం... సాహిత్య స్పృహలేని సమాజం అనర్థం" అన్నారు పెద్దలు. దీనికి నేనో మాట అదనంగా, 'మానవత్వపు స్పృహలేని మనిషి నిరర్థకం'... అని చేరుస్తున్నాను. ఎందుకంటే ఇప్పుడు, అభివృద్ధి వద్దా? ఉద్యోగాలు వద్దా? అని అరిచే వాళ్ళకు ఈ స్పృహ చాలా తక్కువగా ఉంది. వీళ్లకు వాళ్ళ బాగు, వాళ్ళ మంచి, వారి పిల్లలకు ఉద్యోగాలూ ఉంటే చాలు, ఇదీ వీళ్ళ నవీనత్వం. అట్లాంటి గిడసబారిన మనస్తత్వాలను తయారు చేసిన ఈ సమాజాన్ని... ఏం చేసి బాగు చెయ్యాలో గదా!

అదలా ఉంచగా! అసలు పోలవరం ప్రాజెక్టు... అంతమందిని ముంచి... అంత భారీగా కట్టడం అవసరమేనా?... నిజంగా ఏదో వెనకటి శతాబ్దాల్లోలాగా మనిషిని మనిషి పీక్కుతినే 'డొక్కల కరువు' వొచ్చి, మానవజాతి నాశనం అయిపోతుందనుకుంటే... నీళ్ళు నిలవచేసుకోవడం, మనుషులను కాపాడుకోవడం తప్పని సరి. అందుకు సమాజం కొంత నష్టపోయినా సరే! కానీ ఇప్పుడీ పోలవరం అందుకోసం కాదు. పులిచింతల చాలక, సాగర్ నీళ్ళు చాలక, అదనంగా మరో ఎనభై టి.యం.సి. నీళ్ళు కావాల్సి వచ్చాయి కృష్ణా డెల్టాకు. అందుకోసం కూడా ఈ ప్రాజెక్టు కావాలి. ఇంకా ఏవేవో ప్రయోజనాలు చెప్తున్నారు. వాటన్నిటికీ, ఆదివాసీలను నష్టపరచకుండానే, ప్రత్యామ్నాయ పద్ధతుల గురించి చెప్పేవారి మాట పెడ చెవిన పెట్టారు. కాలవలు తవ్వుతున్నారు, ప్రాజెక్టు కట్టడానికి

కేంద్రం కూడా జెండా ఊపింది.

అయితే చాలా చిత్రంగా, వెనక ఏదో ఎక్కడెక్కడో అంతర్వాహినీ నదులు ప్రవహించాయనీ, ప్రవహిస్తున్నాయనీ 'పురాణ పురుషులు' చెప్తుంటారు... దానికేదో ఒక దేవత పేరు తగిలించడం వింటుంటాం. అలా ఈ రోజు పోలవరం కాలవలకు అంతర్వాహిని కాలవల్లాగా తాడిపూడి, పుష్కరం కాలవలు పక్కపక్కనే సమాంతరంగా తవ్వుతున్నారు. గుమ్మానికొక స్వామీజీ ఉన్న ఈ రోజుల్లో ఈ కాలవలు భవిష్యత్తులో గోదావరి అంతర్వాహినీ నదులై విలసిల్లితే.... అందుకు తూర్పుకు తిరిగి 'దణ్ణం' బెట్టడమే! మనం చెయ్యగలిగింది. అది సరేగానీ ఈ సమాంతర కాలవలు చేసేదేమిటీ అంటే ఒకే ఆయకట్టకు నీటిని సరఫరా చేయడం, ఎంత హాస్యాస్పదం... జనం పట్ల ఎంత అవహేళన? బాధ్యతలేనితనం తలచుకుంటే ఎంత కష్టంగా ఉందీ? ఈ కాలవల తవ్వకం ఎవరి బాగుకోసం? ఈ నీటి ప్రవాహం ఏ భూములను తడపడానికీ? ఎవరి ప్రయోజనాలను కాపాడడానికీ?

సరే పెట్టుబడిదారులూ, వ్యాపారస్తులూ, రాజకీయ పార్టీలూ అట్లానే ఉంటాయి గదా! అనే మాట నిజమే! మరి తెలంగాణ పోరాట పార్టీలనీ, 'కాపిటలిస్టు'లను, నిలవరించాలనీ జబ్బలు చరుస్తున్న వాళ్ళ మాటేమిటి? తెలంగాణ ప్రజలు సీమాంధ్ర పెత్తనం కింద నలిగిపోయారనీ, వారినుండి తెలంగాణ ప్రజలను రక్షించడమే తమ కర్తవ్యమన్నారు. ఎట్టకేలకు 'రాష్ట్రం' సాధించుకున్నారు మంచిదే! మరి ఆ ఆంధ్రోళ్ళ పెత్తనం కిందికి కొన్ని మునక గ్రామాలు పోతున్నాయి కదా! వాళ్ళకు మనమైతే మంచిగా న్యాయం చేస్తాం! ఇప్పటి దాకా మనతో ఉన్న మేకల్లాంటి ఆదివాసీలను... ఆంధ్రోళ్ళకు వదిలిపెట్టవద్దని ఎందుకు అనిపించలేదూ? మరి వాళ్ళ గురించి మాట్లాడాలి గదా!

'పోనీ! ఓ పిడికెడు గ్రామాలే గదా! వదిలేద్దాంలే!' అనుకున్నారేమో తెలియదుగానీ, మరి! 230 గ్రామాలు, నాలుగు లక్షల మంది జనం, వాళ్ళ మాటేమిటి? పోలవరానికి జాతీయ హోదా ఇచ్చి ఆంధ్రావాళ్ళను సంతృప్తులను చేసి మీకేమో తెలంగాణ ఇస్తే - ఇక మీరేం మాట్లాడరా? ఆ మునిగిపోతున్న జనం అనాథ బిడ్డలా? సమాజం సందిట్లోకి రాకుండా ఎక్కడో కొండల్లో గుట్టల్లో దూరంగా ఉండిపోయిన, మనకు ఎక్కువై పోయిన వాళ్ళా? మన 'నాగరిక సమాజం' వాళ్ళ గురించి పట్టించుకోనక్కరలేదా? మీ మీ పంచాయితీలు, కవిల కట్టలూ లెక్కలు తేల్చుకునే సందర్భంగా వాళ్ళ కోసం పిసరు విచారం వ్యక్తం చెయ్యరా?

అసలు 'అభివృద్ధిలో' ఎప్పటికీ ఆదివాసీలూ, దళితులూ పేదలూ మాత్రమే నిర్వాసితులయి పోతున్నదెందువల్ల? పట్టణ వాసులం చెమట పట్టకుండా ఉద్యోగాలూ వ్యాపారాలూ చేసుకుంటూ ఉంటాం. మనకు కరెంటు ఆగిపోకుండా సరఫరా కావాలి. అందుకు బొగ్గు, నీళ్ళు అన్నీ కావాలి. దానికి ఓపెన్ కాస్టులు, జలవిద్యుత్తు కోసం ప్రాజెక్టులు, కాకరాపల్లి, సోంపేట అంతటా సగటు జనం సర్వనాశనం కావల్సిందే గదా? మన అవసరాలకూ, భోగాలకూ బడుగులు త్యాగాలు చెయ్యడం ద్వారా ఒనగూడాలి! ఇదెక్కడి న్యాయం, ఇదెక్కడి అభివృద్ధి!

కార్పోరేట్లు వీలయినన్ని పరిశ్రమలు, కారిడార్లు స్థాపించాలి. పెట్టుబడులు విదేశాల నుండి ఇబ్బడి ముబ్బడిగా రావాలి. ప్రభుత్వం వాళ్ళకు కారు చవగ్గా భూములు కట్టబెట్టాలి. (ఆ భూములు కూడా నోరులేని వాళ్ళవో, ప్రభుత్వాల కింద ఉన్నవో అయి ఉంటాయి) పరిశ్రమలు స్థాపించి మన పిల్లలు కాలేజీల నుండి, అటు నుండి అటే ఉద్యోగాల్లో చేరిపోవాలి. ఇది అటు, ఇటుగా చాలా మంది కోరుకునే అభివృద్ధి. ముఖ్యంగా మధ్యతరగతి 'మోడీ' అభిమానులు కోరుకునే అభివృద్ధి! దానికోసం భారతదేశం వల్లకాడైపోయినా మనకు కించిత్తు చింత లేదు. మన సహజ వనరులైన ఖనిజాలు, సంపదా తరలించుకుపోతున్నా దిక్కులేదు.

అందుకే నాకేమనిపిస్తుందంటే! పల్లెటూళ్ళు నిలవ నీరు చందంగా కులాల, మతాల రొచ్చులో మునిగి పాచిపట్టిపోతే - పట్టణాలు మనసులు లేని రాతి మనుషులు నడిచే నరక కూపాలని! మధ్య తరగతి మానవులు ఈ రోజు జీతాల రూపంలో, వ్యాపారాల రూపంలో కట్టల, కట్టల డబ్బు రొంపిలో మునిగిపోయారు. అమెరికా వాడు బడుగు దేశాలను కొల్లగొట్టి తన దేశంలో జనం విలాసవంతంగా బతకడానికి ఎలా చూస్తున్నాడో, అదే నమూనా అన్నిచోట్లా ఆదర్శమయి పోయింది. మనం సుఖంగా ఉండాలి, ఎవడెట్లా పోతే మనకేం? ఇట్లా మామూలు వాళ్ళనుకున్నారంటే వాళ్ళ సంస్కారానికి ఒక నిట్టూర్పు వదిలి ఊరుకుంటాం!... కానీ ఉద్యమ పార్టీలూ, ప్రజల కోసం నిలబడే ఛాంపియన్స్‌మి మేమేననుకునే వాళ్ళు ఆ ఆదివాసీలను అట్లా గాలికి వదిలెయ్యవచ్చా?... వాళ్ళ గురించీ, పోలవరం గురించి మాట్లాడవద్దా?

విప్లవ రచయితలుగా మేమూ, మన సహజ వనరులను పయోగించుకుని, సమాజం అభివృద్ధి చెందాలన్నదే! పాత రాతి యుగంలో బతకడం ఆదర్శమనుకోవడం లేదు. అయితే అందుకోసం వీలయినంతగా విధ్వంసం తగ్గించి, ఆ విధ్వంసపు నష్టాన్ని సమాజం మొత్తం భరించాలన్నదే! బీల భూముల్లో అణుప్లాంటులు, ఓపెన్ కాస్టులు, భారీ నీటి నిల్వల పేరుతో ప్రాజెక్టులూ - అన్నీ జన నష్టానికే. మానవ హననం యుద్ధం వల్ల మాత్రమే జరగదు. ఈ రకమైన అభివృద్ధి వల్ల మరింతగా జరుగుతోంది. పర్యావరణం దెబ్బతిని నేలా, నీరూ, ఆకాశం కూడా కలుషితమైపోయి, మానవ మనుగడ ప్రశ్నార్థకమై పోయే 'అభివృద్ధి'ని వద్దని మాత్రమే కోరుకుంటున్నాం.

మాలాగే కోరుకునే మరికొంతమంది, పోలవరం ముంపు ప్రాంతాల సర్వే కోసం ఢిల్లీ, పంజాబ్‌ల నుండి వచ్చిన రీసెర్చి విద్యార్థులతో కలిసి ఏప్రిల్ 19, 20, 21 తేదీలలో ఆ ప్రాంతాలలో పర్యటించినపుడు... పోలవరం చుట్టూ ప్రకృతి దృశ్యాలు ఎంత కనువిందు చేశాయో... ఆ ఆదివాసీల మాటలు అంతకంటే ఎక్కువగా కన్నీళ్ళు పెట్టించాయి. వాళ్ళు రక్తం, కన్నీళ్ళు, హృదయం ఉన్న మనుషులు. వారికి 'రేపటి రోజు' లేకుండా పోవడమంటే మాటలా? --- వాళ్ళేం చెప్తున్నారో... ఎందుకు వారు తమ ఆవాసాలను వదలమంటున్నారో తెలుసుకుందాం.

ఆదివాసీ గూడేలు దూరంగా ఉండటంతో వాళ్ళను కలవడానికి ఎక్కువ ప్రయాణమే సరిపోయింది మొదటి రోజు. వేలేరుపాడు మండలం, బోళ్ళపల్లి గ్రామానికి వెళ్ళేటప్పటికే చిమ్మచీకటై పోయింది. ఖమ్మం జిల్లాలో మారుమూలన వీథిలో కరెంటు ఉంది. కానీ ఇళ్ళల్లో కరెంటు లేదు. ఉన్న ఆ ఒకటీ, అరా వీథి లైట్లూ, మేం వెళ్ళినప్పుడు ఆరిపోయాయి. అయినా గ్రామస్తులంతా పోగయ్యారు. ఇప్పటికే

మాలాంటి వాళ్ళను ఎంతమందిని చూశారో పాపం! 'ఏ పుట్టలో ఏ పాముందో!' ఈ వచ్చిన వాళ్ళలో ఒక్కరైనా ఈ పోలవరాన్ని ఆపక పోతారా అనే ఆశ వారికి ఏదో మూల ఉంది. అది ఎవరి చేతుల్లో ఉందీ? లేకుంటే మేమంత రాత్రి పూట వెళ్ళినా మాకోసం జమయ్యారంటే! ఏమనుకోవాలీ?

చాలా ఆసక్తిగా, నిజానికి చాలా ఆలసటతో కూడిన ప్రయాణమే అయినా అంత దూరం ఆ రాత్రి పూట వెళ్ళటానికి కారణం... ఆ చుట్టుపక్కల పదమూడు గ్రామాలు ఇటీవల జరిగిన జెడ్‌పిటిసి, ఎంపిటిసి ఎన్నికలు బహిష్కరించాయని తెలియడమే! మేం ఆ గ్రామస్తులను ఆ మాట అడిగితే... వాళ్ళు చెప్పిన జవాబు ఆసక్తిగానూ, 'జనం ఎట్లా ఆలోచిస్తారూ?' అని ఆశ్చర్యం అనిపించింది. "జెడ్‌పిటిసి, ఎంపిటిసిలు అంటే ఆంధ్రాకు సంబంధించినవే కదండీ! వాటికి ఓటేస్తే! మేం, ఆంధ్రాలో కలిసినట్టేగదా! మాకు ఇష్టం లేదండీ. అందుకే ఆ రెండిటీని బహిష్కరించామండి!" ... "ఇప్పుడు ఈ అసెంబ్లీ, పార్లమెంటులకు ఏం చెయ్యబోతున్నారు? మరి" అంటే – "వీటికి మేమొక్కరమే కాదు గదా! చానా ఊళ్ళు ఉంటాయి గదా! మేమేం చెయ్యలేమండీ!"

"ఆంధ్రాలో కలిస్తే మీకొచ్చే నష్టమేందీ? తెలంగాణ ఉన్నా, మీ గ్రామాలు మునిగిపోయేవే గదా!"... అంటే "నిజమేనండీ, ఏ రాయి అయినా ఒకటేనండీ! కానీ తెలంగాణాలో ఉంటే, అడివి భూములు చాలా ఉన్నాయి కదా! భూమికి భూమి ఎక్కడో ఓ చోట ఇస్తారని ఆశండీ! ఆంధ్ర లో కలిస్తే!" చంచా భూమి కూడా ఇవ్వరండీ" – వాళ్ళకే ఎక్కడి భూములు చాలవు కదండీ! అన్నాడు మంచా పోలయ్య అనే అతను. ఆ మాట చాలా ఆశ్చర్యమనిపించింది. ఎక్కడో మారుమూలనున్న ఆ గ్రామస్తులకు ఈ మాట ఎవరన్నా నేర్పారా? లేక వాళ్ళ అనుభవాలా? అని విచారిస్తే... అవి వారి అనుభవాలే. దాదాపు ఆ గ్రామాలన్నిటిలో ఇద్దరూ, ముగ్గురూ ఆంధ్రా నుండి వలసపోయిన, రెడ్డి, కమ్మ, వెలమ కులాల రైతులు – పదెకరాల నుండి యాభై ఎకరాల దాకా భూములున్న వాళ్ళు ఉన్నారు. ఆ వలస వచ్చిన ఆంధ్రా రైతులు అందరికంటే ముందు ప్రభుత్వానికి, భూములు ఇచ్చేసి, నష్టపరిహారం పుచ్చుకున్నారు. పట్టణాలకు వెళ్ళిపోయారు. ఇక, ఆ నష్టపరిహారం పొందడంలోని మతలబులు ఇక్కడ వద్దులెండి.

అయితే నష్టపరిహారానికి ముందే రైతులకు భూములు అమ్మేసి వెళ్ళిపోయిన వాళ్ళు... ఇది తెలిసి తిరిగి గ్రామానికి వచ్చి, ఆ డి.కె. పట్టాలను, తమ పేరుతో మామూలు పట్టాకింద మార్చుకుని – ఎకరానికి ఇచ్చిన లక్షా పదిహేను వేలల్లో, సగం వాళ్ళు తీసుకుని, సగం మాత్రమే భూమిని కొనుక్కుని సాగు చేసుకుంటున్న, అసలు రైతు చేతిలో పెట్టి పోయారు. ఇదీ చదువుకుని తెలివి ఉన్న వారి తెలివి తేటలు... ఇక ఆ గ్రామస్తులు ఎవరినైనా ఎట్లా నమ్ముతారూ?

ఆ గ్రామమే కాదు 'జీడిగుప్ప', 'కొటారికొమ్ము' ఆదివాసీలతో మాట్లాడినప్పుడు కూడా... అసలు నష్టపరిహారం ఎందుకు తీసుకున్నారని అడిగితే మాకేం తెలుసండీ... ఏవో కాయితాలు తెచ్చి వేలిముద్రలు వేయించుకున్నారని చెప్పారు. ఎంత డబ్బులు వచ్చాయని అడిగితే... ఏమోనండి ఇంతింత కట్టలు పెట్టెలో తెచ్చారు! (వాళ్ళకు అంత డబ్బు లెక్కకూ, ఊహకు కూడా అందని సంగతి). మరి ఆ డబ్బులు ఏం? చేశారంటే... మాకేం తెలుసు... ఆ జీపుల్లోనే ఎవరో బ్యాంకుల వాళ్ళనీ, ఎల్.ఐ.సి. వాళ్ళనీ చెప్పారు! మీ డబ్బులకు రెట్టింపు అవుద్దీ, అని మళ్ళీ వేలిముద్రలు వేయించుకుని ఆ జీపుల్లోనే తిరిగి తీసుకుపోయారూ?... మరి ఆ డబ్బులు వారికి ఎన్నడు, ఎవరు, పూచీపడి తిరిగి ఇస్తారో? తెలియదు. అసలు ఆ బ్యాంకుల వాళ్ళు, ఆ ఎల్.ఐ.సి. వాళ్ళు రాసుకుపోయిన అడ్రసుల్లో ఈ ఆదివాసీలు అప్పటికి ఉంటారో? లేదో కూడా అంతులేదు... చివరికి ఆ నష్టపరిహారాలు ఎవరి పాలిట 'లక్ష్మీ కాటాక్షం' కాబోతోందో గదా.

తోటపల్లి మండలం, తిపురపెంట అనే ఉళ్లో భూములు మునిగిపోయిన వాళ్ళకు డబ్బులిచ్చారు, కానీ ఇళ్ళు మునగడం లేదుగదా! అని ఇళ్ళకు నష్టపరిహారం ఇవ్వలేదు... భూములు మునిగాక ఇళ్ళుండి ఏం ఉపయోగం! మరికొందరికి, ఇళ్ళు మునిగి పోతున్నాయని ఇళ్ళకు డబ్బులిచ్చి ఇళ్ళు ఖాళీ చేసి పొమ్మంటున్నారు, మరి వారి భూములు మాటేమిటీ? ఇళ్ళు లేకుండా, గ్రామం పొందకుండా, పొలాల్లో ఎట్లా వ్యవసాయం చేస్తారూ? ఆ మాట అలా ఉంచండి! అసలు ఇక్కడి దాకానే భూములు మునిగి పోతాయని గీత గీయడానికి వీలవుతుందా? కొన్ని వందల టి.ఎం.సి.ల నీళ్ళు నిలవ ఉన్న చోట భూమిలోపలి పొరల్లో నుండి నీటి ఊట ఎంత మేరకు లాక్కుంటుందీ? ఆ మేరకు ఆ భూములు వ్యవసాయానికి అనువుగా ఎంత మేరకుంటాయీ? ఆ భూముల్లో, ఆ ఇళ్ళల్లో చీమల పుట్టలు, పురుగు పుట్రా తడిలాగినంత మేరకు భూమి నుండి తొలుచుకు వస్తాయి గదా! నేల గురించి తెలిసిన ప్రతి ఒక్కరికీ ఈ విషయం తెలుసు గదా! ఈ మాత్రం ఇంగితం... మనుషుల పట్ల కారుణ్యం లేని అధికారులను, ప్రభుత్వాలను ఏమనాలీ? ఇదంతా నష్టపరిహారాల చిత్ర విచిత్రం. వీలయిన కాడికి జనాన్ని ముంచడమే అభివృద్ధి.

సరే డబ్బులు తీసుకున్నాక మేం ఇక్కడి నుండి వెళ్ళమంటే ఎట్లా కుదురుతుందీ? అంటే "డబ్బులతో మాకేం సంబంధమూ? ఇక్కడ మునిగితే ఇదిగో ఈ కొండకు ఇంకా పైకి ఎక్కుతాం!" అని... కొండ కేసి చూపించారు. అతను గిరిజన పాఠశాలలో చదువుకున్నవాడు. "నువ్వు చదువుకున్న వాడివి గదా! అట్లా అంటావేమిటీ? ఏ భద్రాచలమో, ఖమ్మమో పోయి ఏదో ఒకటి చేసుకోవచ్చుగదా!" అన్నాం! ఈ కొండా, ఈ నదీ వదిలిపోతే – మేం ఉండేందుకు ఇళ్ళు, తాగేందుకు నీళ్ళు ఎవరిస్తారూ? టౌనులో తలదాచుకోవడానికి లేకుండా బతకడానికి వీలవుతుందా? మేం ఏ రోడ్లమీదో, చెట్లకిందో బతకాలి. అప్పుడు మమ్మల్ని అంతా దొంగల కిందే చూస్తారు గదా!" ఇదీ వారి బాధ.

నిజమే, మేము! పులిచింతల నిర్వాసితుల సమస్య మీద పని చేసినపుడు కూడా, ఇవే ప్రశ్నలు – అవే జవాబులూ వచ్చాయి. ఎందుకంటే అప్పటికే శ్రీశైలం డ్యాం, నాగార్జున సాగర్ డ్యాం నిర్వాసితులు, భూములు ఇళ్ళు కోల్పోయి... మాచర్లలోనో హైదరాబాద్‌లోనో రిక్షాలు లాక్కుంటూ, కూలి చేసుకుంటూ బతకుతున్న రైతు కూలీలూ, సన్నకారు రైతులూ సజీవంగా కనబడుతున్నారాయె! అందుకే ఎక్కడి నిర్వాసితుల కథయినా ఒకటేననిపించింది.

అతనే ఇంకో మాట కూడా చెప్పాడు. ఒకప్పుడు మా తాత

ముత్తాతలు ఆ కొండ చివర్లలో ఉండే వాళ్ళంట... ఈనాటికి మేం ఈ కొండ కిందికి దిగి వచ్చాం. అప్పట్లో కొండల మీద మట్టి పొర ఉండేదని... వాతావరణం మార్పుతో కొండ శిఖరాల్లో చెట్లు తగ్గిపోయి మట్టి కరిగి కిందికి దిగసాగింది. ఆ మట్టిపొర ఉన్నన్ని రోజులూ... అన్ని విత్తులు జల్లుకుంటే వారి జీవనానికి సరిపోయేవి. మట్టిపొర తగ్గిపోయిన కొద్దీ మట్టిపొరతో పాటు మా వాళ్ళూ ఈ కిందికి అడవిలోకి దిగి వచ్చారని చెప్పి.. చివరికి మేం మళ్ళీ మా పూర్వీకుల మాదిరి కొండలపైకి ఎక్కాల్సిందేనని! నిట్టూర్చాడు.

నువ్వే చెప్తున్నావు గదా! కొండలు ఇప్పుడు పంటలకు అనువుగా లేవని, కొండలపైకి చేరి ఏం చేస్తారూ? అంటే!..." చూడాల మరి, కిందికి దిగకుండా అట్లా పై తలంలోనే, కోనల్లో నుండి బయటికి పోయే మార్గాలను వెతుక్కోవాలి! లేకుంటే మా 'కొండరెడ్లం' చచ్చిపోతాం మేడం! ఈ మైదానాల్లో మేం ఏం చేసుకు బతుకుతాం! బిచ్చమెత్తుకోలేం... ఇదీ వారి ఆవేదన.

అతనా మాటలు చెప్తున్నప్పుడు కొండలకేసి తలెత్తి చూశాను. చుట్టూ చూపు ఆనినంత మేరా ఒకదాని వెంట ఒకటి తూర్పు కనుమలు వరసలు తీరి ఉన్నాయి. నిజమే ప్రకృతి రహస్యాలు ఛేదించడంలో ఆదివాసీలదే ప్రథమ పాత్ర. ఆదిమానవుడు కొండల గుండా, నదీ ప్రవాహాల వెంటా మిగిలిన ప్రపంచాన్ని ఎట్లా అన్వేషించి ఉంటాడూ? ఆఫ్రికా నుండి మొత్తం భూగోళమంతా ఎట్లా వ్యాపించి ఉంటాడూ?

జీడిగుప్పలో ఆరు బయట ప్రదేశంలో విశాలంగా వ్యాపించి ఉన్న ప్రాచీనమైన రావిచెట్టు కింద గ్రామస్తులతో పాటు ఆ చెట్టు చుట్టూ అల్లుకు పోయిన పాదంలాగా ఉన్న దాని మొదలు మీద కూర్చుంటే - ఓ వైపు కొండలనానుకుని ప్రవహిస్తున్న గోదావరి. కుడివైపు మరో కొండ మధ్యలో ఎత్తు మీద ఆ గ్రామం. ఎంత ప్రకృతి కమనీయ దృశ్యం. నిజంగా ఇట్లాంటి చోటు వదులుకోని పోవడం నిజంగా ఎంత దురదృష్టం అనిపించింది.

"అవునమ్మా! పోలవరం మాట అంటేనే గుండెల మీద భయం ఏర్పడింది" అన్నారు. చంద్రబాబు మొదలు పెట్టినా, అందరూ గొడవ చేస్తే ముందుకు రావడానికి జంకారు. ఇదిగో ఈ రాజశేఖరరెడ్డి వచ్చి ఎవరెన్ని అడ్డు చెప్పినా... లెక్కలేనట్టు ఎదురులేకుండా చేశాడు. గ్రామసభలు జరపలేదు. జరిపిన గ్రామసభల్లో 'మాకొద్దు పోలవరం' అని తీర్మానం చేస్తే - అదంతా కొట్టి పారేసి, గ్రామస్తులంతా అభ్యంతరం లేదన్నారని అబద్ధాలు రాసుకున్నారు. అసలు మేమే తీర్మానాలు చేసుకుని మండలంలో ఇచ్చి వచ్చాం - దాన్ని తొక్కి పెట్టారు. ఇంత అన్యాయం ఎవరూ చెయ్యలేదు." అని బాధగా చెప్పారు.

అంత బాధలో కూడా ఆ కోయల నుండి గానీ, కొండ రెడ్ల నుండీ గానీ - ఒక్క పరుష పదజాలం వినలేదు మేం! మన మైదాన ప్రాంతాల్లో (ఆంధ్రా గానీ, తెలంగాణా గానీ) ఇంత నష్టం జరుగుతుందంటే - ఊళ్ళు ఖాళీ చెయ్యాల్సి వస్తుందనుకుంటే, ఎట్లా రియాక్టు అవుతారంటే - ఆవేశంగా, పెద్ద పెద్ద డైలాగులు, "నరుకుతాం, బొంద బెడతాం" అన్నట్టే మాట్లాడతారు. పులిచింతలప్పుడు చూశాం గదా! స్త్రీలు సహితం ఎంత ఆవేశపడేవాళ్ళో! నిజానికి ఆ ఆవేశమంతా ఆచరణలో ఉంటుందనుకోలేం! కానీ ఆదివాసీలు మాత్రం తమకు జరగబోయే నష్టం పూడ్చలేనిదని గుర్తించినా! నెమ్మదిగా చిన్న చిన్న మాటలు తుంచి మాట్లాడుతారు. వాళ్ళది సానుకూల భాష, సహకార భాష. ఆ పరిమితిలోనే వాక్యాలుంటాయి. పురాణ ప్రగల్భాలు భాషలో లేవు. వారిది సంస్కృతంతో నిండిపోయిన తెలుగు కాదు... మామూలు ద్రావిడ భాష మూలం నుండి విడిపోని తెలుగు. వాళ్ళకు జరిగే నష్టం వారిని కుంగదీస్తుంది. ఎదిరించడానికి సిద్ధపడతారు కానీ పెద్ద భారీ ఆవేశం పొందరు. భాషకూ వారిదైన స్వచ్ఛతను పొందించుకునే ఉంది. అలాంటిది 'మాటలతో వైకుంఠం చూపించే వారి ప్రజ్ఞలను వాళ్ళెట్లా నిభాయించ గలరూ? ఎంత మోసపోయారు పాపం! ఒడ్డున పడ్డ చేపలే గదా!

అదే కాదు వారిదైన జీవనశైలి కూడా ప్రత్యేకంగా ఉంది. వారిది ఉమ్మడి జీవితం, సహకార జీవితం, స్వతంత్ర జీవితం " ఈ అడవిలో ఏం దొరుకుతాయి? చక్కగా పట్టణాలకు పోయి, చదువుకుని, ఉద్యోగాలు చేసుకుంటూ బాగా బతుకొచ్చు కదా!" అన్న మాటకు 'వల్ల జనార్ధనరెడ్డి' అనే ఆదివాసీ చెప్పిన సమాధానం చాలా అబ్బురంగా ఉంది. "మాకు ఇక్కడ దొరకనివి ఏమున్నాయి? వ్యవసాయపు కూలీ పనులు అయిపోతే, అడివి మీద బతుకుతాం... జిగురు, తేనే, కుంకుళ్ళు, చీపురు పుల్లలు, తంగేడు, విప్ప విత్తులు ఒక్కటేమిటి? ఎన్ని రకాలు దొరుకుతాయి ? మా కొండ రెడ్లు కరువున బడి చచ్చిపోయిన దాఖలా లేదు. అడవి తల్లి కడుపులో పెట్టుకుని కాపాడుతుంది. చుట్టూ వున్న తాటి చెట్లు చూపిస్తూ ఈ తాటి కల్లు, ముంజలు ఎంత బలం, మామిడి కాయలు, సీతాఫలాలు ఎన్ని తింటాం!"

ఆ జవాబుకు మరో మాటను జత చేస్తూ! "పిల్లా, తల్లీ ఆదివాసికి అడివికి పోయామంటే... కాయా, కరుజో కడుపునిండా తిని వస్తాం. అంత పిట్ట కొట్టుకుని వచ్చామంటే, అదే చాలు!... పిల్లలకూ, ఆడోళ్ళకూ మేమే తెచ్చి పెట్టాలన్నది లేదు. ఎవరి తిండి వాళ్ళం సంపాదించుకుంటాం. అట్లాంటిది ఈ అడివిని వదిలి ఎట్లా బతకాలీ?"

ఎంత అద్భుతమైన జీవితం. ఓ వ్యక్తి మీద కుటుంబం అంతా ఆధారపడి ఎదురు చూడరు. మన మధ్య తరగతి సమాజాల్లో ఉద్యోగంగానీ, వేరే ఉపాధి సంపాదన లేక పోవడం... "భరించేవాడు భర్త అన్న పదం నెత్తిన పెట్టుకుని... వాడు పడే నానా అగచాట్లు... ఒక్కోసారి జాలిగా కూడా అనిపిస్తాయి. మగవాళ్ళంతా హాయిగా ఉంటున్నారనే భ్రమలో మనం ఉండనక్కరలేదు. కుటుంబ బాధ్యత పేరుతో అప్పుల పాలయి, ఆత్మహత్యలు చేసుకోవడం మన కంటి ముందున్న దృశ్యం.

కానీ ఆదివాసీలు మాత్రం ఎవరి పోషణ వాళ్ళు చూసుకోగలరు. ప్రకృతిలో కలిసిపోయిన పక్షులూ, జంతువుల్లాగే, ప్రకృతితో మమేకమైన మానవులు కూడా అంతే గదా! ఇది కదా సమాజానికి కావలసిందీ?.... కానీ పెత్తనం, ఆధిపత్యం మూలకణంగా ఉన్న మన సమాజంలో మగవాడు బోనులో ఇరుక్కుంటున్నందుకు మనం చెయ్యగలిగిందేమీ లేదు.

అయితే ఇందులో ఇంకో అంశం కూడా ఇమిడి ఉంది. ఒకరి మీద ఒకరు ఆధారపడి ఉండని మాట నిజమేగానీ, అంత మాత్రాన

ఎవరి బతుకులు వాళ్ళవి కాదు. వారిది సమిష్టి సమాజం, ఉమ్మడి జీవితాలూ. అడవికి పోయి వెదురు, దుంపలు, తేనే వంటివి ఏది తెచ్చుకోవాలన్న ఒంటరిగా పోరు. ఇంటిలో వాళ్ళే, తమతోటి వాళ్ళతోనే కలిసి పోతారు. ఇంటికి వచ్చాక కూడా వెదురు చీల్చడం, అల్లడం వంటివి అందరూ కలిసే చేసుకుంటారు. "అసలు అడవి మీద బతకడం అంటేనే సామూహిక జీవితం అనే" అన్నాడు రాజిరెడ్డి అనే అతను.

మేం ఇట్లా మాట్లాడుతుండగానే ఆ ఇంటామె ఒక పళ్ళెంలో తొమ్మిది రకాల గింజలు తెచ్చి మాముందు పెట్టింది. ముందు మాకు అర్థం కాలేదు. ఓ క్షణం తరవాత బుర్ర వెలిగింది. ఎంత అద్భుతమైన ఎక్స్‌ప్రెషననిపించింది. నోటితో ఆమె ఏమీ చెప్పలేదు, కానీ వాళ్ళకు లభించే ఆహార పదార్థాలను సాధికారకంగా నిరూపించింది. జొన్నలు, రాగులు, కందులు, మొక్కజొన్న, పెసలు, ఇప్పగింజలు, జీడిగింజలు ఇవన్నీ. ఇవి డైరెక్టుగా ఆహారానికి పనికి వచ్చేవి. అమ్ముకోవడానికి పనికి వచ్చేవి వేరేవి, పైన చెప్పినవి. ఎంత సృజనాత్మకమైన చేతన!

ఇటువంటి సమాజాన్ని చూసి కదా కొశాంబీలాంటి చరిత్రకారులు చరిత్రను వ్యాఖ్యానించిందీ! మరి అటువంటి సమూహాలను పట్టు పట్టి ధ్వంసం చేయడం ఎంత నేరం? భారతదేశ ప్రత్యేకతగా ఉన్న ఇటువంటి చారిత్రక జీవితాలను రూపు మాపుకుందామా? ఆదివాసీల బాధా వేదనా ఒక ఎత్తు కాగా! ఇలా ఆలోచిస్తుంటే ఆదివాసీలలో ఇంకా మిగిలి ఉన్న తొలి సమాజపు సమిష్టితత్వం - మనకో సజీవ చరిత్ర పాఠం కాదా? ఇలాంటి ప్రకృతి జీవితాలను అభివృద్ధి పేరుతో ధ్వంసం చేయడం, జ్ఞానం కలిగిన పనేనా?

ఈ మాటలను అందుకుంటూ ముర్ల కనకారెడ్డి అనే అతను వీటన్నిటి కంటే మరో గొప్ప విషయం చెప్పాడు. "మాకు రేపటికి తిండి ఎట్లా అన్న చింత లేదు... రేపు దొరకదనీ, దాచుకోవాలనీ భయం లేదు. ఈ రోజు తిన్నాం, రేపు తింటాం! గుడిసెలో ఏం లేకపోతే, అడివికి పోతాం! ఏదో ఒకటి కడుపు నింపుతుంది. తినేవి దొరికితే అక్కడే తింటాం. అమ్మేవయితే అమ్ముకుంటాం రేపటికి నిలబెట్టడంకోసం ఆరాటపడం" అని అన్నాడు. కానీ చింతూరుకో, భద్రాచలానికో పోతే మాకు అట్టా ఎలా దొరుకుతుందీ? మాకేమన్నా భూములా?

నిజమే వాళ్ళ ముత్తాత తాతల నుండి కూడా ముందు నాలుగు తరాలకు సంపాదించి పెట్టిపోవాలన్న ఆలోచన లేని అనాగరికులు, మనలాగా ఆధునిక సామాజికులు కారు. అంతా మేమే బొక్కాలన్న అత్యాశాపరులు కాదు. బహుశా మన మైదానాలకు వచ్చాక నాగరీకులం కదా! వాళ్ళకు ఇటువంటి పాఠాలు నేర్పి మనలో కలుపుకుందాం! అదలా ఉంచి, వారి జీవన శైలిలో ఎంత వైవిధ్యం. వారికి ఈ రోజు వాస్తవం. రేపు అన్వేషణ. ఈ సంస్కృతిని వాళ్ళు ముందు ముందు మర్చిపోవాల్సిందే! మైదానాల్లో రేపటికి ఆలోచించకపోతే కుళాయి నీళ్ళు కూడా దొరకవు! పాపం వాళ్ళు బయటికి వస్తే చచ్చిపోక ఏమవుతారూ?

ఇట్లా అభివృద్ధి పేరుతో ఉన్నవారి కోసం సకల ప్రకృతి వనరులనూ దోచి పెడుతున్నాం. గంధం చెక్కల కోసం అడవుల దహనం, ప్లాంటేషన్ పేరుతో నీరంతా లాగి పారేసే యూకలిప్టస్, సుబాబుల్ వంటి వనాలు, చివరికి ఆ అడవులనూ నాశనం చేసుకుని మనిషి మనుగడను ప్రశ్నార్థకం చేసుకుంటున్నాం. ఇవి ఏ శాస్త్రవేత్తలకూ పట్టడం లేదు. ఈ ఖాండవ దహనాలు. బడుగు జీవులను తరిమి వెయ్యడానికే. అభివృద్ధి, ఉద్యోగాలంటూ మధ్య తరగతి వాళ్ళను ఊరించి... బాక్సైట్ వంటి ఖనిజాలు తవ్వుకొని పోవడమే కార్పొరేట్ వ్యాపారుల లక్ష్యం.

ఇక ఇంటర్‌నెట్, కంప్యూటర్ల పేరుతో మన బుర్రలూ, జీవితాలూ అమెరికా వాడి చేతుల్లో పెట్టి.... వాడు చెప్పిన అభివృద్ధినే మనమూ ప్రచారం చేస్తున్నాం. సహజ వనరులూ, ఖనిజాలు సర్వం విదేశాలకు అమ్మి వేస్తున్నాం. భారతదేశాన్ని 'కరిమింగిన వెలగపండు' లాగా మట్టి కూడా మిగలకుండా చేసుకుంటామేమోనని భయం వేస్తుంది. సామ్రాజ్యవాది ధనదాహానికి ఏదీ అవసరం లేనిది లేదు.

నిజానికి ఇప్పుడీ పోలవరం మన అవసరాలకయితే ఇంత విధ్వంసం అవసరం లేదు. కానీ కోస్టల్ కారిడార్ పేరుతో రాబోతున్న పారిశ్రామిక వాడలకు ఈ నీళ్ళు అత్యవసరం. కానీ ఈ కోస్టల్ కారిడార్ పేరుతో సంపద్యంతమైన, పచ్చని పంట పొలాలనూ, సీమాంధ్ర తీర ప్రాంతాలనూ కలుషితం చేసి నాశనం చేయడానికి వస్తుందనేది... తెలిసినా మాట్లాడని రాజకీయ వేత్తలనూ, శాస్త్రజ్ఞులనూ, పర్యావరణవేత్తలనూ చూసి సిగ్గుపడదాం!

ఈ పోలవరం ఆంధ్రులకు వరం కాదు, విషమని ప్రజలకు తెలియ చెబుదాం. మృతప్రాంతంగా మారబోతున్న తీరాంధ్ర ప్రాంతాన్ని కాపాడుకుందాం.

(ఏప్రిల్ 19, 20, 21 తేదీలలో అఖిల భారత కమిటీలో భాగంగా విరసం, నిర్వాసితుల ప్రాంతాలలో - సర్వేలో పాల్గొన్న సందర్భంగా)



# అమరం, అజరామరం

- ఎన్.డి.

అమరుల స్మృతులు పిడికెడు మందిని భయపెడతాయి, భీతావహుల్ని చేస్తాయి, వణికిస్తాయి, పీఎల్‌జీపీ దెబ్బపడ్డ కాపలా కుక్కల్లా వెనక్కాళ్ల మధ్య తోకను ముడుచుకొని కుంయి, కుంయి మనేలా చేస్తాయి, గడీ తలుపులు బద్దలుకొట్టుకొచ్చిన రైతాంగం ధాటికి మంచం కింద దూరిన భూస్వామిలా చెమటలు కక్కేలా చేస్తాయి, కోపాన్ని తెప్పిస్తాయి, గంగవెర్రులెత్తిస్తాయి.

అమరుల స్మృతులు అత్యధికుల్ని కన్నీళ్లు పెట్టిస్తాయి, ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి, అబ్బురపరుస్తాయి, ఆలోచనలో పడేస్తాయి, సత్యాన్వేషణకు పురికొల్పుతాయి, ఉత్తేజితుల్ని చేస్తాయి, లేచి నిలబడేలా చేస్తాయి, ధిక్కారంగా మారుస్తాయి, తిరగబడేలా చేస్తాయి, శాస్త్రీయతను అలవర్చుకునేలా చేస్తాయి, విప్లవించేలా చేస్తాయి.

అమరుల స్మృతులు పిడికెడుమందికి ధ్వంసం చేయదగినవి, నామరూపాలు లేకుండా చేయాల్సినవి, ఉనికిలో వుండనేకూడనివి, అసలు పుట్టకూడనివి, పుడితే పురిట్లోనే సంధి కొట్టాల్సినవి.

అమరుల స్మృతులు అత్యధికులకి పదిలంగా గుండెల్లో దాచుకో దగినవి, భయం పంజరం తలుపుల్ని ధడాల్న తెరిచి పక్షుల్లా ఎగరేయాల్సినవి, సర్వకాల సర్వావస్థల్లో స్ఫూర్తినిచ్చే ఎర్రజెండాలా రెపరెపలాడాల్సినవి, స్థూపంలా లొంగుబాటు లేకుండా నిటారుగా నిలవాల్సినవి, నలుగురితో పంచుకోవాల్సినవి, జీవనసత్యాలుగా పదే పదే అధ్యయనం చేయాల్సినవి, తర్వాతి తరాలకు వారసత్వంగా అందించాల్సినవి.

పిడికెడుమంది వాటిని బెదిరింపు తూటాలతో ఖతం చేయాలనుకుంటారు.

అవి అత్యధికుల విప్లవాకాంక్ష అనే బులెట్‌ప్రూఫ్ జాకెట్టును తొడుక్కుంటాయి.

స్వార్థం, లోభం, లాభం ధగద్ధగల్తో కళ్లు మిరిమిట్లు గొలిపి వాటిని కనుమరుగు చేయాలని వాళ్ల ప్రయత్నం.

కారడవుల్లో కాళరాత్రుల్లో ఆదివాసీ గుడిసెలో వెచ్చదనాన్ని పరుస్తూ కణకణలాడే నిప్పులా వెలుగుతూనే ఉండడం వాటి లక్షణం.

విప్లవకారులు పిడికెడుమందికి అతి పెద్ద అంతర్గత ముప్పు.

కానీ 'సమస్య' ఏంటంటే అమరులయ్యాక వాళ్లు మరింత పెనుముప్పు.

పిడికెడుమందికి విప్లవకారులు బతికున్నా భయమే, వాళ్లను చంపేసినా భయమే. మరింత, మరింత, భయం, భయం.

ఏదో మూల ఎవరికీ తెలీకుండా, వూరూ, పేరూ లేకుండా, 'అనామక' ప్రజల మధ్య మరింత 'అనామకంగా' పని చేస్తున్న విప్లవకారులకు ఒక స్థానికత ఉంటుంది. ఒక నిర్దిష్టత ఉంటుంది. వాళ్ల పనికో ప్రాంతముంటుంది. ప్రభావానికో పరిధి ఉంటుంది. పిడికెడుమందికి వీరే అన్నిటికంటే ప్రమాదకరం, వీరే అసలు ప్రమాదకరం.

ఊరికే జరగవు మరి కోవర్టు, హంతక ముఠా, బూటకపు ఎన్‌కౌంటర్ హత్యలు, సామూహిక మానవహననాలూ, విధ్వంసాలూ, అత్యాచారాలూ.

కానీ 'సమస్య' ఏంటంటే చనిపోయాక వాళ్లు ఒక్కసారిగా అందరికీ తెలిసిపోతారు, అందరివాళ్లయిపోతారు. వాళ్లకో ఊరూ, పేరూ వచ్చేస్తాయి, వాళ్ల జీవితాలు తెరిచిన పుస్తకాలైపోతాయి, వారిక ఎంతమాత్రం 'అనామకులు' కారు. వాళ్ల నిర్దిష్టత విశ్వజనీనమౌతుంది. వాళ్లకిక ఓ ప్రాంతమూ, పరిధీ ఉండవు. వాళ్లు భూమి తనపై కప్పుకున్న ఆకాశంలా సర్వవ్యాపితమైపోతారు.

అమరుల స్మృతులు నూతన మానవులను పరిచయం చేస్తాయి. నూతన మానవులు ఆవిర్భవించడం సాధ్యమే అని చెప్తాయి. నూతన మానవులు ఆకాశం నుండి కాక ఒక గతితార్కిక చలనక్రమంలో భాగంగా ఒక చారిత్రక ఆవశ్యకతగా ఎలా పుడతారో చెప్తాయి. సరిగ్గా అందువల్లే మనమూ నూతన మానవులు కావచ్చునని తిరుగులేని రుజువులిస్తాయి. 'అన్నిటికంటే ప్రమాదకరం'గా మనల్ని నూతన మానవులు కమ్మని ప్రేరేపిస్తాయి.

స్మృతుల్ని చంపేయాలనుకోవడానికి ఇంకెన్ని కారణాలు కావాలేం?

మనిషిదేముంది ఓ ప్రాణం ఉంటుంది, దాన్ని తీసేయచ్చు.

మనిషిదేముంది ఓ రూపం ఉంటుంది, దాన్ని రూపుమాపచ్చు.

మనిషిదేముంది ఓ గుండె ఉంటుంది, దాన్ని గురి చూసి కాల్చేయచ్చు.

మనిషిదేముంది ఓ మెదడు ఉంటుంది, దాని ఆలోచనను ఆపేయచ్చు.

మనిషిదేముంది ఓ శరీరం ఉంటుంఎ, దాన్ని పంచభూతాల్లో కలిపేయచ్చు.

స్మృతులలా కాదే, ప్రాణం తీయడంతోనే సజీవమౌతాయి.

స్మృతులలా కాదే, రూపుమాపడంతోనే రూపుదిద్దుకుంటాయి.

స్మృతులలా కాదే, కాల్చిన తర్వాతే కొట్టుకులాడ సాగతాయి.

స్మృతులలా కాదే, ఆపేసిన బిందువు నుండే సృజనగా మారతాయి.

స్మృతులలా కాదే, కలిపేసిన దగ్గరి నుండే వ్యాపించడం మొదలెడతాయి.

'సమస్యంతా' స్మృతులతో ముడిపడిన భావజాలంతో, భావాలతో, భావనలతో, సిద్ధాంతాలతో, విశ్వాసాలతో కదా.

'సమస్యంతా' భౌతికంగా లేకుండా భౌతికశక్తిగా మారేవాటితో కదా.

'సమస్యంతా' విశ్వజనీన సత్యాలు ఈ నేలమీద నిర్దిష్టత సంతరించుకోవటంతో కదా.

'సమస్యంతా' స్పార్టకస్, వరీనియాల నుండి భగత్సింగ్, పంచాది నిర్మలల వరకూ చల్లిపోయిన విత్తనాలు భూమి లోతుల్లో భద్రంగా ఉండడంతో కదా, వాటిని ఈ భూప్రపంచంలో ఎవరూ నాశనం చేయలేనితనంతో కదా.

'సమస్యంతా' తోడినకొద్దీ మరింత నిర్మలంగా నిండే చెలిమలా అవి రక్తంతో తడిసినకొద్దీ మరింత అనుభవంతో, శాస్త్రీయతతో మొలకెత్తడంతో కదా, ఆ మొలకలు ఆ స్మృతుల్నే ఎరువుగా చేసుకుని మరింత ఏపుగా పెరగడంతో కదా.

ఊరికే జరగవు మరి అమరుల పుస్తక ప్రచురణలపై అధికార, అనధికార నిషేధాలూ, బెదిరింపులూ, 'హిట్ లిస్టు'ల తయారీలూ, అరెస్టులూ, స్థూపాల కూల్చివేతలూ, జులై 28 అమరుల సంస్మరణ సభలపై ఉక్కుపాదాలూ.

జులై 28 అంటే పిడికెడుమందికి చెరిపేయాల్సిన జ్ఞాపకాలూ, జరగనివ్వకూడని సంస్మరణలూ, కూలగొట్టాల్సిన స్థూపాలూ, నలిపేయాల్సిన ధిక్కారాలూ, నిషేధించాల్సిన పుస్తకాలూ, వ్యాపించనీయకూడని సిద్ధాంతాలూ, గమ్యం చేరనివ్వకూడని సందేశాలూ, అన్నిటికంటే ముఖ్యంగా నడవనివ్వకూడని అడుగుజాడలూ.

జులై 28 అంటే అత్యధికులకి

ఒక జ్ఞాపకం. భారతదేశ చరిత్రను సమాజ గతి సూత్రాలకు అనుగుణంగా మలుపు తిప్పిన ఒక మహోన్నత మానవుడి జ్ఞాపకం. ఆయన పిలుపునందుకుని ఉవ్వెత్తున ఎగసిన ఒక తిరుగుబాటు జ్ఞాపకం. నిప్పురవ్వను దావానలంగా మార్చి వసంత కాల మేఘగర్జనను వినిపించిన చారుమజుందార్ నెత్తుటి అమరత్వపు జ్ఞాపకం. భారతదేశపు నలుమూలలా దాన్ని తమ ఊపిరితిత్తులతో ఊది ఊది వ్యాపింపజేసిన వందలాది నక్సల్బరీ వీరుల సామూహిక జ్ఞాపకం. నక్సల్బరీ వారసులుగా భారతదేశ విముక్తి కోసం వర్గపోరులో నేలకొరిగిన వేలాది స్త్రీ పురుషుల, పిల్లల, వృద్ధుల జ్ఞాపకం.

ఒక సంస్మరణ. అమరుల త్యాగమయ జీవితాల్ని సంస్మరించుకోవడం. ఉద్యమ పురోగమనంలో ఆ త్యాగాల పాత్రను సంస్మరించుకోవడం. వారి జీవితాలనుండి నేర్చుకోవలసిన, అనుసరించాల్సిన వాటినన్నింటినీ గుదిగుచ్చుకోవడం, పదిలంగా గుండెల్లో దాచుకోవడం. వారి జీవితాల్నుండి ఉద్యమాన్నర్థం చేసుకోవడం, ఉద్యమం నుండి వారి జీవితాల్ని విశ్లేషించుకోవడం.

ఒక ధిక్కారం. శత్రువు నిర్మించిన ఫాసిస్టు బ్యారికేడ్లను కూలగొట్టడం. అమరుల నిలువెత్తు జ్ఞాపికలుగా స్థూపాలను నిర్మించుకోవడం. తమ కన్నబిడ్డల్లాంటి విప్లవకారులను కాల్చివేసినప్పుడు యాదృచ్ఛికంగా ఎగసే నిరసన కెరటాల్ని చైతన్యయుతమైన ప్రవాహంగా మలుచుకోవడం. ప్రజలకు జ్ఞాపకాలుండకోడదు అన్నవాడికి ప్రతి ఏటా దానిని మర్చిపోనివ్వకుండా చేయడం. నిర్బంధపు చీకట్లను చీలుస్తూ 'దీపాల నృత్యం' చేయడం.

ఒక ఆయుధం. వీరుల జ్ఞాపకాల్నే ఇంధనంగా నింపిన విమానాలతో సామ్రాజ్యవాద, దళారీ పాలనల ట్విన్ టవర్స్ గుండెల్లోకి దూసుకెళ్లడం. జైలు గోడల మధ్య నుండి, పొలాలనుండి, గనుల నుండి, కర్మాగారాలనుండి, బస్తీలనుండి, అడవినుండి, మండుతున్న గుండెలనుండి ఏకకాలంలో, ఒకే టార్గెట్ను గురి చేస్తూ కోట్లాది మిస్సైళ్ల సమూహాల్ని సంధించడం.

ఒక సిద్ధాంతం. ఉద్యమం ఆటులో వున్నప్పుడు నిరాశను దరిజేర్చనివ్వనిది. ఉద్యమం పోటులో ఉన్నప్పుడు గర్వాన్ని తలకెక్కనివ్వనిది.

ఒక సందేశం. దానికి ఎల్లల్లేవు. సరిహద్దుల్లేవు. అడ్డంకుల్లేవు. లేజర్ కిరణం కన్నా వేగంగా, సూటిగా, కాంతివంతంగా ప్రజల గుండెల్లోకి దూసుకెళ్లగలదు. ప్రపంచపు నలుదిక్కులా తన వాణిని వినిపించగలదు. శత్రువును వణికించగలదు.

ఒక ఆచరణ. సందర్భం మాటలదే అయినా మాటతో ఆగనిది. ఆగలేనిది. ఆగనివ్వనిది. ఆగకూడనిది.

ఒక నివాళి. శత్రువుకు తల వంచనివారికి తలవంచి జోహార్లర్పించడం.

జులై 28ని చంపేస్తానని రంకెలేస్తూ రంపపు ముక్కుల్నీ, ఉక్కుగోళ్లనూ, ఇనుపరెక్కల్నీ పదునుదేర్చుకుని పిడికెడుమంది ప్రతినిధిగా రాజ్యం డేగ ప్రతీ ఏడాదీ విప్లవ ప్రజానీకం మీదకు రివ్వున ముంచుకొస్తుంది.

మళ్లీ ఏడాది కూడా అది రాకతప్పేలా చేస్తారు అత్యధికులు. అలాగే మరో ఏడాది, మరో ఏడాది...

అమరుల స్మృతుల్ని ప్రచురించవద్దనీ, ప్రచురిస్తే చంపేస్తామనీ బెదిరింపులు చేస్తుంది రాజ్యం డేగ. చంపి చూడు, మళ్లీ స్మృతులుగా పైకెగుస్తామంటారు అత్యధికులు. అలాగే మరో పుస్తకం, మరో పుస్తకం...

స్మృతులను ఆర్పేయాలనుకునేవారికీ, స్మృతులను సజీవంగా నిలపాలనుకునేవారికీ మధ్య ప్రతి స్థలంలో, ప్రతి కాలంలో, ప్రతి నేల మీదా, ప్రతి సమయంలో, ప్రతి రంగంలో, ప్రతి తలంలో, ప్రతి పొరలో నిరంతర పోరాటం.

ఒకవైపంతా పిడికెడుమందికి చెందిన సమస్త సైనికశక్తి, ఒకవైపంతా అత్యధికులకు చెందిన కొన్ని ఊసులూ, జ్ఞాపకాలూ, స్మృతులూ, గురుతులూ, తలపోతలూ, వలపోతలూ, పలవరింతలూ, కాసిని కన్నీళ్లూ, మరిన్ని వెక్కిళ్లూ...వర్గసమాజ చరిత్ర అంతటా ఏ మార్పూ లేకుండా ఇవే బలాబలాల మోహరింపులు. వర్గసమాజ చరిత్ర అంతటా ఏ మార్పూ లేకుండా అంతిమంగా ఈ యుద్ధంలో ఓటమెప్పుడూ పిడికెడుమందిదే, గెలుపెప్పుడూ అత్యధికులదే, ఏ మార్పూ లేకుండా ఇక ముందూ అంతే.

బహుశా ప్రపంచంలో వ్యూహాత్మకంగానూ, ఎత్తుగడల పరంగానూ కూడా ఒకవైపంతా అనుకూలం, మరోవైపంతా ప్రతికూలం, ఒకవైపంతా బలం, మరోవైపంతా బలహీనత, ఒకవైపంతా విజయం, మరోవైపంతా అపజయం వుండే ఏకైక యుద్ధం ఇది.

ఇది వర్గపోరాటమంత పురాతనమైనది. స్వార్థానికీ, నిస్వార్థానికీ ప్రతిక్షణం నిరంతరంగా జరిగే పోరాటమంత నిత్యనూతనమైనది.

స్మృతులు స్మృతులుగానే ఉండిపోవు. పిడికెడుమంది భయపడ్డంత పనే అవుతుంది. అవి భౌతికరూపంలోకి పరివర్తన

# 'నా స్ఫూర్తిని చంపలేరు...'

- పాణి

గంటి ప్రసాదంగారిది విప్లవోద్యమంలో అరుదైన మూర్తిమత్వం. ఈ మాటకు అనేక మంది వలె ఆయన కూడా పూర్తి అర్హుడు. 2004లో అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం సీపీఐఎంఎల్ పీపుల్స్‌వార్, జనశక్తి పార్టీలతో శాంతి చర్చలకు సిద్ధమైన సమయంలో నల్లమలలో ఆయనను సాయుధంగా తొలిసారి చూశాను. అప్పుడు నేనూ, నా మిత్రుడు ప్రయాణంలో చదువుకోడానికి విశ్వనాథ సత్యనారాయణ రాసిన ఏకవీర నవల పట్టుకెళ్లాము. దాన్ని చూసి ఒక మావోయిస్టు గెరిల్లా 'మీరు ఈ పుస్తకాలు కూడా చదువుతారా?' అని అడిగారు. దానికి అక్కడే ఉన్న కేంద్ర కమిటీ నాయకుడు అజాద్ వెంటనే 'మనకు టైం లేక చదవడం లేదుగాని సాహిత్య రంగంలో పనిచేసే వాళ్లు తప్పక అన్నీ చదవాలి. ఈ నవల సంగతేమో ఇప్పుడు నేను చెప్పలేనుగాని వేయిపడగలు నవల వలసపాలన కాలంలోని సామాజిక పరిణామాలను అద్భుతంగా చిత్రించింది. కాకపోతే ఆయన తన రియాక్షనరీ బ్రాహ్మిణికల్ దృష్టితో రాశాడు... అన్నాడు.

ఆ చర్చను కొనసాగిస్తూ ప్రసాదంగారు... "ఏకవీరలో కూడా ఆయన యువతీ యువకుల మధ్య ప్రేమ పాపపంకిలమని, పెళ్లి అనే ముందస్తు దైవ నిర్ణయానికి వ్యతిరేకమని చెప్పదలిచాడు. కానీ ఆయన నిమిత్తం లేకుండానే ఆ పాత్రలు అత్యంత ప్రేమ జీవులుగా రూపొందాయి. జీవితంలో ప్రేమ అలాంటి వాస్తవం. అందుకే ఆ నవల అంతా గొప్ప ప్రేమ పరుచుకుంది..." అన్నారు.

ఇరవై ఏళ్ల వయసులో నేను నక్సలైట్ల మీద మనసు పారేసుకోడానికి అప్పట్లో పరిచయమైన పీపుల్స్‌వార్ నాయకుడు లింగమూర్తి సాహిత్య అభినివేశమే కారణం. ఆ తర్వాత పరిచయమైన ఆ పార్టీ నాయకులు, కార్యకర్తల్లో చాలా మంది సాహిత్యజీవులే. అట్లా తొలి కలయికలోనే గంటి ప్రసాదంగారిలో, లోతైన సాహిత్య విశ్లేషకుడిని చూశాను.

ఆ తర్వాత చర్చలు విఫలమయ్యాక... ఔరంగాబాద్‌లో మరో ముగ్గురు విరసం నాయకులతో పాటు ఆయన కలిసినప్పుడు రోజంతా జరిగిన చర్చల్లో ఎక్కువ సేపు సాహిత్యం గురించే ఆయన మాట్లాడారు. ఆ సాయంకాలమే పోలీసులు అరెస్టు చేసి మూడు రోజుల అక్రమ నిర్బంధం తర్వాత నిజామాబాద్ జెయిల్లో పెట్టాక రోజుల తరబడి సాహిత్య, రాజకీయ, సిద్ధాంత విషయాలు చర్చించారు. అప్పుడాయన ఓ రోజు సాహిత్యంలో లాలిత్యం, కరుణ అనే విషయాల గురించి తన అభిప్రాయాలు పంచుకున్నారు. వాటిని కేవలం సాహిత్య సంబంధంగానేగాక సాంఘిక దృష్టితో కూడా చర్చలోకి తెచ్చారు.

ప్రసాదం గారు 1970లలో బహిరంగ కార్యకలాపాల్లో ఉన్నంత కాలం విరసం సభ్యుడు కూడా. అందువల్ల కూడా ఆయన జైలు నుంచి బయటికి వచ్చాక 'ఇప్పుడు నా సభ్యత్వం గురించి మీరు సాంకేతికంగా ఏమనుకుంటారో గాని నేను స్పిరిట్ రీత్యా విరసం సభ్యుడినే' అనేవారు. అన్నట్లే ఆయన ఆ ఏడెనిమిదేళ్లలో ఎన్ని సంఘాల్లో పని చేసినా, చివరి దాకా విరసంతో ఎక్కువ సాన్నిహిత్యంగా ఉండేవారు. విరసం 2005 నుంచే చేపట్టిన దండకారణ్య ప్రచార కార్యక్రమాల పట్ల ఎక్కువ ఆసక్తి చూపుతూ అవసరమైనప్పుడు సలహాలు, సూచనలు ఇచ్చేవారు. యాదృచ్ఛికమే అయినా హత్యకు ముందు ఆయన గుంటూరులో, నెల్లూరులో ఇచ్చిన చివరి రెండు ప్రసంగాలూ సుప్రసిద్ధ విప్లవ రచయిత ఆలూరు భుజంగరావుగారి సాహిత్య, రాజకీయ వ్యక్తిత్వం గురించే.

ఆయన దినపత్రికల్లో వచ్చే సాహిత్యాన్ని, చర్చలను ఎప్పటికప్పుడు శ్రద్ధగా చదువుతూ ఉండేవారు. తనకు అంతగా తెలియని రచయిత వ్యాసమో, కవితనో చూసినప్పుడు ఎక్కడ ఉన్నా ఫోన్ చేసి మరీ వాళ్ల వివరాలు అడిగేవారు.

ఓసారి ఆయనకు జాషువా కవిత్వం చదవాలనిపించి ఓ కార్యకర్తకు చెప్పి కొని తెప్పించుకున్నారు. వాటిని సంచిలో పెట్టుకొని కొన్ని రోజులపాటు తిరిగారు. గబ్బిలం, శ్మశానవాటికలోని కవిత్వం గొంతెత్తి చదువుకుంటూ 'ఎన్నిసార్లు చదివినా అదే విషాదం, ఆర్తి కదా..!' అన్నారు.

---

చెందుతాయి. విప్లవాలు చెలరేగుతాయి - రక్తపాతంతోనూ, సాంస్కృతికంగానూ కూడా.

నిర్దాక్షిణ్యమైన ఆ వర్గపోరాటంలో రాజ్యం డేగ ఉక్కుగోళ్లు ఒక్కొక్కటిగా ఊడిపోతాయి, రంపపు ముక్కు రాలిపోతుంది, ఇనుపరెక్కలు గాలిలో కలిసిపోతాయి. అంతిమంగా అది ఉనికిలోనే లేకుండా పోతుంది.

కానీ మానవజాతి మనగడ ఉన్నంతకాలం, పసిపాపలు పుడుతూ ఉన్నంతకాలం అమరుల స్మృతులు మాత్రం వారి బోసినవ్వులంత స్వచ్ఛంగా, స్వేచ్ఛగా, తాజాగా విశ్వమంతా వ్యాపిస్తూనే ఉంటాయి. ప్రతి నూతన తరానికీ చేయి అందించి, వేళ్లు పట్టుకుని అడుగులు వేయడం నేర్పిస్తూనే ఉంటాయి.

*(కామ్రేడ్ గంటి ప్రసాదం స్మృతులను ప్రచురించవద్దని రాజ్యం విరసం వారిని బెదిరించి 'హిట్ లిస్టు' ప్రకటించడం, దాన్ని ధిక్కరిస్తూ వారు వాటిని ప్రచురించడం దీనికి తక్షణ ప్రేరణ. గతంలో నేను రాసిన ఒక రచన నుండి కొంత భాగాన్ని యథాతథంగా ఇందులో పొందుపర్చాను. అమరుల స్మృతుల్ని సజీవంగా ఉంచడానికి కృషి చేస్తున్న వారందరి కోసం...)*



సంస్మరణ

# విలక్షణ వ్యక్తిత్వం

- ఉష

ఒకరి వ్యక్తిత్వంలోని విలక్షణత వికసించటానికి కొందరి ప్రేరణ, ప్రోత్సాహం తప్పనిసరి. మళ్ళీ ఆ విలక్షణ వ్యక్తిత్వం, రూపొందుతున్న ఎందరో వ్యక్తిత్వాలకి ప్రేరణనిస్తుంది. పాణి విశ్లేషించినట్లుగా, నాయన సమాజానికి ఇవ్వగలిగినంత ఇవ్వాలనే అనుకున్నాడు, కాని తన కోసం ఏదీ తీసుకోవాలని ఆశించలేదు, ప్రయత్నించలేదు. అందుకే నాయనని విప్లవం, విప్లవ సాహిత్యం తనలో ఇముడ్చుకొని ఎప్పటికీ నిలిచి ఉండే స్థానాన్ని ఇచ్చింది. అద్భుత అనువాదకుడిగా, రచయితగా, విప్లవకారుడిగా నాయన కృషి ఎందరో ప్రగతి కాముకులకు, విప్లవకారులకు ప్రేరణ ఇస్తూనే ఉంటుంది. నాయన నుంచి నాకు అందిన చివరి ఉత్తరంలోని "రచయిత అనేవాడు జీవితాంతం పేద ప్రజల పక్షపాతిగా, అవిశ్రాంతంగా సాహిత్య కృషి చేస్తూనే ఉండాలిరా" అనే మాటలు ఎప్పటికీ నిలిచిపోయేలా తన జీవితాన్నే మన ముందుంచాడు.

సాహిత్య బాటసారి శారద (నటరాజన్) కమ్యూనిస్టు అన్న ప్రకాశం వేసిన చెరిగిపోని ముద్రలు ఒక కమ్యూనిస్టు సాహిత్యకారునిగా నాయన వ్యక్తిత్వం రూపొందటంలో ప్రేరణనిచ్చాయి. అమ్మకు నాయన పంచిన ప్రజాస్వామిక, ప్రేమాత్మక అనుబంధానికి బదులుగా ఆమె నుండి తనలోని కొన్ని ప్రత్యేకతలు వికసించటానికి ప్రేరణ పొందాడు. తనకంటూ ఒక ప్రత్యేకతను వదులుకుంటూ, తన భావాలు, అభిరుచులు అన్నిటినీ కుటుంబ ప్రజాస్వామిక వాతావరణంలో భాగం చేస్తూ, రాహుల్ సాహిత్య సదనంలోనూ, విప్లవం వైపు మా కుటుంబాన్ని నిలబెట్టటంలోనూ, అజ్ఞాత జీవితాన్ని ఎంచుకోవటంలోనూ ప్రధాన పాత్ర అమ్మది.

రోజువారి జీవితంలో చేదోడు వాదోడుగా వాళ్ళ ప్రవర్తన, శ్రమించే తత్వం, సామాజిక విషయాల పట్ల స్పందన, నిత్యం వచ్చే సమస్యలతో వ్యవహరించే తీరూ, జీవన విధానం... వీటన్నింటిలోనూ వాళ్ల వ్యక్తిత్వం ప్రతిఫలిస్తుంది. ఇవన్ని చెరిగిపోని ముద్రలను ఇతరులకి ప్రేరణనిస్తాయి. ప్రేమాస్పదుడు నాయన నాపై వేసిన కొన్ని చెరిగిపోని ముద్రలను తడుముతూ...

ఉయ్యూరులో నాయనకి జీతాలు రాక ఇంట్లో తిండికి సమస్యగా ఉండేది. నేను ఆరేళ్ల వయసులో ఉన్నప్పుడు మందులు కొనలేని పరిస్థితిలో మా తమ్ముడు చనిపోయాడు. అమ్మా నాన్నలు ఒకరిని ఒకరు ఓదార్చుకుంటూ మమ్మల్ని ఓదార్చటం నా తొలి జ్ఞాపకం. మా వీధిలో అన్నీ చిన్న. చిన్న పనులు చేసుకుంటూ బతికే పేద కుటుంబాలే. సైకిలు రిపేరు చేసే ముస్లిం కుటుంబాలు, హమాలీలు, తోపుడు బండ్లపై పండ్లు అమ్మే వాళ్ళు, బట్టలు ఉతికే వాళ్ళు, అందరూ అమ్మా నాన్నతో వాళ్ళ కష్టాలు, సుఖాలు కుటుంబ సమస్యలు పంచుకునే వాళ్ళు. పిల్లలందరం రాత్రుళ్లు దుమ్ములో వెన్నెల్లో ఇంటి ముందు ఆటలాడితే, పగళ్ళు చెరకు ఫ్యాక్టరీకి వచ్చిన ఎడ్ల బండ్ల నుంచి చెరకు గెడలు దొంగతనంగా లాక్కొని కడుపు నింపుకునే

---

సాహిత్య, సిద్ధాంత, రాజకీయ సంబంధమైన విషయాల్లో తీవ్రస్థాయిలో కొట్లాడే పూర్తి స్వేచ్ఛను ఆయన దగ్గర అనుభవించాను. కించిత్ అసహనం తన స్వాభావికమే అయినా ఇలాంటి సందర్భాల్లో చాలా సంయమనం పాటించేవారు. కొత్త విషయాల అన్వేషణకు సదా తలుపులు తెరిచి ఉంచేవారు. అయితే ఒక్కోసారి మార్క్సిస్టు సిద్ధాంతం చట్రంలో భాగమైన వాటిని కూడా అనుమానాస్పదంగా చేసేవారు. మావోయిస్టు పార్టీ పొలిటికల్ ఫ్రేమ్‌వర్క్‌లో ఇమడవనే సందేహం ఆయనకు ఉండేది. అలాంటప్పుడు చర్చ ప్రశ్నలు జవాబులుగా మారిపోయి... సమాధాన కర్తగా వ్యవహరించేవారు. ఇక ముందుకు పోవడం కష్టమే అనిపించేది. అయితే ఎప్పటికీ చర్చకు అవకాశం ఇవ్వడం ఆయన సుగుణం. మావోయిస్టు ఉద్యమ నిర్ధారణల గీటురాయి మీద విభిన్నమైన ఆలోచనల మధ్య సంవాదానికి, క్రోడీకరణకు మాత్రం సిద్ధంగా ఉండేవారు.

శ్రీకాకుళ పోరాటం వెనకడుగు వేసిన కాలంలో విప్లవ రాజకీయాల్లోకి వచ్చిన ప్రసాదంగారిది దండకారణ్యం దాకా నాలుగున్నర దశాబ్దాల సుదీర్ఘ విప్లవాచరణ. తొలి రోజుల్లో ఉత్తరాంధ్రలో బహిరంగంగా ఉంటూ కార్మిక, విప్లవ ప్రజా సంఘాలను నడిపారు. భారత విప్లవోద్యమంలో రెండు స్రవంతులుగా ఉన్న సీపీఐ ఎంఎల్ పీపుల్స్‌వార్, పార్టీ యూనిటీల విలీనానికి పీయూ వైపు నుంచి ఆయన విశేష కృషి చేశారు. ఐక్య పార్టీ ఏర్పడ్డాక అజ్ఞాతానికి వెళ్లిపోయి విప్లవోద్యమ పత్రిక క్రాంతి సంపాదకుడిగా, పార్టీ అధికార ప్రతినిధిగా కొనసాగారు. జైలు నుంచి బయటికి వచ్చినప్పటి నుంచి చివరిదాకా అమరుల బంధుమిత్రుల సంఘం బాధ్యుడిగా పని చేశారు.

గత ఏడాది జూలై 4వ తేదీ నెల్లూరు పట్టణం టౌన్ హాల్‌లో విరసం సభలో ప్రసంగించాక కొద్ది సేపటికే నడి రోడ్డు మీద ఆయనను దారుణంగా హత్య చేశారు. కత్తులతో నరికి, తుపాకితో కాల్చేశారు. ఆస్పత్రిలో తుది శ్వాస వదులుతూ పోలీసులే నకిలీ వేషంలో వచ్చి తనపై దాడి చేశారని చెప్పారు. అంతేకాదు... ఈ హంతక రాజ్యం తనను చంపగలదేమోగాని తన స్ఫూర్తిని చంపలేదనే అశావహమైన, ధీరోదాత్తమైన ప్రకటన చేసి కన్నుమూశారు. ఆ తుది క్షణాల్లో కూడా ఆయన విప్లవాన్నే కలగనడం తనలోని సాహసోపేతమైన విప్లవ ఆశావాదం. ఇవాళ దండకారణ్య విప్లవోద్యమం పక్షాన దృఢంగా నిలబడటానికి కావల్సిందే అదే. ఆయన స్మృతి చిరునామా కూడా అదే.

తొలి వర్ధంతి జూలై 4



ఆటలాడే వాళ్లం. ఒక రోజు వాచ్‌మెన్ మమ్మల్ని దొరికించుకొని కొట్టాడు. నాయన ఇంకెప్పుడూ పోవద్దని చెప్పాడు. వీథి పిల్లలం ఉదయమే పేడ పోగు చేయడానికి పోయే వాళ్ళం. అమ్మ, పెద్దక్క పిడకలు చేసేవాళ్లు. అమ్మటానికి అమ్మ తనతో పాటు నన్ను తీస్కపోయేది. వీథిలో స్కూలు దగ్గర అమ్మితే వచ్చిన పైసలతో బియ్యం తెచ్చి వండేది. నాయన పట్ల అభిమానంతో ఆ వీథిలో కూరగాయలు వేసిన వాళ్ళు, తోటి ఉపాధ్యాయులు మమ్మల్ని తమ ఇంటికి తీస్కపోయి కూరగాయలు ఇచ్చి పంపేవారు. నాయనను గౌరవించే, అమ్మని అక్కగా అభిమానించే ఇంటి యజమాని, మా పరిస్థితిని చూసి కొన్ని నెలలు అద్దె తీసుకోలేదు. తను డ్రైవరుగా ఉన్న లారీలోనే మమ్మల్ని గుడివాడకి తెచ్చాడు. మేం ఊరు వదిలి గుడివాడకి పోతున్నామని తెల్సి టీచర్లు, ఆ వీథిలో ఉన్న కుటుంబాల వాళ్లు అందరూ బాధపడ్డారు.

అమ్మా నాయనలు పిల్లల ముందు ఏ ఒక్క విషయాన్ని దాచిపెట్టే వారు కాదు. నెల జీతం వస్తే ఎంత ఖర్చు అవుతుంది. ఎంత మిగులుతుంది. ఏం చేద్దాం అనేది పిల్లలందరి ముందు లెక్కకట్టే వాళ్ళు. అన్ని విషయాలలో పిల్లలు బాధ్యత పడేలా చేశారు. మాకు ఆర్థిక పరిస్థితి అర్థమయ్యేది. ఏవేవో కొనిపెట్టమని ఏడ్వటాలు, అలకలు, మారాంలు ఉండకపోయేవి. పద్నాలుగు, పదిహేను సంవత్సరాల నుంచి పిల్లలందరం ఇంటి ఆర్థిక పరిస్థితికి సహకరిస్తూ చిన్న చిన్న పనులు చేస్తూ, ట్యూషన్లు చెప్పి కొన్ని పైసలు సంపాదించే వాళ్లం. అట్లా బట్టలు, చదువు ఖర్చులు కలిసివచ్చేవి. నాయన విరసం కార్యక్రమాల్లో పాల్గొనటం ప్రారంభమయినాక ఇంట్లో ప్రైవేటు చెప్పటం బందయింది.

ఒక రోజు నేను 6వ తరగతిలో ఉన్నప్పుడు మా క్లాస్ టీచర్ విద్యార్థుల్ని ఒక్కొక్కరిని కులం పేరు అడిగి రాసుకుంటున్నది. నేను తెలియదన్నాను. పిల్లలు నవ్వారు. టీచర్ కోప్పడ్డది. నేను చేసిన తప్పు నాకు అర్థం కాలేదు. ఇంటికొచ్చి అమ్మని అడిగాను. "ఛ! నోర్మూయ్యి, నీకేం అవసరం, ఇంకెప్పుడూ అడగద్దు" అన్నది. విషయం చెప్పాను. మీ నాన్న వచ్చి టీచర్‌కి చెపుతారులే అన్నది. తరువాత రోజు నాయనతో పాటు నేనూ స్టాఫ్ రూంకి వెళ్ళాను. "ఇట్లాంటివి పిల్లల్ని అడుగుతారటండీ" అంటూ క్లాసు టీచర్‌తో చాలా గొడవపడ్డాడు. అది చూసి కులం అంటే ఏదో తప్పు విషయం అనుకున్నాను. తరువాత చుట్టాలు కల్సిన ఒక సందర్భంలో నాకు కులం పేరు తెలిసింది. కారంచేడు ఘటన జరిగినప్పుడు కుల వ్యవస్థని అసహ్యించుకుంటూ నాయన చాలా విషయాలు చెప్పాడు. కారంచేడు క్యాంపెయిన్‌కి కామేశ్వరిని పంపుతూ దానికి తోడుగా నన్ను పంపారు. అప్పటిదాకా చదువు తప్ప ఇతర విషయాలు పట్టని నా జీవితాన్ని కారంచేడు ఘటన కుదిపివేసింది. కారంచేడు నుంచి తిరిగి వచ్చిన తర్వాత నేను మొదటిసారి సమాజం గురించి నాయనతో చర్చించాను.

వేసవి సెలవుల్లో నాయన నన్ను, కామేశ్వరిని వెంట తీసుకొని విజయవాడ పుస్తకాల షాపులోకి వెళ్ళేవాడు. నేను సైన్సు పుస్తకాలు, అక్క సాహిత్య పుస్తకాలు ఎంచుకునేది. అమ్మా నాయనలు ఎప్పుడూ వాళ్ళ అభిరుచులను మాపై రుద్దలేదు. మా జీవితాలను స్వేచ్ఛగా ఎంచుకునే అవకాశం కల్పించారు. మొదట్లో నాకు ఉద్యోగం చెయ్యాలనే కోరిక ఉండేది. అప్పటికి మా టౌనులో పార్టీ నిర్మాణం, అంతగా లేదు. కారంచేడు ముద్ర క్రమంగా నా ఆలోచనల్లో మార్పు తెచ్చింది. ఆ తరువాత నేను ఉద్యమంలోకి పూర్తి కాలం పోవాలని నిర్ణయించుకున్నపుడు "ఆలోచించి నిర్ణయం తీసుకో" అని నన్ను ప్రోత్సహించారు.

నా 10వ తరగతి సెలవుల్లో చిన్నమ్మ ఇంటికి పోయినపుడు తెలిసింది. పెద్దక్క పార్వతి మా పెద్దమ్మ బిడ్డ అని. ఇంటికి వచ్చి విషయం చెప్పి అమ్మని అడిగాను. అమ్మ మౌనంగా ఉండిపోయింది. ఆ రోజు రాత్రి అమ్మా నాయన పిల్లల మీటింగ్ వేశారు. పెద్దమ్మ చనిపోవటం, నాయన రెండవ పెండ్లి చేసుకోవటం, అప్పటికే రంగనాయకమ్మ పుస్తకాలు చదివి ప్రగతిశీల భావాలు కల 16 సంవత్సరాల అమ్మ 32 సంవత్సరాల నాన్నని పెండ్లి చేసుకుంది. సవితి బిడ్డని తన సొంత బిడ్డగా ఎందుకు పెంచలేం అని ఛాలెంజ్‌గా తీసుకున్నది. ఆ బిడ్డకి 23 సంవత్సరాలు వచ్చి, టీచర్ ఉద్యోగం చేసే వరకూ మాకు ఆ విషయాన్నే తెల్వకుండా పెంచింది. ఆ రోజు రాత్రి నేను నీ కూతురునే అని పార్వతక్క ఏడిస్తే, ఇది మా పెద్దక్కే అని దాన్ని పట్టుకొని మేం ఏడ్చాము. జీవితాన్నే ఛాలెంజ్‌గా తీసుకొని అమ్మ పాటించిన విలువలకు, నాయన పంచిన ప్రేమకి వినయ పూర్వక అభినందనలు.

జీవితంతో సంబంధంలేని విద్యని, బట్టీకొట్టుడు పరీక్షలని నాయన వ్యతిరేకించే వాడు. కబీరు దోహాలు, వేమన, సుమతీ శతకాలు, భగత్‌సింగ్ చరిత్రను, నాస్తిక భావాలను విద్యార్థులకు చెబుతూ జీవితం పట్ల సరైన దృక్పథాన్ని కలిగించే ప్రయత్నం చేసేవాడు. హిందీ పండిట్ పరీక్షలలో, 'విశారద' 'ప్రవీణ' ఇంటర్వ్యూలలో, స్కూలు పేపర్లు దిద్దటంలో, వీలైనంత వరకూ ఏ విద్యార్థినీ నాయన ఫెయిల్ చేసేవాడు కాదు. మా స్కూలు విద్యార్థులు నాయన పేపర్లు దిద్దాలని కోరుకునే వాళ్ళు. నాయన చేతిలో బెత్తాన్ని కానీ, విద్యార్థులని తిట్టటం కానీ ఎవరూ చూసి ఉండరు. విద్యార్థుల పట్ల ప్రజాస్వామికంగా ఉండేవాడు. హిందీ పండిట్ పరీక్షల కోసం చదువుకోవటానికి పిల్ల తల్లులు, ఉద్యోగస్తులు, మహిళలు చాలా మంది మా ఇంటికి వచ్చే వాళ్ళు. డబ్బులు ఇవ్వలేని చాలా మందికి ఉచితంగా చదువు చెప్పాడు. గుడివాడ టౌనులోని హిందీ పండిట్‌లు నాయనని ఇంటికి పిలిపించుకొని హిందీ చెప్పించుకునే వాళ్ళు. తోడుగా నేను వెళుతుండేదాన్ని.

ఆకాశవాణిలో హిందీలో సాహిత్య ప్రసంగాలు చేస్తుండేవాడు. ఒకసారి 'స్వయం ఉపాధితో నిరుద్యోగాన్ని అరికట్టండి' అనే విషయం మీద మాట్లాడమన్నారు. ప్రజలందరికీ ఉపాధి కల్పించాల్సిన బాధ్యత ప్రభుత్వానిదే అంటూ ఆ అంశంపై ప్రసంగించటానికి తిరస్కరించాడు. తరువాత కూడా ఆకాశవాణి వాళ్ళు వివిధ విషయాలపై ప్రసంగించాలని ఆహ్వానించినా నాయన పోలేదు. గుడివాడలో ఉన్న గ్రంథాలయ బాధ్యుడు సాహిత్య అభిమాని. అప్పుడప్పుడు చర్చా గోష్ఠులు సాగించేవాళ్ళు. వివిధ విషయాలపై ప్రసంగించటానికి నాయనని ఆహ్వానించే వాళ్ళు.

గుడివాడలో ముందు సి.పి.ఎం. పార్టీ రాజకీయాలు ఉన్న టీచర్లతో పరిచయం ఉండేది. ఇంట్లో సి.పి.ఎం. రాజకీయాల చర్చలు జరిగేవి. మేం వింటుండే వాళ్ళం. "ఒట్ల తోటి ఏ వ్యవస్థ వస్తుందండీ, కలకత్తాలో చారు మజుందార్‌నీ, సరోజ్‌దత్తానీ పట్టుకొని చంపలేదా?"

అని నాయన చర్చించేవాడు. సి.పి.ఎం. నాయకుడు లెనిన్ రావు గారి బిడ్డ నా వయసుదే. 10వ తరగతి చదువుతుండిన ఆమె, వెనుకబడిన కులం అతడిని ప్రేమించింది. తల్లిదండ్రులు వద్దనడంతో గుళ్ళో పెండ్లి చేసుకున్నది. వాళ్ళు అవమానంగా భావించారు. కులాన్ని పట్టించుకోకూడదని, పిల్లలకు అర్థం చేయిస్తూ, వాళ్ల ఇష్టాలని గౌరవించాలని అమ్మా నాయన వాళ్ళతో బాగా చర్చించారు. నాయన ఎప్పుడూ మహిళల సమస్యల పట్ల స్పందించే వాడు. మహిళా పక్షపాతిగా ఉండేవాడు. నేను పుట్టినప్పుడు మళ్ళీ ఆడపిల్లే పుట్టిందనే కోపంతో చెప్పకుండా ఎటో కొన్ని రోజులు పోయాడట. కోపం తగ్గినాక తిరిగి వచ్చాడట. ఈ విషయాన్ని చాలా సార్లు గుర్తు చేసుకుంటూ అప్పటి తన తప్పుడు అవగాహనకీ, ప్రవర్తనకీ బాధపడేవాడు. మామీద ఆడపిల్లలని ఆంక్షలు పెట్టింది కానీ, అట్లా ఆడపిల్ల లెక్క పెంచింది కానీ లేదు. కొన్ని సినిమాలు చూస్తే ఆడపిల్లలు చెడిపోతారని చర్చ జరుగుతుండేది. “ఆడపిల్లలకి అన్నీ చూపించాలి. అప్పుడే వాళ్ళు ఏది మంచిదో, ఏది మంచిది కాదో అర్థం చేసుకో గలుగుతారు” అనేవాళ్ళు, మా పెద్దక్కనీ, చిన్నక్కనీ వెంట పెట్టుకుని అమ్మా నాయన అటువంటి సినిమాలని చూపించే వాళ్ళు.

నాగిరెడ్డి గ్రూపు రాజకీయాలతో సంబంధం ఉన్న టీచర్లతో పరిచయం ఏర్పడినాక ఇంటికి వాళ్ళ రాకపోకలు జరుగుతుండేవి. డి.ఎస్.ఒ.కి చెందిన సజయ, శ్రీధర్, సుధీర్, రాఘవ, జయ, ప్రజాసాహితి నవీన్, రవిబాబు, ఐ.పి.ఎఫ్. కృష్ణారావు, సైదులు గారు వస్తుండేవారు. అప్పుడప్పుడు మా ముందే చర్చలు జరిగేవి. “తీరిగ్గా పడక కుర్చీలో కూర్చొని ప్రచారం చేస్తే విప్లవం వస్తుందాండీ, ప్రాణ త్యాగం చేస్తే వస్తుంది. రాడికల్ పిల్లల్ని చూడండి ఎంత త్యాగం చేస్తున్నారో” అని చర్చించే వాడు. అన్న ప్రసాదు చదువుకునే రోజుల్లో డి.ఎస్.ఒ.లో చేరాడు. (అప్పటికి మా గుడివాడలో ఆర్.ఎస్.యు. లేదు) “ఒరేయ్ డి.ఎస్.ఒ. వాళ్ళు ఉత్త మాటలే చెబుతారురా, ఆ రాడికల్స్ చేసేదే సరైంది” అని అన్నని రాడికల్స్‌లో చేరడానికి ప్రోత్సహించే వాడు. అప్పట్లో వాళ్ళకి క్లాసులు చెప్పటానికి నాయనని తీస్కపోతుండే వాళ్ళు. సింహావలోకనం పుస్తకం వచ్చినాక రాడికల్ విద్యార్థులు భగత్‌సింగ్ గురించి మాట్లాడడానికి నాయనని కాలేజీలకి మీటింగ్‌లకి పిలిచే వాళ్ళు. అలా విప్లవ రాజకీయాలతో సంబంధం ఏర్పడింది. మునిస్వామి గారితో, గంజి రామారావు గారితో పరిచయాలు పెరిగాయి.

నేను హైస్కూలు చదువుతున్నప్పటి నుంచి నాయనతో పుస్తకాల ప్రింటింగ్ దగ్గరికి, పేపర్ సెలక్షన్‌కి మమ్మల్ని తోడు తీసుకుపోతుండేవారు. మమ్మల్ని కూడా ఎట్లా చేస్తే బాగుంటుందని అడిగేవారు. పిల్లలకి కూర్చోబెట్టి చెప్పేవాళ్ళు. అట్లా పుస్తకాల ప్రింటింగ్‌ని కుటుంబం మొత్తం సొంతం చేసుకున్నది. అమ్మా నాయన ఎన్ని పుస్తకాలు అమ్మితే ఎంత వచ్చాయనే, ఎంత మిగిలాయనే లెక్కలు వచ్చేవి కావు. అందరం నవ్వుకునేవాళ్ళం.

అమ్మ మహిళా సంఘం కార్యక్రమాలు, నాయన సాహితీ కార్యక్రమాలతో ఇల్లు రకరకాల సాహితీ చర్చలకు కేంద్రంగా ఉండేది. నాయనతో సాహితీ చర్చలు చేసేవాళ్ళు. రాజకీయ చర్చలు సరేసరి. వాళ్ళందరూ అమ్మ నుంచి స్నేహాన్ని, అప్యాయతని పొందారు. అమ్మతో చాలా విషయాలు పంచుకునే వాళ్ళు. మా ఇంట్లో అందరూ చాలా సహజంగా కల్సిపోగలిగే వాతావరణం ఉండేది. పార్టీ ఆర్గనైజర్ శాంతక్కని మా పెదనాయన బిడ్డగా, మా పెద్దక్కగా, కుటుంబ సభ్యురాలుగా అందరు అనుకునేంతగా ఇంటి వాతావరణం ఉండేది. చుట్టుపట్ల ఎవరన్నా శుభకార్యాలకి పిలిస్తే పెద్ద బిడ్డగా శాంతక్కని వెంట తీస్కపోయేది అమ్మ. అప్పటి మహిళా కార్యకర్తలు రజని, భాను, సుక్కులతో, యూనిట్ మీటింగ్‌లతో ఇంట్లో సందడిగా ఉండేది. అప్పట్లో భార్యా భర్తల మధ్యన ఉన్నది శత్రు వైరుధ్యమా? మిత్ర వైరుధ్యమా? అనేది ఒక చర్చ. నాయనలో పితృస్వామ్యం ఉన్నదా? మీరిద్దరూ ఎప్పుడైనా పోట్లాడుకుంటారా? వంటి ప్రశ్నలు చాలా సహజంగానే అమ్మనీ నాయననీ అడుగుతుండే వాళ్ళు. స్నేహ భావంతో “ఎందుకుండదురా, నాలో కూడా ఉన్నది. అయితే సమస్యలు వస్తే ఒకరినొకరు అర్థం చేసుకుని సహకరించుకుంటూ పరిష్కరించుకోవాలి. కానీ తెగేదాకా పోట్లాడుకుంటే కలిసి ఉండలేరు కదా!” అని జీవితానుభవం నుంచి విషయాలను ఎలా చూడాలో అర్థం చేయించే వాళ్ళు. అమ్మా నాయన కొట్లాడుకోవటం మాకు తెలియదు. కానీ రాజకీయ విషయాల గురించి ఎవరి అభిప్రాయాలు వాళ్ళు స్వేచ్ఛగా చర్చించుకునే వాళ్ళు.

నాయన వాలెంటరీ రిటైర్‌మెంట్ తీసుకున్నప్పుడు కొన్ని పైసలు వచ్చాయి. తమ నలుగురు బిడ్డలతో పాటు కోడలు కవితనీ, పార్టీ ఆర్గనైజర్ శాంతక్కనీ తమ బిడ్డలుగానే భావించి సమాన భాగాలు ఇచ్చారు. వాళ్ళకంటూ మిగుల్చుకోలేదు. అప్పట్లో కోడలు కవిత “మీరు నాకు తల్లిదండ్రుల ప్రేమని పంచారు” అని ఎన్నోసార్లు అంటుండేది.

ఓల్గా మూడు తరాలు పుస్తకంపై బాగా చర్చ జరిగేది. నేను ఇట్లాంటిది పట్టించుకోకపోయేది. అమ్మ ఆ పుస్తకం నాతో చదివించి చర్చించింది.

మొదటిసారి పార్టీ బాధ్యుడు, అమరుడు మల్లోజుల కోటేశ్వర్లు కల్సినాక ఇంట్లో పిల్లలందర్నీ కూర్చోపెట్టి పార్టీ విషయాలు చెప్పారు. అప్పుడు నాకు ఎక్కువ విషయాలు అర్థం కాకున్నా నాయన కళ్ళలో మెరిసిన ఉత్సాహం, ఆనందం నాకు ఇప్పటికీ గుర్తే. ఎప్పుడు పార్టీ బాధ్యులు కలిసినా మమ్మల్ని కూర్చోపెట్టి విషయాలు చెప్పేవాళ్ళు. ఇంటికి వచ్చేవాళ్ళు నాయనతో అవసరమైన విషయాలు మాట్లాడిన తరువాత అమ్మ చాలా విషయాలు రిపోర్టులు అడిగి తెల్సుకునేది. మేము కాలేజీ నుంచి వచ్చినంక మాతో చెబుతుండే వాళ్ళు. మొత్తం కుటుంబం పార్టీని సొంతం చేసుకునే ఒక ప్రజాస్వామిక వాతావరణాన్ని కల్పించారు. తెలంగాణ నుంచి వచ్చిన కొందరు కార్యకర్తలు పార్టీ పర్మిషన్‌తో, రెండు, మూడు రోజులు ఇంట్లో ఉండి అమ్మా నాన్న ప్రేమని పొందే వాళ్ళు. నిర్బంధంలో ఇండ్లకి పోలేము కాబట్టి అమ్మని చూసుకోవడానికి వచ్చామనే వాళ్ళు.

నిమ్మలూరి భాస్కరరావు శత్రువు ముందు మోకరిల్లి నప్పుడయినా, మురళి జంట, భూషణం ఉద్యమాన్ని వదిలి వెళ్ళినా చాలా ధృఢంగా పార్టీ రాజకీయాలనే సమర్థించారు. కుటుంబం మొత్తం అమితంగా ప్రేమించి, గౌరవించే పెద్దల్లుడు సిరా (సి. రామచంద్రారెడ్డి) కేఎస్ రాజకీయాల ప్రభావంలోకి వెళితే చాలా బాధపడ్డారు. కానీ సిరాని సమర్థించలేదు. కామ్రేడ్ సిరాని బూటకపు ఎన్‌కౌంటర్‌లో చంపటం, అమ్మ ఎంతో ప్రేమతో 'బాబూ' అని



# గురుతుల్యులు నాన్నకు వినమ్రతతో..

-కవిని

కాలం దేన్నీ మిగల్చదు. ముందు వెనకగా సమస్త ప్రాణకోటి కాలగర్భంలో కలిసిపోవల్సిందే! వ్యక్తులు మిగలరు. వాళ్ళ జ్ఞాపకాలే మిగుల్తాయి. నాకు గురుసమానులైన మా నాన్నగారు - ఆలూరి భుజంగరావు గారు మరణించి అప్పుడే సంవత్సరం పూర్తయింది. ఎందుకో నమ్మబుద్ధి కావటం లేదు. ఐనా ఇది నిజం. 2013 జూన్ 20న ఆయన మనందర్నీ వదిలి వెళ్ళిపోయారు. సాహిత్యాన్ని చదువుతుంటే ఆయన జ్ఞాపకాలే వెన్నాడుతున్నాయి. ఒక్కసారి ఆయన జ్ఞాపకాలను పంచుకుందాం!

రచయితల రచనల్లోనే వాళ్ళ వ్యక్తిత్వం ద్యోతకమవుతుందంటారు. అద్భుతమైన అనువాదాలను, రచనలనూ దాదాపుగా విపరీతమైన శారీరక, మానసిక బాధల్లోనే, దరిద్రంలోనే రాశారు. కానీ తనను మానవుడిగా, రచయితగా తీర్చిదిద్దింది ఈ దేశంలోని కూటికి, గుడ్డకు నోచుకోని కోట్లాది దరిద్ర మానవులే అని ఆయన సగర్వంగా చెప్పుకున్నారు. సమస్త విజ్ఞానాలూ, ఐశ్వర్యాలూ, సుఖాలూ - సంపదలూ అన్నీ మురికి ఓడుతున్న మడ్డి మనుషుల చెమట చుక్కల్లోంచేనని త్రికరణ శుద్ధిగా నమ్మారు!

"బతకడం ఎట్లా" అన్న ప్రశ్న... ఆయన జీవితం అస్థిత్వాన్ని దాల్చిన క్షణం నుండి ఆయనను వేధించిన ప్రశ్న! ఆయన జీవితంలో అపరిష్కృతంగా మిగిలిపోయిన ప్రశ్న! "జీవితాన్ని, పొగల్లో, సెగల్లో, పంచాగ్నుల మధ్యా భస్మీపటలం చేస్తున్న "బతకడం ఎట్లా?" అన్న ప్రశ్నకే ప్రాధాన్యతనిస్తే, నా జీవిత చరిత్రగా పేరు పెడితే? అది నా దేశంలోని అసంఖ్యాకులైన మానవుల చరిత్ర అవుతుందని రాసుకున్నారు. సరైన వైద్యం చేయించలేక ఇద్దరు మొగపిల్లల్ని పోగొట్టుకున్నారు. 'ఈ సమాజ కరాళ దౌష్ట్రాలకు ఎరగా ఇప్పటికి ఇద్దరు పిల్లల్ని ఇచ్చానని' 1974లో డైరీలో రాసుకున్నారు. హాలాహలం లాంటి జీవితంలోంచి అమృతమనే సాహిత్యాన్ని రచించారు.

ఆకలిగొన్నవారు, అన్నార్తులు, అభాగ్యులు కనపడితే వాళ్ళు అడిగినా, అడగకపోయినా ఎంతో కొంత తన జేబులోంచి తీసి వాళ్ళ చేతుల్లో పెడుతుండేవారు. వాళ్ళ కళ్ళల్లో దైన్యం, ఆకలి కనపడుతోందనేవారు! నిజాయితీకి, ఆచరణకు, కటిబద్ధతకు ఎంతో విలువనిచ్చేవారు. జీవితంలో ఇంకా నేర్చుకోవలసింది ఎంతో ఉన్నదని భావించేవారు. డబ్బునే మాధ్యమాన్ని ఓటి కుండలో నీటిలా భావించేవారు.

జీవితాన్ని ఒక గొప్ప కళాత్మక - కథాత్మక వస్తువుగా భావించారు. జీవిత సందర్భాన్ని ఉచితరీతిలో సంస్కరించి, పాఠకులకు ఇవ్వగలిగితే అదే గొప్ప సాహిత్యం, కళాత్మక చిత్తరువు అవుతుందన్నారు. సాహిత్యాన్ని అమూల్యమైనదిగా భావించి, సాహిత్యం అమ్మకపు సరుకు కాకూడదన్నారు. సమాజంలో బతుకుతున్నాం కనుక, ఈ సమాజంలో బతికినంతకాలం డబ్బవసరం ఏంచేస్తాం? తప్పనిసరి అనేవారు. ఎంత బాధలో ఉన్నా హాస్యోక్తుల్ని విసురుతుండేవారు. ఆయన భాషలో సున్నితమైన హాస్యం మేళవించి ఉండేది.

2000 సంవత్సరం నుండి 2013 దాకా అంటే దాదాపుగా 13 సంవత్సరాలు వయసు రీత్యా వచ్చే అనారోగ్య సమస్యలే కాకుండా, రాహుల్ సాంకృత్యాయన్ జీవిత చివరి దశలో ఏ రకమైన మెదడుకు సంబంధించిన సమస్యలతో బాధపడ్డారో? ఆ రకమైన బాధల్నే అనుభవించారు. ...

పిలుచుకునే కామ్రేడ్ కిరణ్ శత్రువు అంబుష్‌లో అమరుడు కావటం వాళ్ళ జీవితంలో పెద్ద దెబ్బ.

తమ శక్తిని ఇంకింత ఎక్కువగా విప్లవ సాహిత్యం కోసం కేటాయించాలని నాయన ఎప్పుడూ తపన పడేవాడు. పార్టీ తనని ఇంకా ముందే కలిసి ఉండాల్సిందనే వాడు. ఈ మాటలు ఇప్పటికీ కొనసాగుతున్న, అసంఖ్యాకంగా ఉన్న తన అభిమానులని ఇముడ్చుకోలేక పోతున్న భారత విప్లవ పరిస్థితిని గుర్తు చేస్తున్నాయి. పెరుగుతున్న వయసు, అనారోగ్యాలతో రహస్య జీవితంలో ఉండలేక పోయినందుకు అమ్మా నాన్నలు చాలా బాధపడ్డారు. ఆఖరిసారి కల్సినపుడు నాయన ఆతృతతో ఎక్కువ అడిగి తెలుసుకున్నది ప్రజాసైన్యం గురించి. 90లలో నాయన దండకారణ్యానికి వచ్చి దళాలని కలిశాడు. కంపెనీ నిర్మాణం జరిగిందని తెలిసి చనిపోయే లోపు ఒక్కసారి తన కళ్ళతో మన ఎర్ర సైన్యాన్ని చూడాలనేది నాయన తీరని కోరిక. కానీ ఆ కోరిక అలానే మిగిలిపోయింది.

నాయన రాసిన ప్రతి రచనకీ మొదటి పాఠకురాలు, మొదటి విమర్శకురాలు అమ్మనే. అమ్మా నాయనలు ఒకే నాణానికి బొమ్మా బొరుసుల వంటి వారు. అమ్మ పాత్ర లేని నాయన జీవితం నాకు తెలియదు.

నేను చదువుకునేటపుడే నాకంటే ముందే అమ్మా నాయనలు అజ్ఞాత జీవితాన్ని ఎంచుకున్నారు. నాకంటూ వ్యక్తిత్వం ఏర్పడినాక వాళ్ళ నుండి తెలుసుకోవటానికి వాళ్ళు నాకు అందుబాటులో లేరు. నేను వాళ్ళని కల్సి తగినంత సమయం కేటాయించుకోలేని పరిస్థితి. వాళ్ళ జీవితానికి సంబంధించిన ఎన్నో విలువైన అనుభవాలు నేను తెలుసుకోలేకపోయాను. కానీ నాయన వేసిన జ్ఞాపకాల ముద్రలు ఎప్పటికీ చెరిగిపోవు. 'ఏరా' అని ముఖమంతా సంతోషంగా, ఆప్యాయంగా, నోరారా పిలిచే, స్వచ్ఛమైన నాయన చూపులు నా జీవితాంతం వెంట ఉంటాయి.



భుజంగరావు గారు కూడా అనుభవించారు. ఒక్కొక్కప్పుడు సమయ, సందర్భాలను ఆయన మెదడు స్వీకరించలేకపోయేది. తనకు వచ్చిన భావనను వెంటనే వ్యక్తపరచాలనుకునేవారు. తన మరుపు, మాటలు, అమ్మలను, మిత్రులనూ బాధ పెడుతున్నాయేమోనని కలవరపడిపోయేవారు. ఆయన స్థితికి అమితంగా బాధపడేవారు. ఒక రకంగా మెదడుకు సంబంధించిన అనారోగ్యం ఆయన మెదడును కబళించి వేసింది. ఐతే, సహృదయులైన సాహితీమిత్రులు ఆయన స్థితిని అర్థం చేసుకుని, ఆయనను ఆదరించేవారు. తాను నమ్మిన ఆదర్శం, సిద్ధాంతం, ఆశయాల పట్ల చివరిదాకా పూర్తి జ్ఞాపకశక్తితో, చాలా ఖచ్చితంగా చెప్పగలిగి ఉండడం గమనార్హం!

ఎంతో నిమగ్నత వుంటే తప్ప రాహుల్జీని అనువదించడం సాధ్యం కాదు. ఇప్పుడున్న ఆధునిక సౌకర్యాలు (జిరాక్స్ మిషన్ లాంటివి) అప్పుడు లేవు. ఆర్థిక సమస్యలూ, అనారోగ్యం సరేసరి! పెద్ద కుటుంబం, చిన్న ఇల్లు, ఇల్లంతా బంధువులతోటి, మిత్రులతోటి నిండి ఉండేది. కమ్యూనిష్టు భావాలు కలిగివుండటాన పనిచేసే చోట మేనేజ్‌మెంట్ నుండి మానసిక వత్తిడి, హింస ఎక్కువగా ఉండేవి. ఇటువంటి పరిస్థితులలో నిరంతర అధ్యయనం - రాహుల్జీ, యశ్‌పాల్, ప్రేమ్‌చంద్ లాంటి ప్రముఖుల అనువాదాల్ని ఎలా చేయగలిగారో? అని అనిపిస్తుంది. పేపరు కింద కార్బన్ పెట్టుకొని, వేసవి వడగాలులలో, చెమటను తుండుతో తుడుచుకుంటూ రాసేవారనీ, రాహుల్జీని అనువదించేటప్పుడు అన్నం తింటూ మధ్యలో వెళ్ళిపోయి చెయ్యి కడుక్కునే వారని అమ్మ చెప్పేది. తన సొంత రచనలు ఎంతో శ్రమకోర్చి అనువాదం చేసిన అనువాదాలు అనేకం పోగొట్టుకున్నారు. అవి వెలుగులోకి రావాలనీ, ఆ ఆణిముత్యాలను తెలుగు పాఠకులకు అందించాలనీ తపన పడేవారు.

ప్రస్తుత సమాజంలో సాహితీపరుల బాధ్యతను గుర్తుచేస్తూ... కవి ధరించవల్సింది కలమా? ఖడ్గమా? అన్న మీమాంస వచ్చినప్పుడు.. సుబ్బారావు పాణిగ్రాహిలా కలంతో పాటు ఖడ్గాన్ని కూడా ధరించవల్సిందేనని అనేవారు. భవిష్యత్ తరాలు తప్పనిసరిగా 'నావీ-నాదీ' లేని సమాజాన్ని నిర్మించుకుంటారని, అలాంటి సమాజాన్ని నిర్మిద్దామని కలలు కనేవారు. ఐతే అప్పటిదాకా ఎంతమంది మానవులు రక్తతర్పణం కావించాలో? అని అంటూనే తప్పకుండా ఆ రోజులు వస్తాయని విశ్వసించేవారు.

అనేక అవమానాలకూ, ఆర్థిక బాధలకూ, దారిద్ర్యానికి అత్యంత దారుణంగా గురయ్యారు. 'జీవితంలో తాను అనుకున్నవి ఏవీ అనుకున్నట్లుగా జరుగలేదని కనీసం చావైనా ప్రశాంతంగా రావాలని' కోరుకున్నారు. ఆయన చనిపోయేదాకా గుంటూరులోని ఎ.టి. అగ్రహారం, 7వలైనులో దాదాపుగా 10 సంవత్సరాల పాటు ఉన్నారు. చనిపోయేనాటికి ఇంటి అద్దె 2,200 రూపాయలు. ఇంటి నేల గచ్చునేల కాదు. మట్టినేలకు ఎర్రకళాయ వేశారు. అందుకే కొంచెం తక్కువ అద్దె తీసుకునేవారు. ఆయన చనిపోయాక "ఇంత గొప్ప వ్యక్తి! గొప్ప సాహితీవేత్త! అనుకున్నది ఆచరించి చూపే నిజాయితీపరుడు. దహన కార్యక్రమాలు అయ్యేదాకా ఇంటి అవరణలోనే ఉంచండి. బయట ఉంచవద్దని". ఇంటి ఓనరు చెప్పారు. ప్రశాంతంగా చనిపోవాలన్నది ఒక్కటి మాత్రమే ఆయన జీవితంలో అనుకున్నది అనుకున్నట్లుగా జరిగింది. కానీ అలా జరిగినట్లుగా ఆయనకు తెలియదు కదా!

ఈ ప్రపంచాన్ని అర్థం చేసుకోవటంలో తనకు "కమ్యూనిస్టు, మార్క్సిస్టు, మావోయిస్టు భావజాలం తోడ్పడ్డాయనీ, తనను మనిషిగా తీర్చిదిద్దాయనీ అటువంటి ఆ భావజాలానికీ, ఆలోచనా విధానానికీ, ఆచరణకూ అత్యంత కృతజ్ఞుణ్ణయి, వినమ్రుణ్ణయి తలవంచుకు అభినందనలు తెలియపరుచుకుంటున్నానని సగౌరవంగా చెప్పుకున్నారు.

ఆయన ఆశయాలను, ఆదర్శాలనూ, నమ్మిన సిద్ధాంతాలనూ గౌరవించి, కొనసాగించడమే కా. ఆలూరి భుజంగరావు గారికి మనమిచ్చే నివాళి... శిరస్సువంచి, చేతులు జోడించి వినమ్రంగా నమస్కరిస్తూ.. జోహార్లు చెప్తూ... కన్నీటి పర్యంతమవుతూ... అశ్రునయనాలతో...

(గమనిక : 16 జూన్, 2014 నాడు ఆంధ్రజ్యోతి దినపత్రిక "వివిధ" లో ప్రచురితమయినది.)





*(కా. గంటిప్రసాదంపై వచ్చిన ఈ రచన అప్పటి ప్రత్యేక సంచికలో ప్రచురించలేకపోయాం. ఆయన తొలి వర్ధంతి సందర్భంగా.... - సం.)*

# విప్లవ కృషికి విలువైన చిరునామ

- ఎల్. అరణ్య

ఒక మనిషి మనిషిగా జీవించడం కోసం పాటించవలసిన విలువలు, ఆదర్శాలను జీవితమంతా ఆచరించడం, పాటించడం, అందుకోసం మొత్తం జీవితాన్ని పణంగా పెట్టి నిలుచోవడం ఎంత కష్టమంటే చాలా అరుదైన వ్యక్తుల విషయంలో తప్ప ఎవ్వరికీ సాధ్యం కాని పని. ఒకవేళ అలా ఉన్నతాదర్శాలకు నిలబడ్డ వ్యక్తులు తమ మానవీయ విలువలను కొనసాగిస్తే సమాజాలు, రాజ్యాలు హర్షించాల్సింది పోయి, సమాజంలోని పౌరులకు వారిని ఆదర్శంగా చూపించాల్సింది పోయి వారిని తమకు, తమ మార్గానికి అడ్డువస్తున్న వారిగా చూస్తూ వారిని భౌతిక నిర్మూలనగావించే ప్రయత్నాలు చేస్తున్నాయి. చరిత్రలో ఇలాంటి సందర్భాలు కొత్తేం కాకపోయినా అలాంటి గొప్ప వ్యక్తులు, వారి విలువలు రాజ్యపు కబంధ హస్తాలలో చిక్కి నశించిపోవడం ఏ కాలానికి ఆ కాలమే మరిచిపోలేనంత బాధాకరం.

గంటి ప్రసాదం పరిపూర్ణ మానవుడు అనే అతిశయోక్తిని వాడలేను గానీ పరిపూర్ణత్వాన్ని చాలా మట్టుకు పొందిన వాడని మాత్రం చెప్పగలను. ఏ ప్రజలకు కన్నీరు ఉందో, ఏ ప్రజలు బాధలతో, అసమానతలతో కష్టాలు అనుభవిస్తున్నారో ఆ ప్రజల బాగుకోరినవాడు, ఆ బాగుకై ఎక్కువగా అభిలషించినవాడే కాదు, అందుకై చాలా శ్రమించినవాడు. శ్రామిక ప్రజల, పేదల ఉద్యమాలకు సుదీర్ఘ నాయకత్వం వహించినవాడు. దళితులు, ఆదివాసులు, పీడితుల పక్షాన నిలబడ్డవాడు.

చంపడానికి రాజ్యానికి ఉన్న కారణాలు ఒకటేమిటి, బోలెడున్నాయి. సమర్థించుకోడానికీ దాని వాదనలు దానికి చాలానే ఉన్నాయి. ముఖ్యంగా ప్రసాదం మీద మావోయిస్టు 'మచ్చ' ఉన్నది. బహిరంగ జీవితంలోనూ మావోయిస్టు అనుకూల రాజకీయాల పట్ల ఆయనకు అభినివేశం ఉన్న కారణం ఉన్నది. ఆర్డీఎఫ్ అనే ప్రభుత్వానికి పక్కలో బల్లెమైన సంస్థకు ఆయన యావద్దేశానికి ఉపాధ్యక్షుడనే కోపమూ రాజ్యానికున్నది. మావోయిస్టు రాజకీయాలతో ప్రభావము, సంబంధము ఉన్న వారిని తాను ఏం చేసినా చెల్లుతుందని, ఎన్‌కౌంటర్ పేరిట చంపినా, ఖైదీలుగా జైళ్లలో కుక్కినా, చడీచప్పుడు కాకుండా లాకప్‌లలో చంపినా నడుస్తుందనే గొప్ప 'ధీమా' రాజ్యాని కున్నపుడు రాజకీయ ఖైదీలను విడుదల చేయాలనే డిమాండ్‌తో గొప్ప ఉద్యమాలే నడిపిన 'రాజకీయ ఖైదీల విడుదల కమిటీ'కి ఆయన కార్య నిర్వాహక సభ్యుడవటం రాజ్యానికి సహజంగానే నచ్చకపోవడమూ కారణంగా ఉంది. ఎన్‌కౌంటర్‌లలో చంపడాలు తన ఇష్టమే, దొంగ పంచనామా రిపోర్టులూ తన ఇష్టమే, పూడ్చడమైనా, కాల్చడమైనా తన ఇష్టమే అనే గొప్ప 'స్వేచ్ఛ' ఉన్న రాజ్యానికి, అమరుల బంధు మిత్రుల సంఘానికి బాధ్యుడుగా శవాలను కుటుంబీకులకు అందించమని తనను నిలదీసే పాత్రలో ప్రసాదం విజయం సాధిస్తుండడం పెద్ద అడ్డంకిగా ఉండడమూ ఉన్నది. నలభై ఏళ్లుగా తన పాశవిక రూపాన్ని నగ్నంగా ప్రజల ముందు నిలబెడుతున్న విరసంకు తమ వాడుగా ప్రసాదం ఉండడమూ రాజ్యం కోపానికి కారణంగా ఉన్నది. లొంగిపోయాక అనేకమంది 'మాజీ'లలాగే రియల్ ఎస్టేట్ భూ దందాలు లేదా బెదిరింపులతో సెటిల్‌మెంట్లు చేసుకుంటూ మావోయిస్టుల స్థావరాల జాడలు బైటపెట్టే పోలీసుల సమాచార వాహకులుగా ఉండటం కాకుండా మావోయిస్టు రాజకీయాలు అందించిన ఉదాత్త విలువలతో బతకడం అనే రాజ్యం దృష్టిలోని 'నేర ప్రవృత్తి' ప్రసాదంకున్నది. ఎక్కడో అడవులలో అయితే పర్లేదుగానీ జనం మధ్యన ఉంటూ, అందునా 'ప్రజాస్వామ్య' ప్రభుత్వాల పాలనలో జీవిస్తూ ఉన్నత విలువలకు కట్టుబడటమేమిటనే అభ్యంతరమూ రాజ్యానికున్నది. ఫలితమే గంటి ప్రసాదం పాశవిక హత్య.

1949లో విజయనగరం జిల్లా బలిజపేట మండలం చెక్కపల్లెలో ఒక మధ్య తరగతి బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన ప్రసాదం బొబ్బిలిలో విద్యాభ్యాసం ప్రారంభించి 1970లో గ్రాడ్యుయేషన్ పూర్తి చేసుకున్నాడు. యువకునిగా ఉన్నపుడు వెల్లువలా వచ్చిన శ్రీకాకుళం పోరాటంతో ప్రభావితుడైనాడు. పోరాటాలు, ముఖ్యంగా నక్సల్బరీ, శ్రీకాకుళం వంటి పోరాటాలు అందించిన స్ఫూర్తి ఎలా ఉంటుందంటే జీవితకాలం విప్లవాచరణతో బతికి, ఆ ఆచరణను దేశమంతా వ్యాపింపజేసే ఒక విశాల లక్ష్యం, లక్ష్య సాధనా నిబద్ధత ఉంటుంది. అలాంటి వ్యక్తుల మరణమూ చక్రీయంగా ఆ లక్ష్య సాధనకే దోహద పడుతుంది. అలాంటి పోరాటాల ప్రభావం ప్రసాదంపై ఎక్కువగానే పడింది. జౌళి, చక్కెర మిల్లు ఉద్యమం నుంచి కళాసి సంఘం స్థాపించే వరకు ప్రసాదం చాలా ఉద్యమాలలో చురుగ్గా పాల్గొన్నాడు. ఆ తర్వాత క్రమంగా ప్రసాదం భావాలు ట్రేడ్ యూనియన్ ఉద్యమాల నుంచి విప్లవ భావజాలం వైపుకు మళ్లాయి. అదే సమయంలో 1970లో విప్లవ రచయితల సంఘం, 72లో జననాట్య మండలి ఏర్పడటంతో 73లో విరసంలో చేరి తర్వాత కాలంలో వాటితో పూర్తి మమేకమై పనిచేశాడు. చారు మజుందార్‌తో ప్రభావితుడైన, సిపిఐ(ఎంఎల్) కేంద్ర కమిటీ సభ్యుడు మామిడి అప్పలసూరి ఆలోచనలు ప్రసాదంను చాలా ప్రభావితం చేశాయి. 74 నుంచి ఆయన నాయకత్వంలోని సిపిఐ(ఎంఎల్)లో పనిచేశాడు. పోలీసు అరెస్టులు, మిల్లు యజమానుల దాడులతో ప్రసాదం ఎమర్జెన్సీ సమయంలో అజ్ఞాతంలోకి వెళ్లి పోవాల్సి వచ్చింది. 1977లో అరెస్టయ్యాడు. అదే సమయంలో అప్పలసూరి, కొండపల్లి సీతారామయ్య మధ్య విభేదాలు ఏర్పడి సిపిఐ(ఎంఎల్) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ (తర్వాత 1980లో అది పీపుల్స్‌వార్ పార్టీగా ఏర్పడింది) పునరుద్ధరణ జరిగినప్పుడు, అటు తర్వాత అప్పలసూరి పార్టీ 1982లో సిపిఐ(ఎంఎల్) పార్టీ యూనిటీతో కలిసినప్పుడు కూడా ప్రసాదం అప్పలసూరితోనే ఉన్నాడు. దేశ వ్యాప్తంగా విప్లవ పార్టీలన్నింటి ఐక్యతకూ ప్రసాదం

నిరంతరంగా శ్రమించాడు. ఒకే లక్ష్యం ఉన్ననూ మార్గాలు వేరుగా ఉండి విభజనకు గురైన మార్క్సిస్టు లెనినిస్టు పార్టీలన్నింటినీ ఒక్క తాటిపైకి తెచ్చి ఒకే విప్లవపార్టీ ఉంటే రాజ్యానికి బలమైన శత్రువును అందించినట్లవుతుందనే కోరికతో చాలా శ్రమించి పార్టీల మధ్య అనేక చర్చలు జరిపాడు. ఒకవైపు ఆ కృషితో పాటే మరోవైపు బొబ్బిలిలో ఒక బలమైన విద్యార్థి, యువజన, కార్మిక సంఘ నాయకునిగా ప్రసాదం నిర్వహించిన పాత్ర మరిచిపోలేనిది. హోటల్, సినిమా, మిల్లు వంటి ఏ వ్యాపార సంస్థలు, కర్మాగారాలైనా వాటిలో పనిచేసే కార్మికులను ఏకం చేసి వారితో సంఘం పెట్టించాడు. వాటన్నింటి మధ్య సమన్వయం చేయడంలోనూ ప్రసాదం ముఖ్యపాత్ర పోషించాడు.

1997లో అప్పలనూరి మరణించడంతో 1998లో సిపిఐ(ఎంఎల్) పార్టీ యూనిటీ, సిపిఐ(ఎంఎల్) 'పీపుల్స్‌వార్'లో విలీనమైంది. అదే సమయంలో 1998 ఆగస్టులో ఆయన తమ్ముడు, పీపుల్స్‌వార్ పార్టీ సభ్యుడు అయిన గంటి సుబ్రహ్మణ్యం బూటకపు ఎన్‌కౌంటర్‌లో మరణించాడు. తర్వాత పీపుల్స్‌వార్ కార్యకర్తగా ప్రసాదం మరోసారి అజ్ఞాతంలోకి వెళ్లాడు. అప్పటి నుంచీ దేశంలోని బూర్జువా రాజకీయ వ్యవస్థను పెకలించి శ్రామిక జీవితాలలో సామ్యవాద వెలుగులను నింపాలనే లక్ష్యంతో పనిచేస్తున్న పీపుల్స్‌వార్‌కు ఒక నిజాయితీ కలిగిన, శిక్షితుడైన కార్యకర్తగా ప్రసాదం పనిచేస్తూ వచ్చాడు. సహజంగానే భావజాలంతో పరిచయమున్న వాడిగా కార్యకర్తలలో భావజాల వ్యాప్తి చేస్తూ వచ్చాడు. పార్టీలో 'క్రాంతి' పత్రిక బాధ్యత తీసుకున్నాడు. అటు నుంచి 2004లో రాష్ట్ర కమిటీ అధికార ప్రతినిధి అయ్యాడు.

2004 శాంతి చర్చల తదనంతర పరిణామాల పరిశీలకునిగా పార్టీ అప్పగించిన బాధ్యతలను నెరవేర్చడంలో భాగంగా మహారాష్ట్రలోని ఔరంగాబాద్ గెస్ట్‌హౌస్‌లో విరసం సభ్యులతో సమావేశమవగా 2005 మేలో పోలీసులు అరెస్టు చేశారు. రాజ్యం ఆయనపై ఔరంగబాద్ కుట్ర కేసు మోపింది. 2006లో బెయిల్‌పై బయటకు వచ్చి బహిరంగ జీవితం ప్రారంభించాడు. ఆ తర్వాత ఆయన మీద పెట్టిన చాలా కేసులలో ఆయనను నిర్దోషిగా కోర్టులు తీర్పిచ్చాయి.

2010లో ఒరిస్సా అడవులలోకి వెళ్తూ కోరాపుట్ జిల్లా సిమ్లిగూడ దగ్గర అరెస్టైన బృందాన్ని (యుఎపిఎ కింద) ఆ అడవులలోకి పంపిన వ్యక్తిగా ఆరోపిస్తూ ప్రసాదంను అరెస్టు చేశారు. ఆ సమయంలో ఆయనను విడుదల చేయాలని స్వయాన మావోయిస్టు పార్టీ ప్రకటన కూడా ఇచ్చింది. ఒరిస్సా కలెక్టర్ వినీల్‌కృష్ణ కిడ్నాప్ సమయంలో పార్టీ ముఖ్య డిమాండ్‌లలో అది ఒకటిగా ఉంది. ఈ విషయాన్ని గురించే అప్పుడు కిడ్నాప్ మధ్యవర్తిగా వ్యవహరించిన ప్రొ. హరగోపాల్ జైల్లో ప్రసాదంతో ప్రస్తావించినపుడు, నా బదులు అక్రమంగా జైళ్లలో నిర్బంధించ బడిన వేలాది ఆదివాసుల విడుదలకు ప్రయత్నించండి.' అని అన్నాడు. ఒక కార్యకర్త కంటే అనేకమంది ప్రజలే ముఖ్యమని భావించిన లాటిన్ అమెరికా పోరాట వీరులను తలపిస్తూ ప్రసాదం మాట్లాడిన తీరులోని విశాలతత్వం ప్రజల పట్ల ఎంతో ప్రేమ ఉంటేగాని అలవడని అరుదైన లక్షణం.

బయటికి వచ్చాక బహిరంగ జీవితంలో కూడా ఆయన ఏ రోజూ విశ్రాంతి తీసుకోలేదు. నిమిషం ఖాళీ ఉండకుండా ప్రజా సంఘాల కార్యక్రమాలో, సమావేశాలో, రచనలో, సంఘాల సమన్వయమో, చర్చల్లోనో ఏదో ఒక ప్రజా కార్యక్రమంతో తీరిక లేకుండా ఉండేవాడు. బూటకపు ఎన్‌కౌంటర్లను ఖండిస్తూ పోలీసుల, ప్రభుత్వాల తప్పుడు పనులను ఎత్తిచూపుతూ ముఖ్యంగా కార్మికులకు, ఆదివాసులకు, పేద ప్రజలకు చైతన్యం కలిగిస్తూ వచ్చాడు. అది ప్రభుత్వానికి నచ్చలేదు. అందుకే జూలై 4 మధ్యాహ్నం 3.40కి నెల్లూరు ప్రభుత్వాసుపత్రి బైట ముగ్గురు ప్రభుత్వ గూండాల తుపాకులకు వేట కొడవళ్లకు బలైపోయాడు. అమరుల బంధు మిత్రుల సంఘం సమావేశానికి, విరసం వార్షిక సమావేశానికి హాజరైన ప్రసాదం అది పూర్తయ్యాక చావు బతుకుల్లో ఉన్న ఒక అమరుని సోదరిని ఆసుపత్రిలో చూడటానికి వెళ్లి బైటకు రాగానే పొంచివున్న హంతకుల దాడికి గురయ్యారు. ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరణించాడు.

బొబ్బిలి మొదలు ఉద్దానం వరకు విప్లవాభిమానులు అందరూ ఆయనను గురువుగానే పిలుస్తారు. రాజకీయ ఖైదీలు, అమరుల బంధుమిత్రులు పోరాటాల స్ఫూర్తిగా భవిష్యత్తులోనూ పురోగమించినా, ఆ పోరాటాలలో ప్రసాదం లేని ఖాళీ కొట్టొచ్చినట్టే కనబడుతుంది. తీవ్ర నిర్బంధంలోనూ సమకాలీన రాజకీయ, సాహిత్య వేదికలలో విప్లవ భావజాలాన్ని ప్రసరింపచేసిన ప్రసాదం లేని లోటు కనిపిస్తుంది. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను ఇప్పుడు ఆంధ్రప్రదేశ్ నడిబొడ్డుకు తెచ్చి, ముందు దేశంలోని అన్ని ప్రాంతాలకూ విస్తరించే సంకేతాలిచ్చిన ప్రభుత్వాల తాత్కాలిక విజయ గర్వానికి విప్లవాన్ని కాంక్షించే పీడిత ప్రజలు కొంత తడబడవచ్చు. అయితే ప్రజల పక్షాన నిలిచిన వారిపై కేసులు పెట్టడం, బెదిరించడం, కిడ్నాపులు చేయడం, దాడులు చేయడం, చివరకు హత్యలు చేయడం, పోలీసుల సహాయంతో అమలు చేస్తూ వస్తున్న ప్రభుత్వాలకు, తన మరణం సమయంలోనూ, 'రాజ్యం నన్ను చంపవచ్చు కానీ నా భావాలను చంపలేదు' అన్న ప్రసాదం భావాలలోని ధైర్యాన్ని అవాహన చేసుకొని, పీడిత ప్రజల పోరాటాలు తప్పకుండా పురోగమిస్తాయి. విప్లవ కార్యక్రమాలపై భయం వల్లనే ప్రభుత్వం ఇలాంటి హత్యలు చేస్తున్నదని గుర్తించి ప్రభుత్వానికి ఆ భయాన్ని అలాగే స్థిరపరిచేలాగా మరిన్ని విప్లవోద్యమాలు మొలకెత్తుతాయి.



*(కా. గంటిప్రసాదంపై వచ్చిన ఈ రచన అప్పటి ప్రత్యేక సంచికలో ప్రచురించలేకపోయాం. ఆయన తొలి వర్ధంతి సందర్భంగా.... - సం.)*

# బేతాళుడు చెప్పని కథ!

**- నందిగం కృష్ణారావు**

హంతకుడు ఎర్రగా కాలుతున్న తన చేతుల్ని చూసి భయపడి పోయాడు. "హమ్మో బాబోయ్" అని కేకలు పెట్టాడు. ఎప్పుడో చచ్చిపోయిన అమ్మ వాడి హృదయాన్ని కాల్చేసింది. "మంట మంట" అంటూ హృదయాన్ని చరుచుకున్నాడు. ఛాతీ మండ సాగింది.

"ఆర్పండి ఆర్పండి ఈ మంటల్ని ఆర్పండి. కాలిపోతున్నాను బాబోయి" అని అరిచాడు.

తను తలకు కొరివి పెట్టిన తండ్రి కొరివై వాడి నెత్తిని దహించ సాగాడు.

కాళ్ళకింద అద్దంలాంటి స్వచ్ఛమైన నీట్లో వాడు దహించుకు పోతున్నాడు. అదేమిటి నీళ్ళు మండుతున్నాయి? ఇందులోకి దూకలేదు. దూకితే మాడి మసై పోయేవాణ్ణి. "నన్ను నేను రక్షించుకోవాలి. ఎలాగ? నీళ్ళే నిప్పై మండుతున్నప్పుడు తనని దహించే ఈ అగ్నిని చల్లార్చడం ఎట్లా?"

ఇవి నీళ్ళు కాదు - హతుల బంధుమిత్రుల కన్నీళ్ళు. ఆ కన్నీటిలో వాళ్ళ గుండె మంటలున్నాయి. అందుచేతే అవి తనని దహిస్తున్నాయి.

అదిగో గంటి ప్రసాదం, బంధు మిత్రులలో నేనున్నా నంటున్నాడు.

బంధుమిత్రుల తరపున నేనున్నానంటున్నాడు.

ఎంతో ఉత్సాహంగా, సజీవంగా కృష్ణుడిలా నడుముకి చేతులానించి మాట్లాడుతున్నాడు. కాదు కాదు కాళిందీ మర్దనం చేస్తున్నాడు. అతని కాళ్ళ కింద తను కక్కుతున్న మంటలు తనని దహిస్తున్నాయి. తనని తాను కాపాడుకోవాలంటే నీట మునగలేడు. రక్తంతో మాత్రమే తనని తాను చల్లార్చుకోవాలి. మ్యాన్ హంట్ జరగాలి. తనని దహిస్తున్న మంటల్ని కడుపులో దాచుకోవాలి. అప్పుడే మనుషుల్లో హంతకుల్ని పోల్చుకోలేరు.

మాటు వేసాడు హంతకుడు.

చిర్నవ్వు నవ్వాడు ప్రసాదని చూసి

పసి వాళ్ళు పాలనవ్వుల్నే చూడగలుగుతారు.

మంటల్లో కూడా సూర్యకాంతినే చూడగలుగుతారు.

పాము కాటేస్తుందనుకోరు. మెడలో హారంలా కనిపిస్తుంది వాళ్ళకి. అందుచేతే ఆ అరవై ఏళ్ళు పైబడ్డ పసివాడు హంతకుణ్ణి గుర్తించలేదు.

హంతకుడి వేటుకు బలయ్యాడు. అతని ఒంట్లోంచి చిందిన రక్తం నెల్లూరు నించి బొబ్బిలి దాకా నేలని మండించింది.

నేలంతా కాలుతున్న జన ప్రవాహం నించి తనని తాను చల్లార్చుకోలేడు హంతకుడు.

నెత్తుట్లోనూ, నిప్పుల్లోనూ ఎవరూ స్నానం చెయ్యలేరు.

నేల మీద, నీటిలోనూ, నింగిలోనూ చోటులేని హంతకుడు దహించుకుపోక తప్పదు.

హంతకుడు ఎర్రగా కాలుతున్న కాళ్ళని చూసుకొని భయపడిపోయాడు.

పిరికి వాళ్ళెప్పుడూ హంతకులౌతారని గంటిప్రసాదం గంటకొట్టి మరీ చెప్పాడు.



**కరపత్రం**

## విప్లవ రచయితల సంఘం పుట్టిన రోజు సందర్భంగా విరసం సదస్సు

జులై 4 అనగానే విరసం పుట్టుక నుండి అమెరికన్ విప్లవం దాకా అనేక సంఘటనలు గుర్తుకొస్తాయి. కానీ ఈసారి జులై 4 అనగానే గంటి ప్రసాదం హత్య గుర్తుకొస్తోంది. గత సంవత్సరం జులై 4న విరసం వేదికపై మాట్లాడి వేదిక దిగిన గంట వ్యవధిలోనే నెల్లూరు నడిబొడ్డున జరిగిన గంటి హత్య తాలూకు ఆచూకీ ఇంతవరకు పోలీసులకు దొరకలేదు! ఇదొక పెద్ద ఆశ్చర్యం!!

దండకారణ్య కేంద్రంగా దేశవ్యాప్తంగా విస్తరిస్తున్న విప్లవోద్యమాన్ని ఎదుర్కొనడానికి పాలక వర్గాలు అనుసరిస్తున్న దుర్మార్గపు విధానం ఇది. అహింసా సిద్ధాంతాన్ని వల్లించే పాలక వర్గాలు ఆయుధం పట్టని విప్లవ రచయితలపై, మేధావులపై ఆయుధంతో దాడి చేస్తున్న అన్యాయపు నీతి ఇది. అందరి మధ్య ఉన్నప్పుడు సరే - అజ్ఞాతంలో ఉన్నా ఆత్మరక్షణకైనా ఆయుధం పట్టని వ్యక్తి గంటి ప్రసాదం. ఆయన ప్రథమ వర్ధంతి సందర్భంగా ఈసారి విరసం సదస్సును జరుపుకుందాం.

**కార్యక్రమం :**

అధ్యక్షత : వి. చెంచయ్య; మొదటి అంశం : దండకారణ్య ఉద్యమం; వక్త : పాణి; రెండవ అంశం : శ్రీకాకుళ పోరాటం-సాహిత్యం; వక్త : జి. కళ్యాణరావు; విప్లవ గీతాలాపన ఉంటుంది.

తేది : 4-7-2014, శుక్రవారం; సమయం : ఉదయం 9.30 గంటల నుండి మధ్యాహ్నం 1.00 గంట వరకు

స్థలం : టౌన్ హాల్, నెల్లూరు.

**- విప్లవ రచయితల సంఘం**

సంస్మరణ



# ఓం ప్రకాశ్ వాల్మీకి

పొయ్యి మట్టిది
మట్టి చెరువుది
చెరువు ఠాకూరుది

ఆకలి రొట్టె కోసం
రొట్టె జొన్నలది
జొన్నలు చేనువి
చేను ఠాకూర్‌ది

ఎడ్లు ఠాకూర్‌వి
నాగలి ఠాకూర్‌ది
నాగలి నడిపేది మన చేతులు
పంటలు ఠాకూర్‌వి

బావి ఠాకూర్‌ది
నీళ్లు ఠాకూర్‌వి
పొలమూ తోటా ఠాకూర్‌వి
వీధులు భవనాలు ఠాకూర్‌వి

మరి మనదేమిటి?
ఊరా?
నగరమా?
దేశమా?

హిందీ దళిత సాహిత్యంలో 'ఝూటన్' ఒక మైలురాయి వలె నిలిచిపోతుంది. 1997లో వెలువడీ వెలువడగానే ఇంగ్లిష్‌తో సహా ఎన్నో భాషల్లోకి అనువదించబడిన ఓంప్రకాశ్ వాల్మీకి స్వీయకథ పెద్ద సంచలనమైంది. అయితే 1989లో వెలువడిన 'సదియోంకా సంతాప్' (తరతరాల దుఃఖం) కవితా సంకలనం దళిత సాహిత్యానికి ఒక నూతన దశను చూపింది. 2000 సంవత్సరం తర్వాత ఆయన రచించిన 'దళిత సాహిత్యకా సౌందర్య శాస్త్ర, వాల్మీకి కులం చరిత్ర', 'సఫాయి దేవత' వెలువడినాయి. ఆయన రచనలు సమాజం - సాహిత్యంల గురించిన తాత్విక గాఢతతో నిండి ఉంటాయి. డెహ్రాడూన్‌లో రక్షణ శాఖ పరిపాలనా విభాగంలో పనిచేసిన ఆయన కొద్దికాలం హైదరాబాద్‌లో ఇఫ్లూలో కూడ విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేసాడు.

ఐక్యరాజ్యసమితి సామ్రాజ్యవాద ప్రపంచీకరణ రాజనీతిలో భాగంగా 'మానుఫాక్చరింగ్ డిసెంట్'కు (నిరసనను ఉత్పత్తి చేయడానికి) పూనుకొని వర్ల్డ్ సోషల్ ఫోరమ్‌ను స్వచ్ఛంద సంస్థలతో నిర్వహించడం ప్రారంభించింది. అందులో భాగంగానే హైదరాబాద్‌లో ఆసియా సోషల్ ఫోరమ్, ముంబైలో వర్ల్డ్ సోషల్ ఫోరమ్ నిర్వహించింది. బహుళజాతి కంపెనీల నిధులతో నడిచే స్వచ్ఛంద సంస్థలు ఆధునికానంతర భాషలో సామ్రాజ్యవాద వ్యతిరేకతను ప్రదర్శిస్తూ చాలమంది ఉదారవాద ప్రజాస్వామ్యవాదులనే కాకుండా ఎంతో కొంతమేరకు నిజాయితీతో లౌకిక ప్రజాస్వామ్యంలోనూ, సామాజిక మార్పులోనూ విశ్వాసం ఉన్నవారిని కూడ ఇందులోకి లాగినవి. ఈ ప్రమాదాన్ని పసిగట్టిన మూడు వందలపై చిలుకు ప్రజా సంఘాలు ఎంఆర్ 2004 (ముంబై రెసిస్టెన్స్ 2004) పేరుతో ఈ వర్ల్డ్ సోషల్ ఫోరమ్ (ముంబై) ఆవరణకు ఎదురుగానే ప్రతిఘటనా కార్యక్రమాన్ని సదస్సు, ఊరేగింపు, బహిరంగ సభల రూపంలో పెద్ద ఎత్తున నిర్వహించింది. దీని ముందు వర్ల్డ్ సోషల్ ఫోరమ్ వెలవెలపోయింది. హబీబ్ తన్వీర్ వంటి నాటకకర్తలు మొదలుకొని ఓంప్రకాశ్ వాల్మీకి వంటి హిందీ సాహిత్యవేత్తలు ఈ సభలో పాల్గొని హిందుత్వ వ్యతిరేక లౌకిక ప్రజాస్వామ్యమైనా, బ్రాహ్మణీయ భావజాల ప్రతిఘటన, కుల నిర్మూలన, అస్పృశ్యత నిర్మూలన అయినా భూస్వామ్య, సామ్రాజ్యవాద దళారీ నిరంకుశ.సంస్కృతికి వ్యతిరేకంగా ఐక్యంగా చేసే పోరాటం ద్వారానే సాధ్యమని చెప్పారు.

తెలుగు నేల నుంచి వందలాదిగా ఎంఆర్ 2004లో పాల్గొన్న కార్యకర్తలు, కళాకారులు, బుద్ధిజీవులు ఓంప్రకాశ్ వాల్మీకి క్రియాశీల భూమికను గుర్తుపెట్టుకునే ఉంటారు.

ఓంప్రకాశ్ వాల్మీకి 2013 నవంబర్‌లో లివర్ క్యాన్సర్‌తో మరణించాడు.

తెలంగాణ మాత్రమే కాదు ప్రజాస్వామ్యమూ, సామ్యవాదం కూడ శాంతియుతంగా సాధ్యమే అని చెప్పడానికి హైదరాబాద్‌లో దళిత ఐఎఎస్, ఐపిఎస్‌ల సహకారంతో రాజకీయ నాయకుల చొరవతో, యాక్షన్ ఎయిడ్ సహాయంతో, వేదాంత దీవెనలతో డైలాగ్ విత్ డెమోక్రసీ అనే పేరుతో అందుకోసమే పుట్టుకొచ్చిన సంస్థ తెలంగాణ విద్యావంతుల వేదికను, సెంటర్ ఫర్ దళిత స్టడీస్‌ను ముందుపెట్టి కత్రియా హోటల్లో పదిహేను వందల రూపాయల ప్రవేశ రుసుముతో ఒక అంతర్జాతీయ సదస్సు నాలుగు రోజుల పాటు నిర్వహించింది. దళిత, ఆదివాసీ సంస్థలు మొదలు విప్లవ సంస్థలు అని చెప్పుకునే ఎన్నో ప్రముఖ సంఘాలు, వ్యక్తులు ఇందులో పాల్గొన్నారు. వీళ్లందరికీ వెనిజులా నుంచి వచ్చిన హర్నేకర్‌తో శాంతి, పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రయోగ పాఠాలు చెప్పించారు.

వీళ్లంతా ఉద్దేశపూర్వకంగానే ఎంఆర్ 2004లో పాల్గొన్న ఓంప్రకాశ్ వాల్మీకిని విస్మరించారు. కళ్లముందరి పదిహేను వందల మంది యువకుల ఆత్మహత్యలను, నిర్బంధాలను, రాజ్యహింసను శాంతియుతమని భావించే వారికి పదేళ్ల కిందటి సందేశం గుర్తుంటుందా?





## దిశా సాంస్కృతిక కళా మంచ్ - హర్యానా

# 'జిందాదిల్' 'జిందాబాద్' దేవేందర్

- వివి

తెలుగు నేల మీద ఎఐపిఆర్ఎఫ్, ఫోరమ్ అగెయినెస్ట్ ఇంపీరియలిస్ట్ గ్లోబలైజేషన్ వంటి అఖిల భారత సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట సంస్థల సభలు చూసిన వారికి హర్యానాకు చెందిన 'దిశా' సాంస్కృతిక కళా మంచ్ పరిచయాన్ని ప్రత్యేకించి చేయనక్కర్లేదు. ముఖ్యంగా 1991 సామ్రాజ్యవాద ప్రపంచీకరణతో ప్రారంభించి 2004 వరకు దేశవ్యాప్తంగా హిందీలో పాటలు, స్ట్రీట్ ప్లేలు ప్రదర్శించడంలో పదునైన శ్రామికవర్గ దృక్పథంతో పాటు సృజనాత్మకతను, నూతనత్వాన్ని, నైపుణ్యాన్ని కళా ప్రదర్శనలకు జోడించిన సంస్థ 'దిశా' సాంస్కృతిక కళా మంచ్.

1996 ఫిబ్రవరిలో ఢిల్లీలో జాతుల సమస్యపై ఎఐపిఆర్ఎఫ్ నిర్వహించిన అంతర్జాతీయ సదస్సులో సమర్పించిన పత్రాలకు, విలియమ్ హింటన్, గుగీ వా థియాంగో వంటి ప్రముఖ ప్రపంచ ప్రఖ్యాత వ్యక్తుల భాగస్వామ్యానికి ఎంత ప్రాధాన్యముందో కళా, సాంస్కృతిక ప్రదర్శనలకు అంత ప్రాముఖ్యముంది. ఆ సదస్సుకు కొద్ది రోజుల ముందే నైజీరియాలో కెన్‌సారోవివా అనే కవిని, నాటక కర్తను ఉరితీశారు. ఆయన ఒగోనీ తెగకు చెందిన సాంస్కృతిక పోరాట యోధుడు. నైజీరియాలో ఈ తెగ నివసించే ఒగోని ప్రాంతపు చమురుపై బ్రిటిష్ పెట్రోల్ కంపెనీల ఆధిపత్యాన్ని తన జాతితో పాటు కెన్‌సారోవివా ప్రతిఘటించాడు. పోరాడాడు. ఆ పోరాటంపై కవిత్వం, నాటకాలు రాశాడు. చాలకాలంగా ఫ్రాన్స్‌లో ప్రవాసంలో ఉన్న నైజీరియా నాటకకర్త, కవి ఓలెసోయెంకా కూడ రహస్యంగా నైజీరియాకు వచ్చి ఈ ఉద్యమానికి మద్దతు తెలుపుతూ ఉండేవాడు. అతడు నోబెల్ బహుమతి గ్రహీత, ప్రవాసంలో ఉన్నవాడు గనుక, ఆయన ఈ పోరాటంలో పాల్గొంటున్నాడని చెప్పే తప్పుడు ఆరోపణలు చేయకుండా కెన్‌సారోవివాను వదిలిపెడతామని నైజీరియా నియంతృత్వ ప్రభుత్వం ప్రలోభపెట్టజూసింది. భయపెట్ట చూసింది. హత్యానేరంలో ఇరికించింది. అయినా కెన్‌సారోవివా ఇది చమురు మొదలైన వనర్లపై ఒగోని జాతి స్వావలంబన పోరాటమని ధైర్యంగా ప్రకటించాడు. ఉరికంబమెక్కాడు.

కెన్‌సారోవివా జీవితం - ఉరిశిక్ష ఇతివృత్తంగా దిశా సాంస్కృతిక కళా మంచ్ రూపొందించిన రూపకంతో ఢిల్లీ జాతుల సమస్య - అంతర్జాతీయ సదస్సు ప్రారంభించడం ఒక రోమాంచిత అనుభవం. (అటువంటిదే అమరురాలు కుమారి కేంద్రంగా జననాట్య మండలి ప్రదర్శించిన దీపాల నృత్యం - కశ్మీరులో భారతసైన్యం హత్యాచారాలు, అత్యాచారాలు, ప్రజల ప్రతిఘటనపై రూపకం).

ఈ దిశా సాంస్కృతిక కళా మంచ్ వ్యవస్థాపకుల్లో ఒకడైన దేవేందర్ నలభై ఒక్క సంవత్సరాల వయసులోనే 24 జూలై 2013న మరణించాడు. నాలుగు సంవత్సరాల క్రితం మెదడుకు సంబంధించిన జబ్బు వచ్చి ఇంక కదలని స్థితిలో ఉండిపోయాడు.

హరియానాలో రాగిణి అనే ఒక జానపద బాణీ, జానపద వాద్యం విస్తృత ప్రచారంలో ఉంది. దానిని విప్లవీకరించి - హర్యానా భూస్వామ్య కాప్ పంచాయితీ సంస్కృతిపై, ఘూంగట్ (స్త్రీలు పురుషులకు మొహం చూపకుండా నిండా కప్పుకోవాల్సిన ముసుగు) పై సాంస్కృతిక బృందం ఎన్నో పాటలు ప్రజాస్వామిక దృక్పథంతో రాసింది. హరియానాలో నుక్కడ్ (వీధి) నాటకం, విప్లవ గీతాలాపనలో దేవేందర్ ఎల్లవేళలా క్రియాశీలంగా ఉండేవాడు. డంకెల్ డ్రాఫ్ట్, గాట్, ప్రపంచ వాణిజ్యమండలి వంటి వాటికి వ్యతిరేకంగా ఆయన నాయకత్వంలో దిశ ఎన్నో ప్రదర్శనలిచ్చింది. అఫ్ఘనిస్తాన్‌పై, ఇరాక్‌పై అమెరికా సామ్రాజ్యవాద దాడి, దురాక్రమణలకు వ్యతిరేకంగా జరిగిన ఎన్నో సాంస్కృతిక ప్రదర్శనల్లో దేవేందర్ ముఖ్య భూమిక నిర్వహించాడు. మంచి నటనా కౌశల్యమున్న కళాకారుడు.

పాట, నాటక, నాటిక రచన వంటి సాంస్కృతిక కళా రూపాల సృజన కోసం ఆయన నాయకత్వంలో 'దిశా' సాంస్కృతిక మంచ్ ఎన్నో వర్క్‌షాప్‌లు నిర్వహించి ఒక నవయువతరానికి తర్ఫీదు ఇచ్చింది. ఎప్పుడూ నవ్వుతూ ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉండే దేవేందర్ ఈ బృందం తలలో నాలుక వలె మసలుకునేవాడు. ఎఐఎల్ఆర్‌సి పర్యటనల్లో భాగంగా, ఎఐఎల్ఆర్‌సికి దిశా సాంస్కృతిక మంచ్‌కు ఉండే గాఢానుబంధం వలన నేను కురుక్షేత్ర, నర్వానా, అంబాలా, ఢిల్లీ వంటి ఎన్నో చోట్ల సభల్లో సాంస్కృతిక కార్యక్రమాల్లో పాల్గొన్నాను. వర్క్‌షాప్‌లో కూడ పాల్గొన్నాను. కురుక్షేత్రలో ఆయన, ఆయన సహచరి ఆరతిలకు చాలారోజులు పాటు అతిథిగా ఉన్నాను.

దిశా సాంస్కృతిక మంచ్ 'అభియాన్' అనే పేరుతో ఒక సాహిత్య పత్రిక కూడ నిర్వహించేది. ముఖ్యంగా యువకులను, విద్యార్థులను పాఠకులుగా దృష్టిలో పెట్టుకునే వారి నుంచే రచయితలను తయారు చేయడానికి పేరున్న రచయితలను కూడ సరళమైన, క్లుప్తమైన రచనలు చేయవలసిందిగా కోరుతూ ఆ పత్రికను నిర్వహించారు. 'ఎయిట్ లెగ్స్ ఎస్సే' అని మావో ఈసడించిన సుదీర్ఘమైన, క్లిష్టమైన రచనాశైలి వద్దని, సంపాదకవర్గం రచయితల ముందు తన లక్ష్యాన్ని కూడ ఉంచేది. అట్లా పత్రిక పదేళ్లు నిర్వహించాక ఒక సమీక్ష కోసం నర్వానాలో రెండు రోజుల వర్క్‌షాప్ నిర్వహించారు. 'అభియాన్'లో రాస్తున్న వాళ్లను, పాఠకులను, చిన్న సాహిత్య పత్రికలు నిర్వహించిన, నిర్వహిస్తున్న అనుభవం ఉన్న వాళ్లను, హర్యానా, పంజాబ్, రాజస్థాన్, ఢిల్లీలో రచయితలుగా గుర్తింపు ఉన్న వాళ్లను పిలిచారు. నేను కూడ ఈ రెండు రోజుల వర్క్‌షాప్‌లో పాల్గొన్నాను. ఆ రెండు రోజులూ ఎంతో ఆసక్తిదాయకమైన చర్చ జరిగి సంపాదకవర్గం అక్కడ వచ్చిన అభిప్రాయాలన్నీ క్రోడీకరించి, స్వీకరించదగినవి ఎట్లా తాము భవిష్యత్తులో దృష్టిలో పెట్టుకుంటామో చెప్పూ, రచయితల నుంచి, పాఠకుల నుంచి వచ్చిన అభిప్రాయాలలో పరిహరించదగిన అంశాల విషయాలను కూడ సుతిమెత్తగా ప్రస్తావిస్తూ నిర్వహించారు. ఆ విధంగా దిశా సాంస్కృతిక మంచ్ ఒక సాహిత్య, సాంస్కృతిక సమష్టి కృషిగా సాగడానికి, ముఖ్యంగా యువ నాయకత్వంతో సాగడానికి దేవేందర్ వంటి వాళ్ల కృషి ఎంతో తోడ్పడింది.

మంచి కళాకారుడే కాకుండా 'జిందాదిల్' అని సన్నిహితులు పిలుచుకునే దేవేందర్ ఇక లేడని నాకు చాల ఆలస్యంగా తెలిసింది. అయినా ఆయన లేకపోవడమేమిటి? ఆయన తెలిసిన అందరి హృదయాల్లో ఉంటాడు. జిందాదిల్ దేవేందర్ జిందాబాద్!



నివేదిక

మే 18 రౌండ్ టేబుల్ సమావేశం

# సాయిబాబా అరెస్టు - భావజాలాన్ని నిర్బంధించే చర్య

- బాసిత్

ఢిల్లీ యూనివర్సిటీ అధ్యాపకుడుగా పనిచేస్తున్న డా. సాయిబాబా అక్రమ అరెస్టును ఖండిస్తూ హైదరాబాద్, సుందరయ్య విజ్ఞాన కేంద్రం షోయబుల్లాఖాన్ సెల్లార్ హాల్‌లో మే 18 ఆదివారం మధ్యాహ్నం కవులు, రచయితలు, ప్రజా సంఘాలు, రాజకీయ పార్టీలతో విరసం ఆధ్వర్యంలో రౌండ్ టేబుల్ సమావేశం జరిగింది.

సమావేశాన్ని సమన్వయపరుస్తూ విరసం సభ్యుడు **రవిచంద్ర** 'రాబోయే నిర్బంధానికి డా. సాయిబాబా అరెస్టు సూచిక' అని అన్నారు. విప్లవ ప్రజాస్వామిక వేదికకు **ఉపకార్యదర్శిగా** పనిచేస్తున్న సాయిబాబా ఢిల్లీ యూనివర్సిటీలో సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాల్లో భాగంగా ప్రవేశపెట్టనున్న నాలుగేండ్ల డిగ్రీ కోర్సుకు వ్యతిరేకంగా ఉద్యమం నడిపాడని రవిచంద్ర అన్నారు. సాయిబాబాకు మావోయిస్టులతో భావజాల ఐక్యత ఉందనేది మనసులో పెట్టుకొని ఏదో పెటీ కేసు పేరు మీద ఢిల్లీ పోలీసులు అరెస్టు చేశారని, మే 9 కాలేజీలో పరీక్షలు నిర్వహించి వస్తున్న సందర్భంలో ఇది జరిగిందని, తదనంతరం గడ్చిరోలి పోలీసులు నాగపూర్ సెంట్రల్ జైలుకు తరలించి 'అండాసెల్'లో ఉంచారని రవిచంద్ర అన్నారు. 90 శాతం వికలాంగుడైన సాయిబాబా నాగపూర్ జైలులో నానా రకాల ఇబ్బందులతో సతమతం అవుతున్నాడని అన్నారు. అతనితో జాలీ ములాఖత్‌కు మించి అతని ఇబ్బందులను, అవసరాలను తీర్చే ఆదేశాలేవి లేవని జైలు అధికారులు అన్నారని నాగపూర్ జైలులో సాయిబాబాను సందర్శించి వచ్చిన రవిచంద్ర అన్నారు.

అఖిల భారత స్థాయిలో వివిధ ప్రజా సంఘాల్లో పనిచేస్తూ 91 నుండి ఢిల్లీలో ఉంటున్న డా. సాయిబాబా జాతీయ స్థాయి ఉద్యమాలకు కేంద్ర బిందువని విప్లవకవి, విప్లవ ప్రజాస్వామిక వేదిక అధ్యక్షులు **కామ్రేడ్ వరవరరావు** అన్నారు. గాంధీలాగ కాకుండా, అంబేద్కర్‌లాగా ఆలోచించి 'కాంతాపుర', 'అన్‌టచ్‌బుల్' తదితర ఆరు ఇంగ్లిషు నవలల మీద విమర్శను తన పిహెచ్.డి. థీసిస్ రాస్తూ బ్రాహ్మణిజానికి భూస్వామ్య, దళారీ స్వభావం ఉన్నదని సాయిబాబా విశదీకరించాడని కామ్రేడ్ వి.వి. అన్నారు. 'దొంగసొత్తు బరామద్' పేరిట ఢిల్లీ పోలీసులు ఆయన మీద పెటీకేసు పెట్టి – ఆయన ఇల్లు సోదా చేసే నెపంతో ఆయనింట్లోంచి నిజానికి 'బోలెడంత ఆంగ్ల సాహిత్యాన్ని' గడ్చిరోలీ పోలీసులు దొంగిలించుకు వెళ్లారని వివి అన్నారు. సాయిబాబాను పెట్టిన అండాసెల్‌లో హేమ్ మిశ్రా అనే జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్సిటీకి చెందిన వికలాంగ విద్యార్థిని భావజాలాన్ని సమర్థిస్తాడని కూడా ఉంచారని, పక్షవాతం వచ్చిన చేయిని బాగు చేసుకోవడానికి ప్రకాశ్ ఆమ్టే ఆసుపత్రికి 'ఆ మార్గాన' తప్ప మరో మార్గాన వెళ్లలేని స్థితిలో మావోయిస్టు పార్టీ అగ్ర నాయకుడు గణపతికి ఏదో స్లిప్ పంపుతున్నారని హేమ్ మిశ్రాను అరెస్టు చేశారని, ఫ్రీలాన్స్ జర్నలిస్టు ప్రశాంత్ రాహిని నారాయణ్ సన్యాల్‌ను కలవడానికి వెళ్తే జైలులో పెట్టి, తదనంతరం అతనితో పాటు సాయిబాబాను కూడా ఆ కేసులో పెట్టారని వివి అన్నారు.

గడ్చిరోలిలో దొరికిన మావోయిస్టు పార్టీ వేయించిన కరపత్రంలో సాయిబాబా అరెస్టును ఖండిస్తూ – ఉంది కనుక సాయిబాబాకు, మావోయిస్టులతో సంబంధం ఉందనడానికి రుజువు దొరికిందని చూపెడుతున్నారని, సాయిబాబాకు మందులు ఇవ్వడానికి సైతం స్థానికంగా ఉద్యమం జరిగాక మాత్రమే ఒప్పుకొన్నారని కా. వివి అన్నారు. సాయిబాబా అరెస్టును ఖండిస్తూ ఢిల్లీ నుంచి సి.పి.ఐ. కేంద్ర నాయకులు స్పందించారని, అట్లాగే అఖిల భారత స్థాయి విద్యాహక్కుల సంస్థకు చెందిన వాళ్లు స్పందించారని కా. వివి అన్నారు.

సి.పి.ఐ. నాయకులు **నారాయణ** మాట్లాడుతూ సాయిబాబా అరెస్టు భావజాలాన్ని నిర్బంధించడం వంటి చర్య అని, రాబోయే కాలంలో ఎర్రజెండాను చూడగానే ఒక్క గాటన కట్టే ప్రమాదం పొంచి ఉందని అంటూ నెలక్రితం వివి కలిసినప్పుడు 'మోడీ వస్తాడు మనందర్నీ కలపతాడు' అని తనతో అన్నట్లే జరగబోయే అవకాశం ఉందని 'శత్రువు మనల్ని కలుపుబోతున్నాడని' అన్నారు. సాయిబాబా అరెస్టు మానవత్వాన్ని మంటగల్పిన చర్య అని, సాయిబాబా భావాల్ని అరెస్టు చేయాలని చూస్తున్నారని ఆయన అన్నారు. సాయిబాబా శారీరక అంగవికలత్వం వల్ల అతనిపై 'శాంతి భద్రతలకు భంగం కల్గిందంటూ' చర్య తీసుకోవడానికి వీలులేదని, బందిపోటులకు ల్యాప్‌ట్యాప్‌లను ఇస్తూ దేశద్రోహాన్ని సమన్వయం చేసుకునే అవకాశం ఇస్తున్న ప్రభుత్వాలు, సమాజ మార్పు కోసం కృషి చేస్తున్న మేధావిని దొంగ సొత్తు బరామద్ పేరు మీద అరెస్టు చేయటం పిరికిపందల చర్య అని, ఇదెలా ఉందంటే, 'తాటి చెట్టు ఎందుకెక్కావంటే, దూడకు గడ్డికోసం అన్నట్టుందని' నారాయణ అన్నారు. అట్లాగే 'తెలంగాణ ప్రభుత్వం నక్సలైట్ల పట్ల ఎలా ఉంటుంది? మావోయిస్టు పార్టీపై నిషేధాన్ని ఎత్తివేస్తారా, లేదా?' రాష్ట్ర ప్రభుత్వం చొరవ చూపాలంటూ సాయిబాబా అరెస్టును తీవ్రంగా ఖండిస్తున్నామని, సంఘీభావాన్ని ప్రకటిస్తున్నామని చెప్పారు.

ప్రముఖ విద్యావేత్త **చుక్కా రామయ్య** మాట్లాడుతూ ప్రపంచంలో ప్రజల పక్షం వహించిన ఉపాధ్యాయులు ఎలాంటి బాధలు అనుభవించారో సాయిబాబా కూడా అట్లాంటి బాధలే అనుభవిస్తున్నారని, ఇట్లాంటి బాధలే చామ్స్కీ, ఫెరారె వంటి ప్రపంచ ప్రఖ్యాత మేధావులు అనుభవించారని అన్నారు. విద్యారంగానికి అంకితమై పీడిత ప్రజానీకాన్ని విముక్తం చేసే విద్యయే, నిజమైన విద్యయని వరవరరావులాంటి వారు విశ్వసించి, కృషి చేశారని అటువంటి వారి వల్లనే ప్రపంచ పీడిత ప్రజానీకం విముక్తం అవుతుందని రామయ్య అన్నారు. తాను కష్టాలు అనుభవిస్తూ వచ్చే తరానికి యదార్థాన్ని చెప్పే పనికి డా. సాయిబాబా పూనుకున్నాడు, అదే పనిని ఫెరారే, వి.వి. చేశారు. ఇది అకడమిక్ పోరాటం. ఇది

మానవ హక్కుల పోరాటం. నిజానికి ఇది ఉపాధ్యాయ పోరాటం. ఉపాధ్యాయులందరూ ఒక వేదిక మీదికి వచ్చి పోరాడాలి. ఇది అత్యవసరం అని అంటూ సాయిబాబా అరెస్టును ఖండిస్తూ రామయ్య మాట్లాడారు.

సి.పి.ఎం. రాష్ట్ర కమిటీ సభ్యులు **రాములు** మాట్లాడుతూ ఈ దుర్మార్గ, అక్రమ అరెస్టును ఖండిస్తున్నాం. అఖిల భారత స్థాయిలో నిరసనను తెలపాలని అనుకుంటున్నాం. ఇది కేవలం సాయిబాబాకు సంబంధించినది మాత్రమే కాదు. ఈ అక్రమ అరెస్టు భవిష్యత్ నిర్బంధానికి సూచిక. ఇపుడు ఎవడి గోల వారిదిలా ఉంది. కాని ఇకపై అందరూ కలవాల్సి ఉంది. చుక్కా రామయ్య, తదితర పెద్దల్ని ఆమె (ఇఫ్లూ వైస్‌ఛాన్సలర్) ఖాతరు చేయడం లేదు. విద్యార్థులు చిన్న తప్పు చేసినా పెద్ద శిక్షలు వేస్తున్నారు. విద్యార్థుల పరిశోధనను అసాంఘికంగా భావిస్తున్నారు. విద్యార్థులపై వేసిన శిక్షను సభ్య సమాజమంతా ఖండించాలి అని అన్నారు. డా. సాయిబాబా అరెస్టు నేపథ్యంలో అందరూ ఏకం కావాలన్నారు.

న్యూ డెమోక్రసి నాయకులు **గోవర్ధన్** మాట్లాడుతూ "డా. సాయిబాబా అరెస్టును ఖండిస్తున్నాం. సాయిబాబాను విడుదల చేయాలని డిమాండ్ చేస్తున్నాం. కలిసి వచ్చే శక్తులన్నింటితో ఒక విశాల ప్రజాస్వామిక పోరాటాన్ని చేపట్టాలి. రెండు ప్రభుత్వాలు ఏర్పడిన నేపథ్యంలో మావోయిస్టు పార్టీపై ఉన్న నిషేధాన్ని ఎత్తివేయాలని కూడా డిమాండ్ చేస్తున్నాం" అని అన్నారు.

సినీ నటుడు, దర్శకుడు **ఆర్. నారాయణ మూర్తి** మాట్లాడుతూ ఢిల్లీ దాక విన్పించేలా, రెండు ప్రభుత్వాలకు విన్పించేలా సాయిబాబా అరెస్టును ఖండిస్తూ గొంతెత్తాలని కోరారు. ఆదివాసీలను అంతం చేస్తూ వనరుల దోచుకెళ్తున్న సామ్రాజ్యవాద శక్తుల్ని సాయిబాబా ప్రశ్నించాడని, చుండూరు దళితుల పక్షాన నిలిచాడని, సాయిబాబాను వెంటనే విడుదల చేయాలని అట్లాగే మావోయిస్టు పార్టీపై నిషేధాన్ని ఎత్తి వేయాలని ఆయన డిమాండ్ చేశారు.

కవి, జర్నలిస్టు **జూలూరు గౌరీశంకర్** మాట్లాడుతూ సాయిబాబా అరెస్టును ఖండిస్తున్నామని, కె.సి.ఆర్. మావోయిస్టు పార్టీ ఎజెండాను తమ ఎజెండా అన్నందున మావోయిస్టు పార్టీపై నిషేధాన్ని ఎత్తివేయాలని అందరూ అడగాలని అన్నారు.

టివి 9 సీ.ఇ.ఓ. **రవిప్రకాశ్** మాట్లాడుతూ సాయిబాబా అరెస్టును నిరసిస్తున్నామని, అతన్ని విడుదల చేయాలని, చుండూరు దళితులకు వ్యతిరేకంగా వచ్చిన కోర్టు తీర్పునూ నిరసిస్తున్నట్లు చెప్పారు.

మానవ హక్కుల వేదిక నాయకులు **జీవన్‌కుమార్** మాట్లాడుతూ సాయిబాబా అరెస్టును ఖండిస్తున్నాం. ఆయనపై కేసులను ఎత్తివేయాలి. సాయిబాబా ఖైదీల హక్కులకై పోరాడినవాడు. విశ్వాసాలపై ఆంక్షలుండరాదని చెప్పినవాడు. ఇది ఆయన విశ్వాసాలపై దాడి. ముందు ముందు రాబోయే ప్రమాదాలకు ఇది సూచిక. మోడీ విజయం కార్పొరేట్ శక్తుల విజయం. స్టాక్ ఎక్స్ఛేంజ్ సంబరం అంటూ సాయిబాబాపై యూనివర్సిటీ అధికారులు విధించిన సస్పెన్షన్‌ను ఎత్తివేయాలని డిమాండ్ చేశారు.

పౌరహక్కుల సంఘం నాయకులు **రఘునాథ్** మాట్లాడుతూ సాయిబాబా అరెస్టును తీవ్రంగా ఖండిస్తున్నాం. మావోయిస్టు గెరిల్లాల కన్నా బయటి మేధావులు ప్రమాదకరమని కేంద్ర దేశ వ్యవహారాల మంత్రిత్వ శాఖ భావిస్తున్నది. అందువల్లనే సాయిబాబాను దేశభద్రతకు ముప్పుగా భావించి, చట్టబద్ధ పద్ధతులన్నీ ఉల్లంఘించి ఆయనను అరెస్టు చేశారు. మోడీ ప్రధానిగా రాకముందే, రాజ్యానికి మోడీ భావజాలం ఉంది. ఉగ్రవాద వ్యతిరేక చట్టం, చట్టవ్యతిరేక కార్యకలాపాలు నిరోధించే చట్టం (ఉపా) వంటివి ఇటువంటివే. రాజ్యం ప్రాథమిక హక్కుల్ని నేరమయం చేస్తున్నది. సమావేశమయ్యే హక్కుని, భావప్రకటనా స్వేచ్ఛని నేరం అంటున్నది. సాయిబాబా కేసులోని ఎఫ్.ఐ.ఆర్.లో 'మావోయిస్టు పార్టీతో మాట్లాడడం నేరం' అని ఉంది. ఈ భావన తప్పు. పౌరహక్కుల సంఘం మే 4, 5, 6 తేదీలలో మావోయిస్టు పార్టీతో కలిసాం. మాట్లాడాం. ఇది నిజం. ఇది తప్పా? కొందరిలో తప్పు అనే భావనలు మదిని తొలుస్తున్నట్లున్నాయి. వీట్నుంచి బయటపడాలి. ఎందుకంటే రాజ్యం చేస్తున్న దుర్మార్గాలు ఇన్ని, అన్ని కావు. ఛత్తీస్‌ఘడ్‌లో పెద్ద ఎత్తున మిలటరీని మోహరించారు. దాసరి ధర్మయ్యను చంపి, పాతరపెట్టి, బొంద మీది మట్టి తీసి భార్య చేతిలో పోశారు. మాట్లాడే అందరి మీద ఉపా చట్టం మోపే అవకాశం ఉందని అన్నారు. అట్లాగే రాజకీయ విశ్వాసాన్ని కలిగి ఉండే హక్కును అనుసరించి విప్లవ ప్రజాస్వామిక వేదిక మీద ఉన్న నిషేధాన్ని ఎత్తివేయాలని, సాయిబాబాను వెంటనే విడుదల చేయాలని రఘునాథ్ కోరారు.

ద హంస్ ఇండియా ఎడిటర్, హెచ్.ఎం.టీవి సీఈఓ **కె. రామచంద్రమూర్తి** మాట్లాడుతూ సాయిబాబాను అరెస్టు చేసిన విధానాన్ని ఖండిస్తున్నట్లు చెప్పారు. ముంచుకు వచ్చే నిర్బంధం పట్ల అప్రమత్తంగా ఉండాలని కోరారు.

సివిల్ లిబర్టీస్ మానిటరింగ్ కమిటీ నాయకులు **లతీఫ్ మహమ్మద్‌ఖాన్** మాట్లాడుతూ - సాయిబాబా అరెస్టును ఖండిస్తున్నామన్నారు. సాయిబాబా మీద చట్ట విరుద్ధ కార్యకలాపాల నిరోధక చట్టాన్ని (ఉపా) చట్ట విరుద్ధ పద్ధతిలో మోపారు. నిజాయితీ లేకుండా, ఏ మార్గదర్శక నియమాలు లేకుండా, హిందూత్వ నీతితో ఆయనపై అభియోగాలు మోపారు. మేం ముస్లింలం రోజూ చస్తూ బతుకుతాం. రోజూ అరెస్టవుతూ విడుదల అవుతూంటాం. సాయిబాబా కోసమైతే ఇంత మంది వచ్చారు. మా కోసం ఎవరూ రారు. మోడీత్వ నేపథ్యంలో అందరూ ఐక్యంగా ఉండాల్సిన అవసరమైతే ఉంది. ఎందుకంటే ఎమర్జెన్సీ వచ్చినట్లే. ఇందుకు అవసరమైన వేదికలో పాలుపంచుకోవడం నా బాధ్యత అంటూ తన సంఘీభావాన్ని ప్రకటించారు.

ప్రముఖ పాత్రికేయులు, వార్త దినపత్రిక సంపాదకులు **టంకశాల అశోక్** మాట్లాడుతూ సాయిబాబా అరెస్టును పౌరహక్కుల కార్యకర్తలకు, ప్రజాస్వామిక హక్కుల కార్యకర్తలకు మోడీ ప్రభుత్వం ఒక 'సిగ్నల్'లాగా పంపించిందన్నారు. బి.జె.పి. పెద్ద మెజారిటీతో గెలిచి ఒక భయ వాతావరణాన్ని సృష్టించింది. మనం కూడా 'సిగ్నల్స్' పంపించించాల్సిన అవసరం ఉంది. 75-77 ఎమర్జెన్సీ కాలంలో ఎటువంటి మానసిక వాతావరణం ఉండిందో, ఇప్పటి వాతావరణం కూడా అట్లాంటిదే. ఇది ప్రాథమిక ప్రతిచర్య దగ్గరే ఆగకూడదని, ముందుకు ప్రతిఘటిస్తూ వెళ్లాలని లేకుంటే నిర్బంధం తీవ్రమౌతుందని టంకశాల అశోక్ గుర్తు చేశారు.

తెలంగాణ జాయింట్ అక్షన్ కమిటీ చైర్మన్ **ప్రొఫెసర్ కోదండరాం** మాట్లాడుతూ సాయిబాబా అరెస్టును, అరెస్టైన పద్ధతిని

ఖండిస్తున్నామన్నారు. భారత రాజ్యాంగాన్ని సరిగా అమలు చేయాలని, అరెస్టు చేసే వ్యక్తి యూనిఫాం ధరించి ఉండాలని, ముందుగా అరెస్టు కాబడుతున్న వ్యక్తికి సమాచారం ఇవ్వాలని, నల్గురికి చెప్పాలని, నల్గురి ముందు అరెస్టు చేయాలని అన్నారు. ఈ ఉల్లంఘనలు పదే పదే పునరావృతం అవుతున్నాయని, వాటిని మొదటగా ఖండించాల్సిందేనని కోదండరాం అన్నారు. అన్ని కేసుల్లో అరెస్టు అవసరం లేదని, సాయిబాబా ఉన్న భౌతిక పరిస్థితుల్లో అరెస్టు అవసరం లేదని ఆయన అన్నారు. ఆయన రాజకీయాల, విశ్వాసాల వల్ల అరెస్టు చేయదలిస్తే, అది సమంజసం కాదని, రాజకీయాలకు, రాజకీయాలే సమాధానం తప్ప పోలీసులు, కేసులు కాదు కదా అని ఆయన అన్నారు.

ప్రగతిశీల మహిళా సంఘం నాయకురాలు **సంధ్య** మాట్లాడుతూ – మనిషి తోడు లేకుండా ఏ పని చేసుకోలేని అంగ వైకల్యం ఉన్న వ్యక్తిని 'అండా సెల్'లో నిర్బంధించడం అమానవీయం అని అన్నారు. ఇదంతా మహారాష్ట్రలో స్థిరపడ్డ ఆంధ్రా పోలీస్ సి.ఎల్. ప్రసాద్ నిర్వాకమేనని, ఆంధ్రప్రదేశ్ అనుభవంలోంచి ఆయన సాయిబాబాపై నిర్బంధాన్ని అమలు చేస్తున్నాడని ఆమె అన్నారు. అభివృద్ధి పేరిట విధ్వంసాలు జరుగుతూంటే అందుకు వ్యతిరేకంగా పోరాటాలు వెల్లువెత్తక తప్పదని, సాయిబాబా విడుదలకై ఒక ప్రతిఘటనా నిర్మాణం ఏర్పాటైతే అందులో తమ సంఘం ఉంటుందని సంధ్య అన్నారు.

ఆంధ్రజ్యోతి ఎడిటర్ **కె. శ్రీనివాస్** మాట్లాడుతూ తాను సాయిబాబా అరెస్టును నేషనల్ ఏజెన్సీలో చూసానని, వివిలాగా గతంలో బాలగోపాల్‌లాగా ఎవరైనా ఇప్పటి సాయిబాబా అరెస్టును ఖండిస్తూ మాట్లాడినా, ప్రకటనలు ఇచ్చినా వాళ్లను మోడీ ప్రభుత్వం కనిపెడుతూ ఉంటుందని అన్నారు. అంటే సాయిబాబాపై, సాయిబాబా సమర్థకులపై ఒక సామూహిక నిర్బంధ ప్రమాద సూచిక వేలాడుతూ ఉందని, ఎవరెవరినీ నలిపి వేయాలో మోడీ సర్కార్ ప్రణాళిక వేస్కుంటోందని ఆయన అన్నారు. సవ్యంగా చెప్పాలంటే, మోడిత్వ భయం ఆవహించింది, దీన్ని ఖండించాలని అని శ్రీనివాస్ అన్నారు.

తెలంగాణ రచయితల వేదిక బాధ్యురాలు, శాతవాహన యూనివర్సిటీ అధ్యాపకురాలు **సూరేపల్లి సుజాత** మాట్లాడుతూ సమాజంలోని అన్ని రకాల విధ్వంసాల్ని అణిచివేతల్ని ప్రశ్నించినందుకే సాయిబాబాను అరెస్టు చేశారని అన్నారు. అమాయక గిరిజనుల మీద ఎలాగైతే చట్ట విరుద్ధ నిర్బంధాన్ని రాజ్యం అమలు చేస్తున్నదో, యూనివర్సిటీ అధ్యాపకుడైన బుద్ధి జీవి మీద కూడా అటువంటి అన్యాయపు నిర్బంధాన్ని అమలు చేస్తున్నదని ఆమె అన్నారు. ఈ దేశ ప్రజల అవసరాలతో సంబంధం లేని సామ్రాజ్యవాద బహుళ జాతి కంపెనీల మార్కెటు అవసరాలకు అనుగుణంగా 4 ఏండ్ల డిగ్రీ కోర్సును ఢిల్లీ యూనివర్సిటీ ప్రవేశ పెట్టాలనుకున్నదని, దానిని వ్యతిరేకిస్తూ ఉద్యమించినందుకే ఆయన మీద సస్పెషన్ వేటు పడిందని ఆమె అన్నారు. సాయిబాబా అరెస్టు భావజాలం మీద నిర్బంధం అని, విశ్వవిద్యాలయాల్లో ఆధిపత్య స్థానాల్లో ఉన్నవారు విదేశీ సంస్థలకు ఊడిగం చేసే మనఃస్థితిలో ఉండి, భావదాస్యాన్ని ప్రశ్నించినందుకు శిక్షించాలనుకుంటున్నారని, మనిషిని తిరిగి బానిసత్వంలోకి నెట్టేసే హేయమైన స్థితిలో ఇవ్వాళ యూనివర్సిటీలు ఉన్నాయని ఆమె అన్నారు. సాయిబాబాను వెంటనే విడుదల జేయాలని ఆమె డిమాండు చేశారు.

హైదరాబాద్ యూనివర్సిటీకి చెందిన **కె.లక్ష్మీనారాయణ** మాట్లాడుతూ – సాయిబాబా అరెస్టు బోధనా రంగ స్వేచ్ఛ మీద పెద్ద దెబ్బ అన్నారు. రాజ్యాంగాన్ని ఉటంకిస్తూ అది చేసాం, ఇది చేసాం అంటారు. రాజ్యాంగ విరుద్ధంగా సాయిబాబాను అరెస్టు చేశారు. ఆయన్ను విడుదల చేయాలని లక్ష్మీనారాయణ డిమాండ్ చేశారు.

డీటిఎఫ్ వ్యవస్థాపక నాయకులు **డా.గంగాధర్** మాట్లాడుతూ సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాల్లో సాయిబాబాతో కలిసి డీటీఎఫ్ పని చేసిందని, కొన్ని రాజకీయ విశ్వాసాలు రాజ్యాంగం ప్రకారం కూడా నేరం కాదని, సాయిబాబా అరెస్టు రాజ్యాంగ వ్యతిరేకమైందని, అట్లాగే అది ప్రజా వ్యతిరేకమైందని అన్నారు. 97లో అఖిల భారత ప్రజా ప్రతిఘటన వేదిక మీంచి తెలంగాణ కోసం మాట్లాడిన వ్యక్తి, ఇవ్వాళ తెలంగాణ వచ్చిన సందర్భంలో జైలులోకి వెళ్లాల్సి రావడం దిగజారిన రాజకీయ, సామాజిక పరిస్థితులకు సూచిక అని అన్నారు. సాయిబాబా విడుదల కోసం డీటీఎఫ్ అందరితో కలిసి పని చేస్తుందని డా. గంగాధర్ అన్నారు.

తెలంగాణ ప్రజాఫ్రంట్ నాయకులు **చిక్కుడు ప్రభాకర్** మాట్లాడుతూ ఇప్పుడు సాయిబాబా మీద పెట్టిన ఉపా చట్టం 2004లో తన మీద కూడా పెట్టారని, ఇది చట్ట ప్రకారం కూడా సరైంది కాదని అన్నారు. గడ్చిరోలి పోలీస్ స్టేషన్‌లో ఒకరు 'కన్‌ఫెషన్ స్టేట్‌మెంట్' ఇస్తే, దాని ఆధారంగా కేసు పెట్టడం, సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు ప్రకారం తప్పు. దేశవ్యాప్తంగా వనరుల దోపిడికి వ్యతిరేకంగా ఆయన మాట్లాడుతున్నందుకే, మావోయిస్టు పార్టీతో జతచేసి అరెస్టు చేసారని ప్రభాకర్ అన్నారు. ఒక ఐక్య వేదిక తరపున సాయిబాబా అరెస్టును ఖండిస్తూ గొంతెత్తితేనే ఆయనను విడుదల చేసుకోగలమని ఆయన అన్నారు.

అమరుల బంధుమిత్రుల సంఘం నాయకురాలు **పద్మకుమారి** మాట్లాడుతూ సాయిబాబా తల్లి అమరుల బంధుమిత్రుల సంఘం సభ్యురాలు. పోరాటంలో అమరురాలైన భవానీ సాయిబాబాకు సోదరి. ఆదివాసుల మీద సామ్రాజ్యవాద దాడికి వ్యతిరేకంగా మాట్లాడుతున్న వాడు సాయిబాబా. సాయిబాబా మీద పెట్టిన పెటీ కేసు హాస్యాస్పదమైంది. అసలు ఉద్దేశం అతనికి మావోయిస్టు పార్టీ భావజాలంతో ఏకీభావం ఉండడమే. అతని విశ్వాసాల్ని ప్రశ్నించే హక్కు ఎవరికీ లేదు. అతన్ని బేషరతుగా విడుదల చేయాలని అన్నారు.

ప్రజాస్వామ్య రచయిత్రుల వేదిక తరపున **ఎం. రత్నమాల** మాట్లాడుతూ ఆయన్ని బేషరతుగా విడుదల చేయాలి. ఆయనతో విస్థాపన విరోధ్ జన వికాస్ ఆందోళనలో కూడా కలిసి పనిచేసాం. భూమి సమస్య గురించి మాట్లాడితే రాజ్యం విరోధులుగా భావిస్తుంది. అటవీ సంపదను, కాళ్ల కింద నేలను తవ్వుకుపోతున్నప్పుడు, దాన్ని కాపాడుకొనే క్రమంలో సామ్రాజ్యవాద వ్యతిరేక, రాజ్యవ్యతిరేక పోరాటాల్లో క్రియాశీలకంగా పని చేస్తున్నప్పుడు రాజ్యం, ఇది కాకపోతే ఇంకో కేసు మీద అరెస్టు చేస్తోందని అన్నారు. సాయిబాబాపై, నిర్బంధాన్ని వ్యతిరేకించే వాళ్లంతా, వాళ్ల వాళ్ల విధానాలకు అతీతంగా కలిసి రావాలి. చాపకింది నీరులా ఒక్కో ప్రజాస్వామిక హక్కుని తొలగించేందుకే మోడీ వచ్చాడు అని ఆమె అన్నారు.

రాజకీయ ఖైదీల విడుదల కమిటీ బాధ్యులు **బల్లా రవీంద్రనాథ్**

మాట్లాడుతూ - సాయిబాబాది సి.ఆర్.పి.పి.లో ప్రధాన భూమిక. అట్లాగే హక్కుల పోరాటాల్లో, ప్రజా పోరాటాల్లో కూడా ప్రధాన భూమిక పోషించారు. సాయిబాబా విడుదల విషయంలో బెయిల్ రాకుండా నిబంధనలు కఠినతరం చేశారని అన్నారు. సాయిబాబా విడుదలతో పాటు ఉపా చట్టాన్ని కూడా ఎత్తివేయాలనే పోరాటం చేపట్టాలని, అందులో సి.ఆర్.పి.పి. ముందుంటుందని ఆయన అన్నారు.

పాలమూరు అధ్యయన వేదిక తరఫున **ఎం. రాఘవాచారి** మాట్లాడుతూ ప్రజల జీవితాలు అన్ని రంగాల్లో అస్థిరమైపోయే సందర్భంలో సాయిబాబా అరెస్టు అయ్యారు. ఒక విశాల అవగాహనతో కూడిన వేదికలో భాగం అయి - సాయిబాబా విడుదల కోసం పనిచేస్తామని అన్నారు.

ఐ.ఎఫ్.టి.యు. - తరఫున **జి. అనురాధ** మాట్లాడుతూ హక్కుల ఉద్యమాల్లో పని చేస్తున్న వారిపై నిర్బంధం కొత్త కాదని, దీన్ని ఖండిస్తున్నామని అన్నారు.

భారత కార్మిక సమాఖ్య తరఫున **వెంకటరెడ్డి** మాట్లాడుతూ విశాల ఐక్య వేదిక 96, 97ల కన్న ఇప్పుడు చాలా అవసరం అంటూ సాయిబాబా విడుదల కోసం అందులో భారత కార్మిక సమాఖ్య చేరి పోరాడుతుందని చెప్పారు.

లక్షలాది కరపత్రాలు వేసి సాయిబాబా సేవల్ని ప్రచారం చేసి, విశాల ప్రజానీకం సంఘీభావాన్ని కూడగట్టాలని వరంగల్ ముస్లిం ప్రతినిధి **షేక్ మౌలానా** అన్నారు.

నల్గొండ ప్రజావేదిక నాయకుడు **నిమ్మల భీమార్జున రెడ్డి** సాయిబాబా అరెస్టు అక్రమమని, అతన్ని వెంటనే విడుదల చేయాలని కోరారు.

సాయిబాబా అరెస్టును ఖండించడంతో పాటు, విశాల వేదికలో భాగస్వామ్యం వహించి ఆయన విడుదల కోసం పోరాడాలని, ఎందుకంటే ముందు ముందు ప్రజల పక్షాన మాట్లాడే వారికి ఇదే పరిస్థితి రాబోతుందని సినీ నటుడు, నాటక ప్రయోక్త **కాకరాల** అన్నారు.

తెలంగాణ నంగారా భేరి తరఫున **పోరిక ఉదయ్‌సింగ్ నాయక్** మాట్లాడుతూ సాయిబాబా అరెస్టు అక్రమమని, వనరులను సామ్రాజ్యవాదులకు దోచిపెట్టే క్రమంలో పాలకవర్గాలు పెసా, తదితర చట్టాలను తుంగలో తొక్కాయని, సాయిబాబా వీటికి వ్యతిరేకంగా మాట్లాడినందుకే చట్ట విరుద్ధంగా ఆయన్ను అరెస్టు చేశారని, భారత చట్టాల పరిధిలోనే సాయిబాబాను విడుదల చేయవచ్చునని అన్నారు. సాయిబాబా విడుదల పోరాటంలో తెలంగాణ నంగారా భేరి భాగం అవుతుందని ఆయన అన్నారు.

భూగోళ, మానవ, జీవ సంరక్షిత సంస్థ తరఫున **కె. నాగరాజు** మాట్లాడుతూ అమెరికా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా మాట్లాడినందుకే సాయిబాబాను అరెస్టు చేశారని, దీన్ని పెద్ద ఎత్తున ప్రచారం చెయ్యాలని అభిప్రాయపడ్డారు.

పరిపాలనా విభాగపు రిటైర్డ్ ఉద్యోగి **జయరాముడు** మాట్లాడుతూ అన్ని రకాల చట్టాలను ఉల్లంఘిస్తూ సాయిబాబా అరెస్టు జరిగింది. రాజ్యపు అన్ని రకాల హింసా రూపాల కన్న ఆపరేషన్ గ్రీన్‌హంట్ అత్యున్నత హింసా రూపమని, పోలీసులు సామ్రాజ్యవాదులకు అనుగుణంగానే విధులు నిర్వహిస్తున్నారని అన్నారు. వ్యవస్థను మార్చే నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని అణిచివేయడానికి పాలకులు చట్టాల్ని వాడుకుంటున్నారని, అట్లాగే చట్టాల్ని ఉల్లంఘిస్తున్నారని ఆయన అన్నారు. నాలుగు గోడల మధ్య మీటింగ్‌ల వల్ల రాజ్య స్వభావం మారదు. ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను నిలిపివేయదు. విప్లవోద్యమం ముందుకు పోతున్న కొలది రాజ్యం క్రూరమైన బలంతో అణిచివేస్తుంది. అందులో భాగంగానే ఆర్.డీ.ఎఫ్.పై నిషేధం, సాయిబాబా అరెస్టు అని జయరాముడు అన్నారు.

కులనిర్మూలన పోరాట సమితి నాయకులు **విజయ్‌కుమార్** మాట్లాడుతూ అరెస్టును ఖండిస్తున్నాం. అందరిలో మోడీ భయం కన్పిస్తోంది. ఐక్యసంఘటన ఏర్పరచుకొని సాయిబాబా విడుదల కోసం పోరాడుదామని అన్నారు.

రౌండ్ టేబుల్ సమావేశంలో వ్యక్తమైన అభిప్రాయాలను సమీక్షిస్తూ కామ్రేడ్ వరవరరావు మాట్లాడారు. ఆర్.డి.ఎఫ్. మహాసభలు హైదరాబాద్‌లో నిర్వహించినప్పటి నుండి నిర్బంధం కొనసాగుతున్నదని వివి అన్నారు. సహకరించిన వారిపై కూడా నిర్బంధం ఉన్నది. విప్లవ ప్రజాస్వామిక వేదిక తరఫున దేశవ్యాప్తంగా పనిచేసినందున గంటి ప్రసాదం గారి మీద రాజ్యం చూపు ఉండింది. ఆయన్ని చంపేసి అప్పుడే ఒక సిగ్నల్ ఇచ్చింది. ఉత్తరాఖండ్‌లో జీవానంద్‌ను అరెస్టు చేశారు. ఎన్నికల బహిష్కరణ పిలుపు, బూటకపు ఎన్నికలు బూర్జువా నియంతృత్వం కోసమేనని ఇంగ్లిషు, హిందీలలో పుస్తకాలు కూడా ఆర్.డి.ఎఫ్. వేసింది. ఇంతటి నిర్బంధంలోను ఢిల్లీలో ఉండి సాయిబాబా వీటన్నింటిని సమీకృతం చేస్తున్నాడని రాజ్యానికి భయం. ఆదివాసులపై రాజ్యం ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరు మీద చేస్తున్న దాడిని ప్రజా యుద్ధంతో దండకారణ్య క్షేత్రంలో మావోయిస్టు పార్టీ ప్రతిఘటించకపోతే, ఢిల్లీ కేంద్రంగా సాయిబాబా మాట్లాడితే చీమ కుట్టినట్లైనా ఉండేది కాదు కదా! విప్లవాలు, ప్రజా పోరాటాలు జరుగుతున్నాయి. దానికి మద్దతుగా రౌండ్ టేబుల్ సమావేశం జరుగుతున్నది. ఆ పోరాటాలకు ఈ రౌండ్ టేబుల్ సమావేశానికి గతితార్కిక సంబంధం ఉన్నది. ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక కమిటీ మే 4, 5 తేదీల్లో ఛత్తీస్‌ఘఢ్ వెళ్లి పోరాట నాయకత్వంతో, పోరాడే ప్రజల్తో మాట్లాడడం జరిగింది. అన్ని సంఘాలతో ఆలోచించి సాయిబాబా అరెస్టు, విడుదలకు సంబంధించి నిర్ణయాలు తీసుకోవడం జరిగింది.

ఈ సందర్భంగా చాలా విషయాలు వచ్చాయి. 1. చుండూరు దళితులకు వ్యతిరేకంగా వచ్చిన తీర్పు. 2. ఇఫ్లూ విద్యార్థుల రస్టికేషన్. 3. బ్రాహ్మణీయ భావజాలం వంటి విషయాలు వచ్చాయి.

తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటు వెనుక డిసెంబర్ 28, 29, 1997 నాటి వరంగల్ డిక్లరేషన్, జనార్దన్‌రావు, జయశంకర్, తెలంగాణ జనసభ, ఆకుల భూమయ్య నాయకత్వం, అఖిల భారత ప్రజా ప్రతిఘటన వేదిక ఉన్నాయి. జనసభ ఏర్పాటులో భాగస్వామ్యం వహించిన ఆలోచనాపరుడు, తెలంగాణ ఏర్పడ్డాక అరెస్టు కావడం ప్రస్తావనకు వచ్చాయి అని కా. వివి అన్నారు.

తదనంతరం (1) ఆర్డీఎఫ్‌పై నిషేధం ఎత్తివేయాలని. (2) మావోయిస్టు పార్టీ మీద ఆరు ప్రజా సంఘాలపైన నిషేధాన్ని ఎత్తివేయాలని. (3) సాయిబాబా అరెస్టును ఖండిస్తూ, అతన్ని విడుదల చేయాలని. (4) పోరాడుతున్న ప్రజలపై నిర్బంధాన్ని తొలగించాలని తదితర తీర్మానాలను కా. వివి ప్రతిపాదించారు.

## రౌండ్ టేబుల్ సమావేశానికి హాజరయిన వారు

కె. నారాయణ (సిపిఐ), వి. రఘునాథ్ (సిఎల్‌సి), ఎన్. నారాయణ రావు (సిఎల్‌సి), సుజాత సూరేపల్లి (తెరవే), నర్సింహారెడ్డి, ముంజిలేటి రామారావు, ఆర్. రవీందర్‌రెడ్డి, కె. గోవర్దన్ (సిపిఐ ఎంఎల్), పల్లా వెంకటరెడ్డి (సిపిఐ), జి. అనురాధ (ఐఎఫ్‌టియు), కె. లక్ష్మినారాయణ (యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్), ఎ. నర్సింహారెడ్డి (సిఆర్‌పిపి), ఎన్. వేణుగోపాల్ (వీక్షణం), టి. సెన్‌గుప్తా (యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్), ఆర్ నారాయణ మూర్తి, డి. అంజయ్య (డిటిఎఫ్, హైదరాబాద్), పి. శ్యామలరావు (ఐఎఫ్‌టియు), ఆర్. క్రిష్ణమూర్తి (సిపిఐ), ఎం. శంకర్ (టివివి), యు. రాజలింగం, శ్రీనివాస్ మేకల, చుక్కా రామయ్య, జి. రాములు (సిపిఐ), గుర్రం సీతారాములు (సిఎల్‌సి సిటీ కమిటీ), డా. జి. రమాదేవేంద్ర (పిడిఎం), ఎం. రత్నమాల (ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక), కె. వివేక్ (టివివి), ఎన్. టంజనీ (సిఎల్‌సి), క్రాంతి (విరసం), సిహెచ్ వీరారెడ్డి, ప్రొ. ప్రభంజన్ యాదవ్, శాంత కుమార్, ఎం. రాఘవాచారి (పాలమూరు అధ్యయన వేదిక, మహబూబ్‌నగర్), ఎం. వేణుగోపాల్ (టిజెఎసి ఛైర్మన్), వివేక్ భూమి (హెచ్.ఆర్.ఎఫ్.) వి. పరశురాజ్, వేణు, జూలూరు గౌరీశంకర్ (తెలంగాణ రచయితల వేదిక), వరవరరావు (విరసం), జీవన్ కుమార్ (మానవ హక్కుల వేదిక), డానీ (పాత్రికేయులు), ఎం. గంగాధర్ (డిటిఎఫ్), చిక్కుడు ప్రభాకర్ (తెలంగాణ ప్రజాఫ్రంట్ కార్యదర్శి), ఎన్. భీమార్జున్ రెడ్డి (నల్లగొండ ప్రజావేదిక), వి. జయరాముడు, డి. సతీష్ కుమార్, అశోక్, ఆర్.కె., పోరిక ఉదయసింగ్ నాయక్ (తెలంగాణ నంగారా భేరి), బాసిత్ (విరసం), పి.చంద్ (రచయిత), కె. పద్మ (అమరుల బంధుమిత్ర సంఘం), కె. విజయ్‌కుమార్ (కెవిపిఎస్), కె. విజయ నర్సింహారావు (అడ్వకేట్), కె.వి. రాములు (జర్నలిస్ట్), జయరాజు (కెవిపిఎస్), జె. మాధవి (ఎబిఎంఎస్), కె. నాగరామ్ (ఎన్‌జిఓ), బల్లా రవీంద్రనాథ్ (సిఆర్‌పిపి), కట్టా భగవంతరెడ్డి (తెలంగాణ సోషల్ రెవెన్యూ సొసైటీ), షేక్ మౌలానా, కావలి రామకృష్ణ డా. హరికాంత్, సిహెచ్ మల్లిఖార్జున్, కె. ప్రభాకర్ (డిటిఎఫ్), జి. విజయరావ్, రివేరా (విరసం), కాశీం, (విరసం), రాంకి (విరసం), వి. సంధ్య (పిఓడబ్ల్యు), జగన్ (టివివి), రవి ప్రకాశ్ (టివి9), కె.ఆర్. మూర్తి (హెచ్‌ఎంటివి), ఎం. కోదండరామ్ (టిజెఎసి), లతీఫ్ మోహమ్మద్ ఖాన్ (సిఎల్‌ఎంసి), కె.వి.వి. సత్యనారాయణ, నరేష్ కుమార్, కె. శ్రీనివాస్, రాజేంద్ర ప్రసాద్ (టివివి), అరవింద్ దేవా, అభినయ్ పవార్, ఎం. శ్రీనివాస్, ఎం. జగన్‌మోహన్, వి. విజయ్, పి. మేఘరాజు, సంపతి స్టాలిన్, జి. లలిత (శ్రామిక మహిళా సంఘం) తదితరులు హాజరయ్యారు.



***స్పందన :***

ఈసారి (మార్చి-మే 2014) 'అరుణతార'లో మొదట చెప్పవలసింది 'ఎడారి అధ్యాపకురాలు' ఆంద్రెయ్ ప్లతోనోవ్ రష్యన్ కథ అనువాదం గురించి. బహుశా ఇంగ్లిషు నుంచి, హిందీ నుంచి తెలుగులోకి వచ్చిన ఈ కథ మూలంలో ఇంకెంతో జీవశక్తితో, సృజనాత్మకతతో గొప్ప ఉత్తేజాన్నిచ్చేది అయి ఉంటుంది. ఇంతటి ఉత్తేజాన్ని ఇచ్చే జీవితం, పోరాటం మనకు లేకకాదు. బహుశా మనకా పరిశీలన, శ్రమ, కృషి సాహిత్యంలో లోపిస్తున్నాయి. ప్రతి ఒక్క టీచర్, ఉద్యమ కార్యకర్త చదివి తీర వలసిన కథ. 'ఏటికి ఎదురీదడం' విన్నాం, అంటున్నాంగానీ ఎడారి జీవితాలను సస్యశ్యామలం చేయడమే విప్లవమని, ఆ బాధ్యతలో టీచర్లు పాల్గొనాలని అటువంటి సృజనాత్మకత, ప్రేమలూరే మనసు గల మహిళలకెక్కువనే సందేశం అందులో ఉంది గనుకనే షహీదా ఆ కథను అనువాదానికి ఎంచుకున్నదని నాకనిపించింది.

టివి 9 కుల, వర్గ, ప్రాంత అహంకారం, ఆంధ్రజ్యోతి, ఎబిఎన్ ఆధిపత్య 'ప్రజాస్వామ్య' పోరాటం, (నమస్తే తెలంగాణాలోనూ ఇటువంటి పెత్తందారీ నిషేధం విధించబడి ప్రస్తుతానికి సద్దుమణిగిందని వింటున్నాం) మొత్తంగానే మోడీత్వ సుడిగాలికి మీడియా వేసిన ఎగసన ప్రమాదాన్ని 'ఈనాడు దినపత్రిక'తో సమాచార హక్కు గురించి చేసిన పోరాటాన్ని అణుధార్మిక భావజాలంతో పోరాటంగా పి. వరలక్ష్మి వివరించడం సందర్భోచితంగా ఉన్నది. కార్పోరేట్ శక్తులతో పోరాటం విరసం వంటి సంస్థలు భావజాల రంగంలో మీడియాతో చేసే సాంస్కృతిక పోరాటమే అవుతుంది. విరసం తాత్విక పాఠశాలకు వెళ్లలేకపోయిన నా బోటివారికి నల్లూరి రుక్మిణి వలె తమ ప్రసంగ పాఠాలు 'అరుణతార' ద్వారా అందిస్తే చాలా ఉపయోగకరంగా ఉంటుంది. చాలామంచి విశ్లేషణాత్మకమైన వ్యాసం. మార్క్వెజ్‌కు నివాళి చెప్పడానికి బాసిత్ నెట్ నుంచి చాలా అవసరమైన ప్రకటనను ఎంచుకున్నాడు. విప్లవ సాంస్కృతిక వేదిక, జె.ఎన్.యు. మార్క్వెజ్‌ను మన సమాజంలోకి, మన సందర్భంలోకి తెచ్చిన తీరు ఆయన చక్కగా అనువదించాడు. ఇదే సందర్భంలో ముజఫర్‌నగర్‌లో ముస్లింలపై మారణకాండపై డెమోక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ ఢిల్లీ రిపోర్ట్ (ముజఫర్ నగర్ మరో మానని గాయం) తెలుగు అనువాదం ఆర్. శశికళను కూడా అభినందించాల్సి ఉన్నది. ఇందులో మరీ ముఖ్యంగా వెనుక అట్టపై సాహిర్ (లూథియాన్వీ) ఉర్దూ కవిత అనువాదంలో ఒక సమష్టి కృషి, శ్రద్ధ కనిపిస్తున్నాయి. అటువంటప్పుడు ఫలితమూ - ప్రభావము ఉంటాయి. విరసం సభ్యులు గానీ, విప్లవ సాహిత్యాభిమానులుగానీ హిందీ సాహిత్యంలో 'భోర్' వంటి పత్రికలలో వస్తున్న రచనలను, ఇంకా ఇటువంటి ప్రాపంచిక దృక్పథం గల రచనలను అరుణతార పాఠకులకు పరిచయం చేసే బాధ్యత తీసుకుంటే బాగుంటుంది. 'ఎన్నికల దృశ్యం' (37-46) పాఠకులకు ఇబ్బంది కలగకుండా చదువుకునేలా అచ్చేసి ఉంటే ఇంకా ఆసక్తిదాయకంగా ఉండేది. మన విషయ సూచికలు, శీర్షికలు, పరిచయాలు, సంస్మరణలు - స్థలకాలాలను నిర్దేశించాలి. శాఖమూరి రవి స్పందన (పే. 61-62)కు 'కుసుంబ గంగాధర్ మరణం (18-12-2013) ఏం చెబుతోంది'గా ఉంటే స్పష్టత ఉండేది.

**- వి.వి.**

అరుణతార సంపాదకులకు,

అరుణతార 301, 302 సంచికల్లో రివేరా, కవితల లేఖలు చదివి నా అభిప్రాయం రాస్తున్నా. 300 వ సంచిక ప్రస్తుతం నా వద్ద లేకపోవడం వల్ల వి.కవిత వ్యాసం చదవలేకపోయాను. కాబట్టి నా ఈ ప్రతిస్పందనకి పై లేఖలు మాత్రమే ఆధారం.లెనిన్, మావోలను రివేరా కొంత అసందర్భంగానే తీసుకొచ్చారు కానీ కవిత వ్యాసం పట్ల కలిగిన "అపార్థం, గందరగోళానికి" మూలాలు మాత్రం కవిత రాసిన పేరాలోనే ఉంది. అయితే రివేరా రాసిన అర్థం లో కాదు. "విప్లవోద్యమ సంస్థలకు అనేక కారణాల వల్ల ఆటుపోట్లు, ఎత్తుపల్లాలు, విజృంభణ-వెనుకంజలు ఉండవచ్చు కానీ విప్లవోద్యమానికి అవి ఉండవు". ఈ నిర్ధారణ సరైంది కాదని ప్రపంచ దేశాల విప్లవోద్యమ చరిత్ర చూసినా, మన దేశంలోని, మన రాష్ట్రంలోని విప్లవోద్యమ చరిత్రని చూసినా అవలోకించినా తెలుస్తుంది. 1972 తరవాత దేశ వ్యాప్తంగానే విప్లవోద్యమం వెనుకంజ వేసింది. ప్రస్తుతం కూడా ఆంధ్రప్రదేశ్ మేరకు చూసినట్టయితే విప్లవోద్యమం ఆటుకు, సెట్ బ్యాక్‌కు గురయిందనేది కూడా ఒక వాస్తవం. కాబట్టి విప్లవోద్యమానికి కూడా ఆటు-పోట్లు, విజృంభణ-వెనుకంజలు ఉంటాయి. విప్లవోద్యమం వెనుకంజ వేయకుండా ఉంటే విప్లవ సంస్థలు ఎందుకు వెనుకంజ వేస్తాయి? ఏవో కొన్ని సంస్థలు వెనుకంజ వేసినా, మరికొన్ని సంస్థలు వాటి స్థానం తీసుకోకుండా, వాటి పాత్ర నిర్వహించకుండా విప్లవోద్యమం ముందుకు సాగజాలదు. నిర్బంధం వల్ల కావచ్చు, లేదా ఇతర సంస్థాగత కారణాల వల్ల కావచ్చు ఏవేని విప్లవ సంస్థలు వెనుకంజ వేస్తే ఆ సంస్థలు పని చేసే రంగాలు దెబ్బతింటాయి. విద్యార్థి సంఘాలు దెబ్బతిని విద్యార్థి ఉద్యమం ముందుకే కొనసాగుతూ ఉండగలదా?

ఇక విప్లవపార్టీనే దెబ్బతింటే విప్లవోద్యమం సహజంగానే వెనుకంజ వేస్తుంది. దీనికి పెద్ద చర్చ అవసరం లేదు. కవిత "విప్లవ పార్టీ" అని అనలేదు నిజమేకానీ విప్లవ సాహిత్య సంస్థలు అనికూడా అనలేదు కదా? మరి విప్లవ సాహిత్య సంస్థల వొడిదుడుకుల గురించి తను వాదిస్తే రివేరా తప్పుగా అర్థం చేసుకొన్నాడని జవాబులో రాస్తే ఎట్లా? అపార్థానికి కొంత అవకాశం కవిత వ్యాసమే ఇచ్చింది కదా?

"పాలక వర్గ దుర్మార్గం సాగినంత కాలం ప్రజల విప్లవావసరానికి, విప్లవకాంక్ష ఉధృతీ, విస్తరణ తప్ప వెనుకంజ ఉండదు,"- అని కవిత రాసిందాంట్లో కూడా కొంత అస్పష్టత ఉంది. విప్లవావసరం, విప్లవ కాంక్ష తగ్గకపోవచ్చు కానీ అదే విప్లవోద్యమం కాదు కదా! దీర్ఘకాలిక దృక్పథంలో, వ్యూహాత్మకంగా (సాపేక్షికంగా) విప్లవోద్యమానికి వెనుకంజ ఉండదు కానీ తాత్కాలికంగా ఎత్తుగడల రీత్యా ఎన్నోసార్లు ఆటుపోట్లకు, ఎత్తు పల్లాలకు గురి అవుతూనే ఉంటుంది. ఓటమి, విజయం, ఓటమి... అంతిమంగా విజయం అన్న దాంట్లో పై ప్రక్రియ ఇమిడి ఉంది.

"విప్లవ కవిత్వ ఆటుపోట్లకు విప్లవోద్యమ సంస్థల ఆటుపోట్లతో గుర్తించడం సరైంది కాదు" అని కవిత రాసిన విషయం గురించి చూస్తే- విప్లవ సాహిత్య సంస్థల వెనుకంజ తో విప్లవ సాహిత్యం వెనుకంజ వేయవచ్చు, వేయకనూ పోవచ్చు. సాహిత్య సంస్థల వెలుపల విస్తృతంగా విప్లవ సాహిత్య సృజన జరిగినప్పుడే వెనుకంజ ఉండదు. అయితే విప్లవ కవిత్వ (సాహిత్య) ఉద్యమానికి, విప్లవోద్యమానికీ సరళారేఖా సదృశమైన సంబంధం ఉండనవసరం లేదు. విప్లవోద్యమం తాత్కాలికంగా వెనుకంజకు గురయితే దానిననుసరించే విప్లవ కవిత్వం, సాహిత్యం వెనుకంజ వేయనవసరం లేదు. అటువంటి సమయంలో విప్లవ సాహిత్యం విప్లవ ప్రజానీకాన్ని విప్లవోన్ముఖుల్ని చేసి విప్లవోద్యమం మళ్ళీ పుంజుకొనేందుకు తోడ్పడవచ్చు. ఈ విషయంలో 1970-72 తర్వాత విరసం నిర్వహించిన పాత్రకు మించిన సజీవ తార్కాణం అవసరం లేదు.

ఇక చివరగా- రివేరాకు జవాబుగా కవిత రాసిన లేఖలో "తన పట్ల కవిగా, ఆలోచనాపరుడిగా, మేధావిగా ఇతరులకు ఉండే గౌరవాన్ని రివేరా తానే స్వయంగా పోగొట్టుకోదలుచుకొన్నారు." అని రాయటంలో అనవసరమైన అసహనం ధ్వనిస్తోంది. ఇటువంటి వ్యాఖ్యలు ఆరోగ్యప్రదమైన చర్చలకు అవసరమా అనేది కవిత ఆలోచిస్తే మంచిది.

* * *

సాహిత్య విమర్శ ప్రత్యేక సంచిక సంపాదకీయంలో చెంచయ్యగారు మార్క్సిస్ట్ దృక్పథం, విప్లవ దృక్పథం భిన్నమైనవనీ, విప్లవ సాహిత్య విమర్శ అన్నది మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ అనటం కంటే ఎక్కువ నిర్దిష్టమైనదని రాశారు.

మార్క్సిస్ట్ దృక్పథం అన్నప్పుడు దానికదే సమగ్రమైనదీ, నిర్దిష్టమైనది, అందులోనే మార్క్సిజం-లెనినిజం-మావోయిజంలు నిబిడీకృతమైనవి. ప్రత్యేకంగా వివరించాల్సి వచ్చినప్పుడు మార్క్సిజం-లెనినిజం-మావోయిజం అని రాస్తాం. లెనినిజంనో, మావోయిజంనో ఆమోదించని వాళ్ళు కూడా ఉండవచ్చు. వాళ్ళుకూడా మార్క్సిస్ట్ దృక్పథం అనే రాయవచ్చు. మరికొందరు విప్లవ దృక్పథాన్ని (మా-లే-మా తో కూడుకొని ఉన్నది) ఆమోదించినా మార్క్సిస్ట్ పద్ధతికి కట్టుబడి విమర్శ చెయ్యకపోవచ్చు. అది చర్చ, విమర్శల ద్వారా నిరంతరం తేల్చుకోవాల్సినదే, పదునుపెట్టుకోవాల్సినదే.మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ అన్నప్పుడు మా-లె-మా మాత్రమే కాక ఆ దృక్పథం ఆధారంగా ఆ తర్వాత మార్క్సిస్ట్ సాహిత్య విమర్శకులు అభివృద్ధి పరచిన విమర్శనా పరికరాలతో కూడుకొని ఉన్న విమర్శనా పద్ధతి.కాబట్టి మార్క్సిస్ట్ దృక్పథం, విప్లవ దృక్పథంమధ్య కృత్రిమ విభేదం సృష్టించవలసిన అవసరం లేదని నా అభిప్రాయం.

**- ఎన్. రవి.**

(మావోయిస్టు రాజకీయ ఖైదీ,
తేనూఘాట్,బొకారొ జిల్లా, ఝార్ఖండ్)



# డా.జి. ఎన్. సాయిబాబాను బేషరతుగా విడుదల చేయాలి

**'ఉపా' వంటి నిరంకుశ చట్టాలను రద్దు చేయాలి**
**దేశవ్యాప్తంగా జైళ్ళల్లో మగ్గిపోతున్న రాజకీయ ఖైదీలను, ఆదివాసులను విడుదల చేయాలి**
**ధర్నా : జూన్ 13న 10 గంటలకు ఇందిరాపార్కు, హైదరాబాదు.**

ఢిల్లీ యూనివర్సిటీ అధ్యాపకుడు డా. సాయిబాబాను మావోయిస్టులతో కలిసి భారత ప్రభుత్వాన్ని కూల్చే కుట్ర పన్నుతున్నాడని నెల రోజుల నుండి ఒంటరి చీకటి నిర్బంధంలో ఉంచారు. మే 9న కాలేజీలో పరీక్షలు నిర్వహించి వస్తున్న సమయంలో దారి కడ్డం పడి కళ్ళకు గంతలు కట్టి అమాంతం ఎత్తుకు పోయి మహారాష్ట్ర గడ్చిరోలికి, అటు నుండి నాగపూర్ సెంట్రల్ జైలుకు తరలించి కనీస వైద్య సౌకర్యాలు సైతం నిరాకరించి అత్యంత అమానవీయంగా ప్రవర్తించడానికి కారణం ఏమిటి? 90 శాతం అంగవైకల్యంతో, అనారోగ్యంతో ఉన్న మనిషిపై రాజ్యం ఎందుకంత కక్ష గట్టింది?

సాధారణ పేద రైతు కుటుంబంలో పుట్టిన సాయిబాబా ఐదేళ్ళ వయసులోనే పోలియో బారిన పడి తన నడుము కింది భాగమంతా చచ్చుబడిపోవడంతో జీవన పోరాటం మొదలుపెట్టి తన పరిధుల్ని, పరిమితుల్ని అధిగమించి ఎంతో దూరం ప్రయాణం చేశాడు. అమలాపురం దగ్గర పల్లెటూరులో మట్టిరోడ్లపై తన రెండు చేతులతో శరీరాన్ని ఈడ్చుకుంటూ మొదలుపెట్టిన ప్రయాణం కాలేజీ చదువు నాటికి మలుపు తిరిగింది. తన అనారోగ్యం తనకు పరిమితుల్ని విధించినట్టే దేశానికున్న రుగ్మతలు అసంఖ్యాక జన సమూహాల్ని సాంఘికంగా, ఆర్థికంగా అణచివేస్తున్నాయని గ్రహించాడు. నిజానికి శారీరక అనారోగ్యం కన్నా దేశాన్ని పట్టి పీడించే దోపిడి, అసమానతలు ఎన్నో రెట్లు తీవ్రమైనవని అర్థం చేసుకున్నందుకే ఆయన తన చక్రాల కుర్చీలో దేశమంతా పీడితుల వెంట తిరిగాడు. ఇంగ్లిషు, తెలుగు భాషల్లో ఎన్నో రచనలు చేశాడు. ఆలిండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం(ఏఐపిఆర్ఎఫ్) ఆంధ్రప్రదేశ్ కమిటీ కార్యదర్శిగా ఆ తర్వాత జాతీయ కార్యదర్శిగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ విధానాలకు వ్యతిరేకంగా అవిశ్రాంతంగా పని చేశాడు. వివిధ ప్రజా సంఘాల ఐక్యవేదిక నిర్మాణంలో కృషి చేశాడు. సామ్రాజ్యవాదులతో ఎన్జీవోల పొత్తును బహిర్గతం చేస్తూ విప్లవ దృక్పథంతో పీడిత ప్రజల పోరాటాలను సమర్థించాడు. అంతర్జాతీయ వేదికల్లో పోరాడే ప్రజలకు బాసటగా నిలిచాడు. ఫోరం అగెనెస్ట్ ఇంపీరియలిస్ట్ గ్లోబలైజేషన్ ఆధ్వర్యంలో ఢిల్లీ రాంలీలా మైదానం వద్ద జరిగిన ర్యాలీపై పోలీసులు దాడి చేసినప్పుడు ప్రజా సంఘాల కార్యకర్తలతో పాటు సాయిబాబాను కూడా విపరీతంగా కొట్టారు. చిన్నప్పటినుండీ కష్టాలను ఓర్చుకుని ఎదిగిన సాయిబాబా ఇటువంటి వాటిని లెక్కచేయక చక్రాల కుర్చీ నుండే రాజ్యాన్ని సవాలు చేయడం భరించలేక ప్రభుత్వం అంత కక్షపూరితంగా వ్యవహరిస్తున్నది.

ప్రజాస్వామిక గొంతుకలపై రాజ్యం ఉక్కుపాదం ఎప్పటి నుండో ఉంది. అయితే ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో ఏకంగా ప్రజలపై యుద్ధం మొదలయ్యాక అది ఎన్నో రెట్లు తీవ్రతరమైంది. డా. బినాయక్ సేన్‌కు జీవిత ఖైదు, జీతన్ మరాండీకి మరణశిక్షను విధించే స్థాయికి అది చేరుకుంది. ప్రజాస్వామికవాదుల తీవ్ర నిరసనలతో డా. బినాయక్ సేన్‌కు సుప్రీం కోర్టు బెయిలు ఇచ్చింది. జీతన్ మరాండీ విడుదలయ్యాడు. మధ్య, తూర్పు భారతదేశంలో సామ్రాజ్యవాద మార్కెట్ అవసరాల కోసం అడవిని చెరబట్టి ఆదివాసులపై ప్రభుత్వం యుద్ధానికి తెగబడ్డాక ప్రజలపై యుద్ధానికి వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా వివిధ ప్రజా సంఘాలతో ఏర్పడిన వేదికలోనూ (ఫోరం అగెనెస్ట్ వార్ ఆన్ పీపుల్), విస్థాపన వ్యతిరేక ఆందోళనల్లోనూ సాయిబాబా క్రియాశీలకంగా ఉంటూ వచ్చాడు. రాజకీయ ఖైదీల హక్కుల కోసం గొంతెత్తాడు. ఈ చర్యలన్నీ ప్రభుత్వం దృష్టిలో చట్టవిరుద్ధమైనవి. సాయిబాబాను ఇరికించిన కేసులో అంతకుముందే ఆయన లాగే సామాజికాచరణలో ఉన్న ప్రశాంత్ రాహీ (ఫ్రీలాన్స్ జర్నలిస్టు), హేమ్ మిశ్రా (జె.ఎన్. యూనివర్సిటీ విద్యార్థి, కళాకారుడు)లను విడివిడిగా అరెస్టు చేసి రోజుల తరబడి చిత్రహింసలు పెట్టారు. తర్వాత సాయిబాబా ఇంటిపై దాడి చేసినప్పుడు ఆయన ఇంట్లో దొంగ సొత్తు ఉందని సమాచారం వచ్చినట్లుగా వారెంట్ తెచ్చుకున్నారు. ఆ తర్వాత మరోమారు మావోయిస్టు సంబంధాల గురించి గంటల తరబడి ఇంటరాగేషన్ చేశారు. మీకే సమాచారం కావాలన్నా సహకరించడానికి సిద్ధంగా ఉన్నానని సాయిబాబా చెప్పి ఉన్నప్పటికీ అర్ధాంతరంగా మీద పడి కిడ్నాప్ చేసి ఎందుకు తీసుకుపోవలసి వచ్చిందో పోలీసుల వద్ద సమాధానం లేదు. ఏ నిరంకుశ చట్టాలకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నాడో వాటి కిందే ఆయన మీద బెయిలు రాకుండా కట్టుదిట్టం చేసే కేసులు నమోదు చేశారు.

ప్రస్తుతం ఆయన సహాయ కార్యదర్శిగా ఉన్న విప్లవ ప్రజాస్వామిక వేదిక (రెవల్యూషనరీ డెమాక్రటిక్ ఫ్రంట్ – ఆర్‌డిఎఫ్) తీవ్ర నిర్బంధాన్ని ఎదుర్కొంటున్నది. గత రాష్ట్ర ప్రభుత్వం ఏకంగా దానిపై నిషేధం విధించింది. దేశ వ్యాప్తంగా పలు రాష్ట్రాల్లో ఆర్‌డీఎఫ్ బాధ్యులను ఊపా వంటి నిరంకుశ చట్టాల కింద నిర్బంధించారు. ఆర్‌డిఎఫ్ ఉపాధ్యక్షుడు గంటి ప్రసాదను పట్టపగలే నడిరోడ్డుపై హత్య చేశారు. హంతకులెవరనే బహిరంగ రహస్యం ఇప్పటికీ వెల్లడి కాలేదు. ఆర్‌డీఎఫ్‌తో పాటు విద్యార్థి, యువజన, కార్మిక, రైతుకూలీ సంఘాలు నిషేధించబడిన జాబితాలో ఉన్నాయి. దేశం ఆర్థికంగా అధోగతి పాలవుతున్నా సామ్రాజ్యవాద విధానాలను వేగవంతం చేస్తూ,

మార్కెట్‌కు ప్రజల జీవితాలను పణం పెట్టే అభివృద్ధికి వ్యతిరేకంగా పోరాడుతున్న ఆదివాసులను, రైతులను, మత్స్యకారులను కాల్చి చంపుతూ నోరెత్తే వాళ్ళనల్లా జైళ్ళపాలు చేస్తున్న దశలో ఎన్నికలొచ్చి ప్రభుత్వం మారింది. వచ్చిన కొత్త ప్రభుత్వం నాలుగాకులు ఎక్కువే చదివింది కనుక వచ్చీ రాగానే పోలవరం కోసం ఆదివాసుల్ని శాపగ్రస్తుల్ని చేసే ఆర్డినెన్సు తెచ్చింది. ఇది కూడా సాయిబాబా వలె ప్రజల కోసం మాట్లాడటం. ప్రజల పక్షాన నిలబడటం నేరమంటుంది. భిన్నాభిప్రాయాల్ని, భిన్న రాజకీయ విశ్వాసాలను కలిగి ఉండటమే తీవ్రాతి తీవ్రమైన నేరమయిన పరిస్థితుల్ని ప్రశ్నించకపోతే నేరమవుతుంది. కనుక డా.జి.ఎన్. సాయిబాబా విడుదల కోసం, ఇంకా అనేక మంది రాజకీయ ఖైదీల విడుదల కోసం ఐక్యంగా కదులుదాం. భావాలపై నిషేధాన్ని బద్దలు కొడదాం. అందులో భాగంగా ఈ నెల 13వ తేదీన జరగబోయే ధర్నాలో పాల్గొని విజయవంతం చేయవలసిందిగా ప్రజాస్వామికవాదులందరికీ విజ్ఞప్తి చేస్తున్నాం.

**డిమాండ్స్:**

1. డాక్టర్ జి.ఎన్.సాయిబాబాను బేషరతుగా విడుదల చేయాలి. ఆయనపై పెట్టిన అక్రమ కేసులు ఎత్తివేయాలి. ఉద్యోగ తొలగింపు ఉత్తర్వులు వెనక్కి తీసుకోవాలి. క్వార్టర్స్ ఖాళీ చేయించే బెదిరింపులను మానుకోవాలి.
2. డా.జి.ఎన్.సాయిబాబాకు చెందిన కేసులోనే అరెస్టు చేసిన హేమ్ మిశ్రా, ప్రశాంత్ రాహీలను బేషరతుగా విడుదల చేయాలి.
3. రాజకీయ ఖైదీలను విడుదల చేయాలి.
4. సీపీఐ (మావోయిస్టు) పార్టీ, ఆరు ప్రజా సంఘాలు, ఆర్‌డీఎఫ్‌పై నిషేధం ఎత్తివేయాలి.
5. చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం (ఊపా)ను రద్దు చేయాలి.

**ప్రజా సంఘాల ఐక్యకార్యాచరణ వేదిక**

**భాగస్వామ్య సంఘాలు**

పౌరహక్కుల సంఘం (సి.ఎల్.సి.)
రాజకీయ ఖైదీల విడుదల కమిటీ (సి.ఆర్.పి.పి.)
సివిల్ లిబర్టీస్ మానిటరింగ్ కమిటీ (సి.ఎల్.ఎం.సి.)
మానవ హక్కుల వేదిక (హెచ్.ఆర్.ఎఫ్.)
విప్లవ రచయితల సంఘం (విరసం)
కుల నిర్మూలన పోరాట సమితి (కె.ఎన్.పి.ఎస్.)
అమరుల బంధుమిత్రుల సంఘం (ఎ.బి.ఎం.ఎస్.)
దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం (పి.డి.ఎం.)
చైతన్య మహిళా సంఘం (సి.ఎం.ఎస్.)
విస్థాపన్ విరోధ్ మంచ్ (వి.వి.ఎం.)
తెలంగాణ ప్రజా ఫ్రంట్ (టి.పి.ఎఫ్.)
డెమాక్రటిక్ టీచర్స్ ఫెడరేషన్ (డి.టి.ఎఫ్.)
తెలంగాణ ప్రోగ్రెసివ్ టీచర్స్ ఫెడరేషన్ (టి.పి.టి.ఎఫ్.)
ఉద్యోగ క్రాంతి
తెలంగాణ విద్యార్థి వేదిక (టి.వి.వి.)
డెమాక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ (డి.ఎస్.యు.)
తెలంగాణ స్టూడెంట్స్ అసోసియేషన్ (టి.ఎస్.ఎ.)
తెలంగాణ విద్యార్థి సంఘం (టి.వి.వి.)
ప్రగతిశీల మహిళా సంఘం (పి.డి.ఎస్.యు.)
భారత కార్మిక సంఘాల సమాఖ్య (ఐ.ఎఫ్.టి.యు.)
అఖిల భారత కిసాన్ మజ్దూర్ సంఘ్ (ఎ.ఐ.కె.ఎం.ఎస్.)
అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య (ఎ.సి.ఎఫ్.)
ప్రగతిశీల యువజన సంఘం (పి.వై.ఎల్.)
ప్రగతిశీల ప్రజాస్వామిక విద్యార్థి సంఘం (పి.డి.ఎస్.యు.)
ప్రగతిశీల మహిళా సంఘం (పి.ఓ.డబ్ల్యూ)
భారత కార్మిక సంఘాల సమాఖ్య (ఐ.ఎఫ్.టి.యు.)
తెలంగాణ రచయితల వేదిక (తెరవే)
పాలమూరు అధ్యయన వేదిక
నాజర్ కళాక్షేత్రం
మంజీరా రచయితల సంఘం (మరసం)
తెలంగాణ ఫోరం ఎగనెస్ట్ డిస్ప్లేస్‌మెంట్ (టి.ఎఫ్.ఎ.సి.)

**వ్యక్తులు**

చుక్కారామయ్య, పొత్తూరు వెంకటేశ్వరరావు, ప్రొ.జి. హరగోపాల్, బొజ్జా తారకం, ప్రొ.కె.ఆర్. చౌదరి, ప్రొ.కోదండరాం, ప్రొ. చక్రధర్‌రావు, ప్రొ.కె. లక్ష్మీనారాయణ, టంకశాల అశోక్, కె. రామచంద్రమూర్తి, వి. హనుమంతరావు, ఎన్. వేణుగోపాల్, బి. నర్సింగరావు, జాహెద్ అలీఖాన్, కె. శివారెడ్డి, డాక్టర్ కావేరి ఇందిర, ప్రొ. కేశవరావు జాదవ్, నారాయణమూర్తి, ఉషా ఎస్.డాని, కాకరాల.

– ప్రజా సంఘాల ఐక్యకార్యాచరణ వేదిక



# విప్లవ సాహిత్యంతో ఓ సాయంకాలం

కథ, కవిత్వం, నవల, విశ్లేషణ ప్రక్రియల్లో విరసం కృషిని సూచించే ఐదు పుస్తకాల ఆవిష్కరణ సభకు మీ అందరికీ ఆహ్వానం. ఉదయభాను రాసిన "పిల్లనగ్రోవి తుఫాను" కవితా సంపుటి, పద్మకుమారి రాసిన "కాంత పున్నం వెన్నెల" కథ, మావోయిస్టు నాయకుడు వెర్నన్ గొంజాల్వెజ్ రాసిన ఆంగ్ల కథకు తెలుగు అనువాదం "రేపు", నల్లూరి రుక్మిణి నవల "ఒంగ్రుమట్టి", "దాక్షిణ్యవాదం నుంచి దండకారణ్యం దాకా" రత్నమాల విశ్లేషణ వ్యాస సంపుటి ఈ సభలో పరిచయమవుతాయి.

**సభాధ్యక్షత:**
కాశీం
పుస్తక పరిచయాలు:
ఒంగ్రుమట్టి: కె శివారెడ్డి
దాక్షిణ్యవాదం నుంచి దండకారణ్యం దాకా: పద్మకుమారి
కాంత పున్నం వెన్నెల, రేపు కథలు : కోడూరి విజయ్‌కుమార్
పిల్లనగ్రోవి తుఫాను: ఎన్ వేణుగోపాల్

**25 జూన్, బుధవారం సాయంకాలం 6 గంటలకు**
**బషీర్‌బాగ్ ప్రెస్ క్లబ్, హైదరాబాదు.**

దండకారణ్య కవి సమయంలో నిలబడి ఉదయ భాను పిల్లనగ్రోవి తుఫాను పాట వినిపిస్తున్నాడు. ఈ కాలపు యువ విప్లవ కవిత్వానికి ఈ సంపుటి ప్రాతినిధ్యం వహిస్తుంది. ఇది ఉదయభాను రెండో కవితా సంపుటి. ఇందులో దండకారణ్య ప్రత్యామ్నాయ అభివృద్ధినీ, ఆదివాసుల జనతన సర్కారుపై భారత పాలకవర్గం చేస్తున్న యుద్ధాన్నీ తన కవితావరణలోకి తీసుకొని వచ్చాడు ఈ యువ కవి. యుద్ధమూ, నిర్మాణమూ అనే సామాజిక రాజకీయార్థిక సందర్భంలోని కవితా శిల్పం ఇందులో చూడవచ్చు.

వనరుల దోపిడీ, పెట్టుబడి విస్తరణ సాగుతున్న ఈ తరుణంలో నల్లూరి రుక్మిణి కోస్తా ప్రాంతంలో పోగుబడ్డ పెట్టుబడి మూలాలను అన్వేషిస్తూ ఒంగ్రుమట్టి నవల రాశారు. కోస్తా జిల్లాల రాజకీయార్థిక చరిత్రను పరిశోధించి రాసిన నవల ఇది. అందువల్ల ఇప్పటి దాకా సృజనాత్మక సాహిత్యంలో వ్యక్తంకాని కొత్త కోణం ఆ ప్రాంత ఎకానమీ మీద ఈ నవల ప్రసరిస్తోంది. యాభై ఏళ్ల కింద బతుకుతెరువు కోసం కోస్తా పల్లెల నుంచి తెలంగాణకు సాగిన వలసను ఆ స్థలకాలాల్లో అర్థం చేసుకుంటునే అక్కడి ఒంగ్రు మట్టి ఎట్లా కొట్టుకొని వచ్చి కోస్తా "అభివృద్ధి" చెందిందో ఆమె ఈ నవలలో పసిగట్టారు. ఈ పెట్టుబడి కారంచేడు దళితులపై అమానుష దాడికి నేపథ్యంగా ఎట్లా పని చేసిందీ ఈ నవల సజీవంగా చిత్రించింది.

విప్లవంలో మాతృత్వం గురించి అనేక లోతైన విషయాలను పద్మకుమారి రాసిన కథ 'కాంత పున్నం వెన్నెల' చర్చిస్తుంది. కాంత అనే ఆదివాసీ మహిళ మాతృత్వానికి, విప్లవ జీవితానికి మధ్య వైరుధ్యాన్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. పాపను కనడం వల్లే ప్రధాన ఉద్యమానికి దూరమయ్యాక కూడా కాంత తిరిగి తనను తాను విప్లవోద్యమంలో భాగం చేసుకోవాలనుకుంటుంది. ఈ కథ లోపలి పొరల్లో మాతృత్వానికి, విప్లవానికి సంబంధించిన ప్రశ్నలనేకం ఉంటాయి. అట్లాగే "రేపు" దండకారణ్య క్రాంతికారీ జనతన సర్కార్ నేపథ్యంలో రాసిన కథ. బూర్జువా న్యాయ వ్యవస్థను జనతన సర్కార్ న్యాయవ్యవస్థనూ పోల్చుతూ అత్యద్భుతమైన శిల్పంలో ఈ కథ రాశారు. వర్తమాన విప్లవ కథకు వస్తు శిల్పాల్లో ఉదాహరణగా నిలవదగ్గ కథ ఇది.

మహిళా పోరాటాలను గత చరిత్ర నుంచి ఇవ్వాల్టి దండకారణ్య క్రాంతికారీ మహిళా ఉద్యమం దాకా రత్నమాల తన పుస్తకంలో విశ్లేషించారు. స్త్రీలపట్ల దయాదాక్షిణ్యాలతో ఆలోచించిన రోజుల నుంచి దండకారణ్యమే ఇవ్వాల్టి స్త్రీ విముక్తికి సజీవ ఉదాహరణగా నిలిచిన వర్తమాన చరిత్ర దాకా ఈ పుస్తకంలో రికార్డయింది. పితృస్వామ్యం, కుటుంబం గురించి మార్క్సిస్టు లెనినిస్టు అవగాహనను దృఢంగా ప్రకటించిన వ్యాసాలు ఇందులో ఉన్నాయి.

వర్తమాన విప్లవోద్యమ, విప్లవ సాహిత్యోద్యమ విస్తృతిని, వికాసాన్ని ప్రతిబింబించే ఈ పుస్తకాల ఆవిష్కరణ, పరిచయ సభను విజయవంతం చేయాలని మనవి.

***- విప్లవ రచయితల సంఘం, సిటీ యూనిట్***

**సవరణ:**

రెండు పోరాట గాథలు పుస్తకంలోని బాసిత్ ముందుమాటపై సాబిత్ మార్చి-మే 2014లో రాసిన లేఖలో దొర్లిన అచ్చుతప్పులకు సవరణలు (1) 63వ పేజీ కుడికాలంలో 4 లైనుకు సవరణ - మావో రాసిన "on protracted war"లో ప్రజా యుద్ధాన్ని 3 దశలుగా సూత్రీకరించాడు 1. strategic defensive, 2.strategic equilibrium, 3.strategic counter offensive లుగా సరిచూసుకోగలరు.

(2) 63వ పేజీలో చివరి పేరా కింది నుండి పైకి రెండవ లైను - ప్రజలు నేడు ప్రధానంగా తెలంగాణలో విప్లవోద్యమాన్ని, విప్లవకారులని కాపాడుకోలేని పరిస్థితి వచ్చిందా...? అని సరి చూసుకోగలరు.

- సం.

# వర్తమాన సమాజం - సాహిత్యం
# విరసం ఆవిర్భావ దినం సందర్భంగా సాహిత్య సభ!

జూలై 4 అనగానే విరసం పుట్టుక జ్ఞాపకానికి వస్తుంది. నాలుగున్నర దశాబ్దాలుగా తెలుగు ప్రజల సామాజిక జీవనంలో కలగలసి కాలంతోపాటు పయనిస్తూ నిరంతరం ప్రజల పక్షాన పనిచేస్తున్న విప్లవరచయితలు సంఘం రచయితలు ఆచరణ శీలురు కావాలి అనే సుబ్బారావు పాణిగ్రాహి తాత్వికతను స్వీకరించి నిబద్ధత, నిమగ్నతలతో తెలుగు సాహిత్యంపై బలమైన ముద్రను వేసింది. సమాజపు ప్రతి మూల మలుపులోను తనదయిన భావజాలాన్ని ప్రసరించి, అన్నిరకాల ఆధిపత్యాలను, అణిచివేతలను ధిక్కరించి విప్లవోద్యమ భావప్రచారానికి వాహికగా ముందుకు సాగుతోంది. సాహిత్యాన్ని రాజకీయాలతో వేరుచేసే ఆలోచనలను ఛేదిస్తూ సాహిత్యం-రాజకీయాలు వేరుకాదనే భావనను తెలుగు సమాజంపై బలంగా వేయగలగింది. తెలుగు నేలపై విరసం ఆవిర్భావం జరగకుంటే తెలుగు సాహిత్యం దశ-దిశ వేరుగా ఉండేదని బుద్ధిజీవులు అభిప్రాయపడతారు. ఇప్పుడు జులై 4 అంటే విరసం ఆవిర్భావంతో పాటు కా.గంటి ప్రసాదం అమరత్వం కూడా గుర్తుకు వస్తుంది. గత ఏడాది జులై 4న విరసం పుట్టిన రోజు సభలో మాట్లాడి నెల్లూరు నడి రోడ్డు మీద రాజ్యం హంతక ముఠా చేతిలో హత్యకు గురైన ఘటన పచ్చిగానే జ్ఞాపకం వస్తుంది. అది మరణంలోనూ ఆయన నిలబెట్టిన విప్లవ స్ఫూర్తితో పాటు జ్ఞాపకం వస్తుంది. అది విరసం ఆశయాలను మరింత దృఢతరం చేస్తుంది.

తెలుగు ప్రజలకు రెండు రాష్ట్రాలు ఏర్పడిన ఇవాల్టి సందర్భంలో విభజన ద్వారా ఏర్పడిన ఖాళీలను, అపోహలను ప్రజల మనసుల నుండి దూరం చేసే ఓ సాంస్కృతిక వాతావరణం ఏర్పడాలని విరసం కోరుకుంటోంది. భౌగోళికంగా రెండు రాష్ట్రాల్లో ఉన్నా పీడిత ప్రజలంతా వర్గబంధువులే. ఈ ఎరుకను కలిగించే దిశగా బుద్ధిజీవులు, రచయితలు, కళాకారులు రెండు ప్రాంతాలలో అణగారిన ప్రజల, పీడితవర్గాల పక్షాన నిలబడాల్సి ఉన్నది. ఈ చారిత్రక బాధ్యతను గుర్తెరిగి రెండు ప్రాంతాలలోను విరసం తన సాహిత్య కార్యాచరణను ప్రకటించుకున్నది. మునుపటి కాలం కంటే మరింత చొరవతో పనిచేయాలనే ఆలోచన చేస్తున్నది.

ఈ నేపథ్యంలో విజయవాడలో జరగనున్న విరసం సాహిత్య సభకు చారిత్ర ప్రాధాన్యత ఉంది. విభజన వల్ల అన్నీ కోల్పోయి "అవశేష" ఆంధ్రప్రదేశ్ క్లిష్ట పరిస్థితుల్లో ఉందని నవ్యాంధ్రను నిర్మించుకోడానికి ప్రజలు సహకరించాలని పాలకవర్గాలు, మీడియా పెద్ద ఎత్తున ప్రచారం చేస్తున్నాయి. విస్తారమైన సముద్ర తీరప్రాంతం, సారవంతమైన పంటభూములు, ఖనిజ సంపదతో ఏ విషయంలో ఆంధ్రప్రదేశ్ తీసికట్టుగా లేదు. కేవలం కార్పొరేట్ల, వ్యాపారవర్గాల ప్రయోజనం కోసం అన్నం పెట్టే భూములతో సహా ఈ సహజ ప్రకృతి సంపదను నాశనం చేసే ఒక ప్రమాదకరమైన అభివృద్ధి భావజాలంతో పాలకులు ధ్వంసరచన చేస్తున్నారు. మరోవైపున ఏ ప్రాంతీయ అసమానతలైతే తెలంగాణ ఉద్యమానికి కారణమయ్యాయో అవి కొత్త ఆంధ్రప్రదేశ్‌లో పరిష్కారం కాకపోగా మరింత తీవ్రతరం కాబోతున్నాయి. సామ్రాజ్యవాద మార్కెట్ విస్తరిస్తున్న కొద్దీ అన్ని రకాల వైరుధ్యాలు ఇంకా సంక్లిష్టంగా ముందుకు వస్తూనే ఉంటాయి. ఈ వైరుధ్యాలను పరిష్కరించలేని పాలకవర్గాలకు బలప్రయోగం ద్వారా ప్రజల్ని కట్టడి చేయడమే మార్గంగా ఉంటుంది. అటువంటి స్థితిలో ఎప్పటి కన్నా మరింత నగ్నంగా ఆధిపత్య కులాల, మతాల పక్షాన రాజ్యం నిలబడుతుంది. సంక్షోభాలు ముదిరే దశలో ప్రజా ఉద్యమాలు బలపడకపోతే వాటిని ఫాసిస్టు మూకలు అందిపుచ్చుకుని మత రాజకీయాలతో విజృంభిస్తాయదానికి చరిత్ర, వర్తమానం కూడా తార్కాణాలే. ఇటువంటి సమయంలోనే రచయితల, బుద్ధిజీవుల పాత్ర అత్యంత కీలకగా ఉంటుంది.

కాబట్టి పాలకవర్గ రాజకీయాలకు ప్రత్యమ్నాయంగా ప్రజానుకూల రాజకీయాల గురించి ఆలోచించవలసిన, చర్చించ వలసిన అవసరం ఉంది. అటువంటి ప్రత్యమ్నాయ రాజకీయాలతో అద్భుతమైన ప్రయోగం చేస్తున్న దండకారణ్య జనతన సర్కార్లు"70ల్లో నక్సల్బరీ, శ్రీకాకుళాలు ఇచ్చినట్లుగానే ఇప్పుడు ఒక సాహిత్య సాంస్కృతిక సందర్భాన్ని ఇస్తున్నాయి. అప్పటి కంటే మరింత స్పష్టంగా విప్లవమంటే యుద్ధం, నిర్మాణం కూడానని విప్లవోద్యమంతో పెనవేసుకున్న ఆదివాసీల జీవితాన్ని దండకారణ్య రచయితలు యుద్ధం మధ్యనే సాహిత్యీకరిస్తున్నారు. ఆ దండకారణ్య కథాసాహిత్యం ఆ

**కార్యక్రమం**

దీ.6-7-2014 ఆదివారం
ఉదయం 10 గంటల నుండి 5 గంటల వరకు
స్థలం : స్వతంత్ర సమరయోధుల భవనం,
ఆర్‌టిసి బస్టాండ్ దగ్గర, విజయవాడ.

అధ్యక్షత : అరసవిల్లి కృష్ణ
దండకారణ్య కథలు - విశ్లేషణ
కె.శోభారాణి (కాకతీయ విశ్వవిద్యాలయం)
అంతర్జాల సాహిత్యం : పాణి (విరసం)

భోజన విరామం 1 గంటల నుండి 2 గంటల

అధ్యక్షత : నల్లూరి రుక్మిణి
వర్తమాన సాహిత్య విమర్శ ఎన్.వేణుగోపాల్, (వీక్షణం)
కుల-హిందూ ఆధిపత్య భావజాల ప్రమాదం-
సాహిత్యకారుల పాత్ర
సి.కాసిం, (విరసం)

రకంగా "ప్రపంచంలో తొలి విప్లవాలు పెల్లుబికిన ఫ్రెంచ్ రష్యన్, చైనా సాహిత్యాలకు ధీటైన సాహిత్యం".

రోజురోజుకూ సంక్లిష్టమవుతున్న సమాజంలో మనిషి అంతర్ బహిర్ సంఘర్షణలను చిత్రిస్తున్న అంతర్జాల సాహిత్యం కొత్త ఒరవడిగా ముందుకు వస్తూ నేటి తరం భావోద్వేగాలను ప్రతిఫలిస్తున్నది. దండకారణ్య సాహిత్యం పురోగామి మార్పు కోసం పడే ఘర్షణను చిత్రీకరిస్తే ఆ సమాజం కన్నా ఎన్నో రెట్లు సంక్లిష్టమైన ఆధునిక సమాజంలో విభిన్నమైన వైరుధ్యాలను పట్టుకునే ప్రయత్నం ఇక్కడి సాహిత్యం చేస్తున్నది. వైయక్తికమో, అంతర్ముఖత్వమో, లేక కేవలం అనుభవవాదమో ఇక్కడి సాహిత్యానికి పరిమితులు విధిస్తే, స్పష్టమైన సామాజికార్థిక, రాజకీయ దృక్పథం ఉన్న దండకారణ్య సాహిత్యం మనిషిని సమాజంలో భాగంగానే కాక, సామాజిక పరిణామంలో భాగంగా చిత్రించడం వల్ల పరిణతి సాధించింది. ఇక్కడి జీవన విధ్వంసం మధ్య దండకారణ్య సాహిత్య సమయం ఒక నూతన మానవ ఆవిష్కారం దిశగా సాగుతున్న ప్రయాణాన్ని తరచి చూడడానికే. తెలుగుసాహిత్య విస్తృతిని అర్థం చేసుకోడానికి ఈ రెండు పాయల సాహిత్యాలనూ విశ్లేషించవలసిందే. అయితే వర్తమాన సాహిత్య విమర్శ అనేక పరిధులకు, పరిమితులకు లోబడటం వల్ల సమాంతర సాహిత్యాన్ని, ప్రత్యామ్నాయ సాహిత్యాన్ని చూడటం లేదు. ఈ రకంగా అది పాక్షిక దృష్టిగా మిగిలిపోతున్నది. దృక్పథపరమైన ఏకీభావం ఉంటే చాలు పొగడటమో లేని పక్షంలో తెగడటమో సాహిత్య విమర్శగా చలామణీ అవుతున్నది. మారిన కాలమాన పరిస్థితులను, సామాజిక పరిణామాలను శాస్త్రీయంగా విశ్లేషించగలిగే మార్క్సిజం వెలుగులో తెలుగు సాహిత్యవిమర్శను అభివృద్ధి చేయవలసిన అవసరం ఉంది. కొత్తతరం సాహిత్య విమర్శకులు అటువంటి విమర్శను పదునెక్కించాలి. ఆ దిశగా ప్రయత్నిస్తూ సాహిత్య విమర్శలో ఉన్న సమస్యలను, పరిమితులను అవలోకించడం ద్వారా, విమర్శ బలపడుతుందని విరసం ఆశిస్తున్నది.

ఈ నేపథ్యంలో విరసం మరింత చొరవతో ప్రగతిశీల రచయితలతో, సాహిత్యాభిమానులతో సంభాషణ కొనసాగిస్తూ, సాహిత్య సాంస్కృతిక రంగాలలో తన కర్తవ్యాన్ని నెరవేరుస్తూ ముందుకు సాగుతుంది. అందులో భాగంగా ఈ సదస్సును నిర్వహిస్తున్నది. సంక్షుభిత దశ కూడా అయిన ఈ చారిత్రక సన్నివేశంలో సాహిత్యం గురించి, వర్తమాన సామాజిక స్థితిగతుల గురించి చర్చించుకోడానికి సాహితీ మిత్రులందరినీ విరసం ఆహ్వానిస్తున్నది.

**- విప్లవ రచయితల సంఘం**

***www.virasam.in*** 

పత్రికా ప్రకటన

# ఎన్‌కౌంటర్ హత్యలతో నవ్యాంధ్రకు స్వాగతమా?

ప్రమాణం చేసి నెల కూడా కాలేదు. నెత్తుటి పాలన మొదలయింది. నల్లమలలో ఎదురు కాల్పులు జరిగి చనిపోయారని చెప్పబడుతున్న బాబూరావు, నాగమణి, విమలలను రెండు రోజుల క్రితమే పోలీసులు అపహరించి, చిత్రహింసలు పెట్టి, గెరిల్లా దుస్తులు తొడిగి చంపేశారు. అత్యంత క్రూరంగా హత్య చేసి, చనిపోయిన వారి తలల మీద వెలల గురించి, వారి మీద నమోదైన కేసుల గురించి చెప్పడం హత్యారాజకీయాల మీద మనుగడ సాగిస్తున్న ప్రభుత్వాలకు అలవాటైనదే. చనిపోయిన ముగ్గురూ నిరుపేద కుటుంబాలకు చెందిన వారు. బాబూరావు, నాగమణిలు ఆదివాసీల్లోనూ అత్యంత వెనుకబాటుకు గురైన యానాది, చెంచు తెగలకు చెందినవారు. నల్లమలలో విప్లవకారులను అంతం చేసి, చెంచులను తరిమేసి అడవినంతా తెగనమ్ముకునే ప్రక్రియ ఎప్పుడో మొదలైంది. దీనికి ఏ కొంచెం అడ్డు అనుకున్నా, వారిని అంతం చేయడం అన్ని ప్రభుత్వాల ఉమ్మడి విధానంగా ఉంటున్నది. కాబోయే రాజధాని అని చెప్పబడుతున్న ప్రాంతానికి దగ్గరగా నవ్యాంధ్ర నిర్మాణానికి నెత్తుటి వనరు సమకూర్చుకోవడం ఈ మూడు హత్యలతో మొదలు పెట్టింది చంద్రబాబు ప్రభుత్వం. లక్షలాది ఆదివాసుల్ని ముంచి తీర ప్రాంత జీవన విధ్వంసంపైన కార్పొరేట్ పారిశ్రామిక కారిడార్ కోసం పోలవరం నిర్మాణం మొదలు ముందున్నదంతా జీవన విధ్వంసమూ, రాజ్యహింస అనడానికి ఈ హత్యలు ఒక సూచిక. మారిన మనిషిగా ఈ మారు ఎన్నికలకొచ్చిన చంద్రబాబు మారిన స్వరూపం మరింత హింసాత్మకంగా ఉండటమేనా?

అమరులైన వారిలో ఇద్దరు మహిళలు తెలంగాణకు చెందిన వారు. ఒకరిది మహబూబ్‌నగర్, మరొకరిది మెదక్ జిల్లా. నక్సల్ ఎజెండాయే తన ఎజెండా అని ప్రకటించుకున్న తెలంగాణ ముఖ్యమంత్రి చంద్రశేఖరరావు ఈ హత్యల పై నోరు విప్పాలి.

**- పి. వరలక్ష్మి (కార్యదర్శి), పాణి (కార్యవర్గ సభ్యులు),**

**జి. కళ్యాణరావు, వరవరరావు (సీనియర్ సభ్యులు)**

తేది: 21.06.2014

విప్లవ రచయితల సంఘం

# రాజ్యహింసకు వ్యతిరేకంగా కామ్రేడ్ గంటి ప్రసాదం మొదటి వర్ధంతి సభ

జూలై 4 విప్లవ రచయితల సంఘం ఆవిర్భావ దినం. జూలై 18 అమరుల బంధుమిత్రుల సంఘం పుట్టిన రోజు. కామ్రేడ్ గంటి ప్రసాదం 1972లో విరసంలో చేరారు. బహిరంగ ప్రజా జీవితంలో ఉన్నంత కాలం సంస్థ కార్యకలాపాల్లో పాల్గొన్నారు. అరెస్టు, విడుదల తర్వాత కూడా చివరి దాకా విరసం శ్రేయోభిలాషిగా, మార్గదర్శిగా, మిత్రుడిగా కొనసాగారు. అప్పటికే ఎన్‌కౌంటర్ మృతదేహాల స్వాధీనం, అంత్యక్రియలు, అమరుల కుటుంబాల సంక్షేమం తదితర కార్యక్రమాలను రాజ్యహింస వ్యతిరేక పోరాట చైతన్యంతో నిర్వహిస్తున్న అమరుల బంధు మిత్రుల సంఘంలో ఆయన జెయిలు నుంచి బయటికి వచ్చాక చేరారు. ఆయన సోదరుడు కామ్రేడ్ రాజన్న కోపర్‌డాంగ్ ఎన్‌కౌంటర్లో అమరుడైనందున గంటి ప్రసాదం సహజంగానే ఏబీఎంఎస్‌లో చేరి గౌరవాధ్యక్షుడిగా, అధ్యక్షుడిగా నాయకత్వం వహించారు. ఈ రెండు సంఘాల ఆవిర్భావ దినాల సందర్భంగా రాజ్యహింస వ్యతిరేకంగా గంటి ప్రసాదం మొదటి వర్ధంతి సభను నిర్వహిస్తున్నాం.

శ్రీకాకుళ పోరాటం దెబ్బతిన్న కాలంలో ప్రసాదం విప్లవ రాజకీయాల్లోకి వచ్చారు. ఉత్తరాంధ్రలో ఎన్నో ప్రజా సంఘాలను నిర్మించి పోరాటాలు నిర్వహించారు. ముఖ్యంగా కార్మిక రంగంపై ప్రత్యేక శ్రద్ధ పెట్టి పని చేశారు. సీపీఐ ఎంఎల్ పార్టీ యూనిటీ నాయకుడిగా ఇతర రాష్ట్రాల్లో విప్లవోద్యమ విస్తరణకు కృషి చేశారు. 1998లో మునపటి పీపుల్స్‌వార్, పార్టీ యూనిటీల విలీనానికి పీయూ నుంచి గంటి ప్రసాదం కీలక పాత్ర పోషించారు. ఆ తర్వాత అజ్ఞాత విప్లవోద్యమంలోకి వెళ్లిపోయారు. పీపుల్స్‌వార్ అధికార పత్రిక క్రాంతి సంపాదకుడిగా, పార్టీ రాష్ట్ర కమిటీ అధికార ప్రతినిధిగా ఆయన పని చేశారు. 2005లో ఔరంగాబాద్‌లో అరెస్టయ్యాక నిజామాబాద్, హైదరాబాదు జెయిళ్లలో చాలా కాలం ఉండి విడుదలయ్యారు. ఆ తర్వాత అమరుల బంధు మిత్రుల సంఘం నాయకుడిగా పని చేస్తూ మరోమారు అరెస్టయి చాలా కాలం జెయిల్లో ఉండి విడుదలయ్యారు.

రాజకీయ ఖైదీల విడుదల ఉద్యమంలో, ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక ఉద్యమంలో కూడా ఆయన పని చేశారు. ఆర్డీఎఫ్ ఉపాధ్యక్షుడిగా విప్లవ ప్రజాస్వామిక ఉద్యమ నిర్మాణాన్ని ఆయన చివరి రోజుల్లో చేపట్టారు. నిజానికి దండకారణ్యంలో సాగుతున్న గ్రీన్‌హంట్ యుద్ధానికి వ్యతిరేకంగా ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్న ఆందోళనలను దేశవ్యాప్తంగా విస్తరింపజేసే క్రమంలోనే రాజ్యం ఆయనను బలి తీసుకున్నది.

ఈ ఏడాది కాలంలో ప్రసాదం వలె సుదీర్ఘకాలం విప్లవోద్యమానికి జాతీయ స్థాయిలో నాయకత్వం వహించిన కామ్రేడ్ రవూఫ్, కామ్రేడ్ సుశీల్‌రాయ్ అమరులయ్యారు. ఈ ఇద్దరు నక్సల్బరీ తరం విప్లవకారులు. రవూఫ్ 1969 సీపీఐ ఎంఎల్ ఏర్పడ్డప్పటి నుంచి విప్లవోద్యమ నాయకత్వ బాధ్యతల్లో ఉన్నారు. 1977 మార్చిలో జరిగిన ఎన్నికల తర్వాత మారిన రాజకీయ పరిస్థితి దృష్ట్యా విప్లవోద్యమ కర్తవ్యాలను ప్రకటించిన ఆగస్ట్ తీర్మానంతో విభేదిస్తూ జెయిల్లో ఉన్న కా. రవూఫ్ ఆ పార్టీ నుంచి బయటికి వెళ్లిపోయారు. ప్రజాపంథాను అమలు చేయవలసిన ఆ తీర్మానానికి, సాయుధ పోరాటానికి మధ్య కృత్రిమ వైరుధ్యాన్ని ఆయన ఊహించారు. అయితే ఆయన చివరి దాకా విప్లవోద్యమ పురోగమనంలో కీలక పాత్ర పోషించారు. ఆయన నాయకత్వంలోని సీపీఐ ఎంఎల్ నక్సల్బరీ పార్టీ మావోయిస్టు పార్టీలో విలీనం కావడానికి చేసిన ప్రయత్నాలు రవూఫ్ అనారోగ్యంతో ఉన్న కాలంలోనే ఒక కొలిక్కి వచ్చి ఆయన మరణానంతరం పూర్తయ్యాయి.

సుశీల్‌రాయ్ కూడా ఆ తరానికి చెందిన నాయకుడు. 1969లో సీపీఐ ఎంఎల్‌లో భాగం కాకుండా దక్షిణ్‌దేశ్ గ్రూప్‌గా కొనసాగుతుండిన కామ్రేడ్స్‌తో 1969 అక్టోబర్ 20న మావోయిస్టు కమ్యూనిస్టు సెంటర్ ఏర్పడిరది. దాని వ్యవస్థాపకులు అమూల్యసేన్, కనయ్ చటర్జీల తర్వాత అంత కీలక నేత సుశీల్‌రాయ్. పశ్చిమ బెంగాల్ నుంచి కామ్రేడ్ చారుమంజుందార్ తర్వాత విప్లవోద్యమ నిర్మాణంలో చివరి దాకా కొనసాగిన మేధావి అయిన నాయకుడు ఆయన. మునుపటి పీపుల్స్‌వార్, ఎంసీసీల విలీనానికి ఆ వైపు నుంచి అకుంఠితంగా ఆయన ప్రయత్నించారు. ఒక దశలో చర్చలు ప్రతిష్టంభనకు గురై పరస్పరం కాల్పుల దాకా వెళ్లినా, దేశంలోని అతి ముఖ్యమైన ఈ రెండు విప్లవ నిర్మాణాలు ఐక్యం కావడం విప్లవోద్యమానికి ఎంత అవసరమో గుర్తించి ఆ దిశగా కృషి చేశారు.

**కార్యక్రమం**

పతాకావిష్కరణతో ప్రారంభం

శ్రీలంక మారణకాండ-ఈలం అమరుల కుటుంబాలపై రాజ్యహింస-ప్రతిఘటన: పరిమళపంజా

విప్లవోద్యమం-ఎన్‌కౌంటర్లు-మృతదేహాల స్వాధీన పోరాటం: పద్మకుమారి

దండకారణ్య విప్లవోద్యమం-పెరుగుతున్న హిందూ ఫాసిజం ప్రమాదం: వరలక్ష్మి

అమరుల జీవితం-పోరాటం: వరవరరావు

విప్లవ బాటసారి గంటి ప్రసాదం స్మృతి గీతాలు-సీడీ ఆవిష్కరణ: కా. కామేశ్వరి (కా. ప్రసాదం జీవన సహచరి)

విశ్లేషణ: కాశీం (విరసం)

ముజఫర్‌నగర్:మరో మానని గాయం-పుస్తకావిష్కరణ: దేవిడ్ (ఉస్మానియా యూనివర్సిటీ పరిశోధక విద్యార్థి)

**జూలై 18, 2014**

**సాయంత్రం 4.00 గంటల నుండి రాత్రి 9.00 గంటల వరకు**

**సుందరయ్య విజ్ఞాన కేంద్రం, హైదరాబాదు.**

పార్టీలో సోము అనే పేరుతో కొనసాగిన సుశీల్‌రాయ్ సుదీర్ఘ కాలం జైల్లో ఉండి ఇటీవలే అనారోగ్యంతో ఆస్పత్రిలో మరణించారు. బెంగాలీలో ఆయన తన ఆత్మకథను రాశారు. అది హిందీ, ఇంగ్లీషు భాషల్లో త్వరలో విడుదల కానుంది.

ఒక రకంగా నక్సల్బరీ తర్వాత జరిగిన అనేక పరిణామాల వల్ల వేర్వేరు నిర్మాణాలుగా కొనసాగిన పార్టీ యూనిటీ, ఎంసీసీ, సీపీఐ ఎంఎల్ నక్సల్బరీల నుంచి వచ్చిన గంటి ప్రసాదం, సుశీల్‌రాయ్, రవూఫ్‌లు ఇవాళ ఒక ఐక్య విప్లవోద్యమ అమరవీరులుగా రాబోయే తరాలకు గొప్ప స్ఫూర్తినిస్తారు.

వీరిలాగే జీవితమంతా విప్లవోద్యమానికి తొలుత నేరుగా నిర్మాణరంగంలో, ఆ తర్వాత మేధో రంగంలో కృషి చేసిన సునిత్‌కుమార్ ఘోష్ కూడా మే 11న అనారోగ్యంతో 96వ ఏట అమరుడయ్యారు. సీపీఐ ఎంఎల్ వ్యవస్థాపక సభ్యుడిగా, ఆ పార్టీ అధికార ఇంగ్లీషు పత్రిక లిబరేషన్ సంపాదకుడిగా ఘోష్ పని చేశారు. 1977లో సీవోసీ రద్దయిపోయే దాకా ఆయన పార్టీ నిర్మాణంలో పని చేశారు. ఆ తర్వాత జీవితకాలమంతా నక్సల్బరీ పంథాను రాజకీయార్థిక శాస్త్రంలో, చరిత్రలో ఎత్తిపట్టడానికి కృషి చేశారు. లిబరేషన్ పత్రికలోని వ్యాసాలను "ఎ లిబరేషన్ ఆంథాలజీ" అనే పేరుతో రెండు సంకలనాలు తీసుకొని వచ్చారు. మౌలిక స్థాయి అవగాహన అందించే వందలాది వ్యాసాలు రాశారు. వీటన్నిటికంటే "ఇండియన్ బిగ్ బూర్జువాజీ" అనే రచన చాలా విశిష్టమైనది. మావోయిస్టు ఉద్యమంపట్ల కొన్ని భిన్నాభిప్రాయాలు ఆయనకు ఉన్నప్పటికీ నక్సల్బరీ పంథాను చివరి దాకా విశ్వసించి మేధోరంగంలో దాని కోసం కృషి చేశారు.

ఈ ఏడాది కాలంలో వీరితోపాటు తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలో అనేక మంది విలువైన కామ్రేడ్స్ అమరులయ్యారు. అదిలాబాదు జిల్లా బెల్లంపల్లికి చెందిన సరోజ అలియాస్ అమర సుదీర్ఘ కాలంగా విప్లవోద్యమంలో కొనసాగుతూ 2013 డిసెంబర్ 11న దండకారణ్యంలో అనారోగ్యంతో అమరురాలయింది. మహబూబ్‌నగర్ జిల్లా వనపర్తి పక్కన ఓ గ్రామానికి చెందిన రాములు ఒడిషాలోని కోరాపుట్‌లో ఆగస్టు 21, 2013న జరిగిన బూటకపు ఎన్‌కౌంటర్‌లో అమరుడయ్యారు. అక్టోబర్ 31, 2013న వరంగల్ జిల్లాకు చెందిన మొగిలి అలియాస్ నరేష్‌ను, ఖమ్మం జిల్లా మల్లంపేటకు చెందిన కామ్రేడ్ రాములును ఎన్‌కౌంటర్ పేరుతో కాల్చి చంపారు. ఈ ఏడాది మార్చి 4న కోరాపుట్ దగ్గర పుట్టంగిలో ఖమ్మం జిల్లాకు చెందిన మంగన్న, అనంతపురం జిల్లాకు చెందిన సంజీవప్పలను బూటకపు ఎన్‌కౌంటర్‌లో కాల్చేశారు. జూన్ 19న గుంటూరు జిల్లా మెదక్ జిల్లాకు చెందిన కవిత, నెల్లూరు జిల్లాకు చెందిన జాన్ బాబూరావు, పాలమూరుకు చెందిన భారతిలను పట్టుకొని కాల్చివేశారు.

రాష్ట్ర విభజన తర్వాత ఆంధ్రప్రదేశ్‌లో అధికారానికి వచ్చిన చంద్రబాబు నాయుడు తన కార్పొరేట్ విధానాలను అమలు చేయడంలో భాగంగా అప్పుడే నిస్సిగ్గుగా బూటకపు ఎన్‌కౌంటర్లకు పాల్పడుతున్నాడు. తన గత తొమ్మిదేళ్ల పాలనకు, మధ్యలో పదేళ్ల కాంగ్రెస్ పాలనకు కొనసాగింపుగా ఆయన తన ప్రజావ్యతిరేక విధానలను, ఎన్‌కౌంటర్ హత్యలను ప్రారంభించాడు. జూన్ 19న జరిగిన ఈ ఎన్‌కౌంటర్‌లో తమ రాష్ట్రానికి చెందిన ఇద్దర్ని పక్క రాష్ట్ర ప్రభుత్వం కాల్చేసినా తెలంగాణ ప్రభుత్వానికి చీమకుట్టినట్టు కూడా లేదు. మావోయిస్టు ఎజెండా అమలు చేస్తానంటున్న కేసీఆర్‌కు కనీసం చట్టబద్ధపాలనపట్ల అయినా గౌరవం ఉందా అని ప్రశ్నించాల్సి ఉంది. తాను మావోయిస్టు పార్టీ మీద, దాని అనుబంధ ప్రజా సంఘాల మీద నిషేధం ఎత్తివేయకుండా, ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన ఎన్‌కౌంటర్ గురించి మౌనం వహిస్తే ప్రజలు దాని అంతరార్థం తెలుసుకోకపోరు. తెలంగాణవాదులు కూడా ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన ఎన్‌కౌంటర్ గురించి మాట్లాడలేదు. మామూలుగా అయితే తెలంగాణ ప్రజలకు ఏ కష్టం వచ్చినా తమ నిరసన తెలిపే తెలంగాణ మేధావులు ఇప్పటి దాకా అసలు ఈ ఎన్‌కౌంటర్ జరిగినట్టు కూడా గుర్తించలేదు.

నిజానికి ప్రజలందరి ఉమ్మడి శత్రువు అంతకంత బలపడిన తరుణంలో ప్రగతిశీల, ప్రజాస్వామిక పక్షాలు ఎప్పటికన్నా మరింత విస్తృతంగా, సంఘటితంగా పనిచేయవలసిన అవసరం ఉంది. రాజ్యహింసను ఎప్పటికప్పుడు ప్రశ్నించవలసి ఉన్నది. బీజేపీ కేంద్రంలో అధికారంలోకి రావడం వల్ల హిందుత్వ ప్రమాదం మరింత ప్రమాదకరంగా పొంచి ఉన్నది. అది ఢిల్లీ నుండి దండకారణ్యం దాకా ఎక్కడికక్కడ తన ఎజెండా అమలు చేస్తూపోతున్నది. విప్లవోద్యమం ఎదుర్కొంటున్న సామ్రాజ్యవాద దోపిడి, అణచివేత, హిందుత్వ భావజాల ప్రమాదం ఇప్పుడు ఫాసిజంగా పరిణమించి దేశ ప్రజలందరి ఎదుట అత్యంత గంభీరమైన సమస్యగా నిలిచి ఉంది. లౌకిక ప్రజాస్వామిక ఐక్య ఉద్యమాలు వీటిని ఎదుర్కోకపోతే చరిత్ర చవిచూసిన ఘోరమైన ఫాసిస్టు పాలనను మళ్ళీ ఆహ్వానించినట్టే అవుతుంది. విప్లవోద్యమం వంటి ప్రత్యామ్నాయ రాజకీయాలు మొదలుకొని, భిన్న భావజాలాలు, సంస్కృతులు, జీవన విధానాలపైనా, ప్రజాపోరాటాలపైనా విరుచుకుపడుతున్న రాజ్యహింసకు వ్యతిరేకంగా గంటి ప్రసాదం మొదటి వర్ధంతి సభ (నిజానికి అటువంటి రాజ్యహింసలో భాగమే కా.గంటి ప్రసాదం హత్య) జరుపుతున్నాం. అందరికీ ఆహ్వానం.

*- అమరుల బంధుమిత్రుల సంఘం, విప్లవ రచయితల సంఘం*

ARUNATARA Monthly Journal of Revolutionary Writers' Association (VIRASAM)
• Published on 24/04/2014 303 - January-February, 2014





ప్రజా ప్రత్యామ్నాయాల్లో
# నూరేళ్ల కాళోజీ





## విరసం 24వ రాష్ట్ర మహాసభల దృశ్యాలు












Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Nagendra Printing Press, Vijayawada - 520 002.
Editor : Chalasani Prasad



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M167 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | [illegible] |
| వెనుక అట్ట | [illegible] |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Sumitha |
| పేజీలు విడదీసినది | Dhanusree |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |